# శ్రీకృష్ణ సూక్తి సుధాకరము

# [శ్రీమదాంధ్ర భగవద్గీత]



ప్రణీతము:

పోచిరాజు కామేశ్వర రావు

శ్రీకృష్ణాయ నమః

# శ్రీకృష్ణ సూక్తి సుధాకరము

## మూలము శ్రీమద్భగవద్గీత

ప్రణీతము:

పోచిరాజు కామేశ్వర రావు

# శ్రీకృష్ణ సూక్తి సుధాకరము

మూలము శ్రీమద్భగవద్గీత

అధ్యాయ విషయ సూచిక:



శ్రీకృష్ణాయ నమః

# శ్రీకృష్ణ సూక్తి సుధాకరము

మూలము శ్రీమద్భగవద్గీత

## అధ్యాయ మొకటి – అర్జున విషాద యోగము

ధృతరాష్ట్ర ఉవాచ:
ధర్మ క్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః
మామకాః పాండవైశ్చ కి మకుర్వత సంజయ

ధృతరాష్ట్రుని పలుకులు:

తే.గీ. చేరి యా కురుక్షేత్రము ధారుణి వర
ధర్మ భూమి నా వారును దమ్ముని సుతు
లంత నేమి చేసిరి సంజయా రణోత్సు
కతను వచియింపు మింక సకలము నాకు 1.

సంజయా ధర్మ క్షేత్రమైన కురుక్షేత్రమును జేరి నా వారైన దుర్యోధ నాదులును, పాండవులు నేమి చేసిరి చెప్పుము.

సంజయ ఉవాచ:
దృష్ట్వాతు పాండవానీకం వ్యూఢం దుర్యోధనస్తదా
ఆచార్య ముపసంగమ్య రాజా వచన మబ్రవీత్

సంజయుని పలుకులు:

తే.గీ. చూచి పాండవ సైన్యము సురుచిరంపు
వ్యూహమును ద్రోణుఁ గదిసి సుయోధనుండు
రాజు నాచార్యుని నరసి భాజనముగ
వచనములు వినయమ్ముతోఁ బల్కె నిట్లు 2.

పాండవ వ్యూహమును దుర్యోధనుఁడు చూచి గురువైన ద్రోణాచార్యుని సమీపించి యీ విధముగా పల్కెను.

పశ్యైతాం పాండు పుత్రాణా మాచార్య మహతీం చమూమ్
వ్యూఢాం ద్రుపద పుత్రేణ తవ శిష్యేణ ధీమతా

తే.గీ. పాండు తనయుల వ్యూహంపు ధ్వజిని నచట
ద్రుపద రాజ సూనుండు మీకు ప్రియ శిష్యుఁ
డు నతి ధీమంతుఁ డొనరింపఁ దనరు దానిఁ
జూడుఁ డాచార్య పుంగవ సుంత యిపుడు 3.

ఆచార్యా పాండు పుత్రుల సైన్యపు వ్యూహమును మీ శిష్యుఁడు ద్రుపద పుత్రుఁడు ధీమంతుడు పన్నినది చూడుఁడు.

అత్ర శూరా మహేష్వాసా భీమార్జున సమా యుధి
యుయుధానో విరాటశ్చ ద్రుపదశ్చ మహా రథః

తే.గీ. అందుఁ గలరు శూరులు మేటి యంపకాండ్రు
నాజి సములు తలంప భీమార్జునులకు
సాత్యకియు విరాటుండు రాజన్యుఁడు ద్రుప
దుఁడు మహారథి దురతిక్రముఁడు దురమున 4.

అచట భీమార్జునులకు సమాన మైన శూరులు విలుకాండ్రు, యుయుధానుఁడు, విరాటుఁడు, ద్రుపదుఁడు మహా రథులు కలరు.

ధృష్టకేతు శ్చేకితానః కాశీ రాజశ్చ వీర్యవాన్
పురుజిత్కుంతి భోజశ్చ శైబ్యశ్చ నరపుంగవః

తే.గీ. ధృష్టకేతుఁడు పురుజిత్తు ధీర వరుఁడు
చేకితానుఁడు శైబ్యుఁడు శ్రేష్ఠ నరుఁడు
కుంతిభోజ కాశీరాజ కువలయేశు
లు ఘనులు యశో విరాజితులు తనరంగ 5.

ధృష్టకేతుఁడు, చేకితానుఁడు, కాశీరాజు, పురుజిత్తు, కుంతిభోజుఁడు, శైబ్యుఁడు కలరు.

యుధామన్యుశ్చ విక్రాంత ఉత్తమౌజశ్చ వీర్యవాన్
సౌభద్రో ద్రౌపదేయాశ్చ సర్వ ఏవ మహారథాః

తే.గీ. మఱియు విక్రాంతుఁ డా యుధామన్యుఁ డుత్త
మౌజుఁడు బలవంతుఁడు నభిమన్యుఁ డరయ
ద్రౌపదేయు లెల్లరు మహా రథులు వారి
సైన్య మందు గురువరేణ్య సమర రతులు 6.

యుధామన్యుఁడు, నుత్తమౌజుఁడు, నభిమన్యుఁడు, నుపపాండవులు నందఱు మహా రథులు కలరు

అస్మాకం విశిష్టా యే తాన్నిబోధ ద్విజోత్తమ
నాయకా మమ సైన్యస్య సంజ్ఞార్థం తాన్ బ్రవీమి తే

తే.గీ. మన యనీక మందును నున్న ఘనులు విప్ర
పుంగవ చమూ విభుల నింక భూరి యశులఁ
దెలిపెదను మీ యెఱుకకునై తెల్లముగను
వారి నింపుగ గమనింప భావ్య మగును 7.

మన సైన్యమందు కల సేనా నాయకులను మీ రెఱుఁగుటకునై తెలిపెదను వినుఁడు బ్రాహ్మణోత్తమా

భవాన్ భీష్మశ్చ కర్ణశ్చ కృపశ్చ సమితింజయః
అశ్వత్థామా వికర్ణశ్చ సౌమదత్తి స్తథైవ చ

తే.గీ. మీరు భీష్ముఁడు కర్ణుఁడు వీర వరులు
కృపుఁడు సమితింజయుఁడు ఘనుఁడు పర వీర
దర్ప హారి యశ్వత్థామ ధరణి సురుఁడు
సౌమదత్తి వికర్ణులు శౌర్య ధనులు 8.

మీరు, భీష్ముఁడు, కర్ణుఁడు, కృపుఁడు, నశ్వత్థామ, వికర్ణుఁడు, సోమదత్తుఁడు మఱియు

అన్యేచ బహవః శూరాః మదర్థే త్యక్త జీవితాః
నానా శస్త్ర ప్రహరణాః సర్వే యుద్ధ విశారదాః

తే.గీ. ఇంకను గలరు పెక్కురు నంక మందుఁ
బ్రాణములు నా కొఱకు వీడు వారు శూరు
లస్త్ర సహితమ్ముగను వివిధాయుధముల
నందఱును యుద్ధ నైపుణు లార్య గనుమ 9.

ఇతరులు పెక్కుమంది శూరులు నా కొఱకు ప్రాణములు విడుచు వారు యుద్ధ
నిపుణు లనే కాస్త్రములు కలవారు కలరు

అపర్యాప్తం తదస్మాకం బలం భీష్మాభి రక్షితమ్
పర్యాప్తం త్విద మేతేషాం బలం భీమాభి రక్షితమ్

తే.గీ. భీష్మ రక్షణ మందున వెలసి యున్న
యట్టి మన బలఁగము గన నపరిమితము
భీమసేన రక్షణమున విడిసి యున్న
వారి వాహినిఁ బరికింపఁ బరిమితమ్ము 10.

భీష్ముని రక్షణములో నున్న మన సేన యపరిమితము. భీముని రక్షణములో నున్న వారి
బలము పరిమితము.

అయనేషు చ సర్వేషు యథా భాగ మవస్థితాః
భీష్మ మేవాభి రక్షంతు భవంతః సర్వ ఏవ హి

తే.గీ. అన్ని వేళల నెల్ల వ్యూహముల లోన
నప్రమత్తులై భీష్ముని సుప్రసిద్ధు
మీర లెల్ల మీ స్థలములఁ దోరముగను
గాచికొని యుండుఁడు విజయ కాంక్ష తోడ 11.

వ్యూహములో నందఱు మీ మీ స్థానములలో నుండి భీష్ముని నే రక్షింతురు గాక.

తస్య సంజనయన్ హర్షం కురువృద్ధః పితామహః
సింహనాదం వినద్యోచ్చైః శంఖం దధ్మౌ ప్రతాపవాన్

తే.గీ. అంత నతనికిఁ గలుగంగ హర్షము మది
సింహ నాద ముచ్చమ్ముగఁ జేసి ధృతిఁ బి
తామహుఁడు కురువృద్ధుఁడు భీమముగను
దాను బూరించె శంఖము దర్ప మడర 12.

అంత దుర్యోధనునకు హర్షము కలిగించుచుఁ బితామహుఁడు కురు వృద్ధుఁడు
సింహనాదము చేసి శంఖము పూరించెను.

తతః శంఖాశ్చ భేర్యశ్చ పణవానక గోముఖాః
సహసై వాభ్య హన్యంత స శబ్ద స్తుములోఽభవత్

తే.గీ. అంతఁ జెలరేఁగెఁ దప్పెట లానకముల
శంఖ భేరీ సగోముఖ శబ్దములు సు
ఘోరముగ భయకరములై కుంభినిం ద
టాలున నెగసి మ్రోఁగె నాడంబరములు 13.

అంత నొకే సారి శంఖములు, భేరులు, తప్పెటలు, గోముఖ వాద్యములు
భయంకరముగ యుద్ధ ధ్వనులు మ్రోగినవి.

తతః శ్వేతై ర్హయై ర్యుక్తే మహతి స్యందనే స్థితౌ
మాధవః పాండవశ్చైవ దివ్యౌ శంఖౌప్రదధ్మతుః

తే.గీ. తెల్లని గుఱాలు కట్టిన తేరు నందు
మేటి వాహనమ్మున నిల్చి మించి కృష్ణ
సవ్యసాచులు దివ్యంపు శంఖ వరము
లంచితముగ నిద్దఱును బూరించి రంత 14.

అంత తెల్లని గుఱ్ఱములున్న రథముపై నుండి కృష్ణార్జునులు తమ దివ్య శంఖములను

పూరించిరి.

పాంచజన్యం హృషీకేశో దేవదత్తం ధనంజయః
పౌండ్రం దధ్మౌ మహా శంఖం భీమ కర్మా వృకోదరః

తే.గీ. పాంచజన్యముఁ బూరింప వాసుదేవుఁ
డర్జునుఁడు దేవదత్తము నలరి యూఁద
భీమకర్ముఁడు బలశాలి భీమసేనుఁ
డంతఁ బౌండ్రముఁ బూరించె నంకమునకు 15.

శ్రీకృష్ణుఁడు పాంచజన్యమును, దేవదత్తము నర్జునుఁడు పౌండ్రమును భీముఁడు
పూరించిరి.

అనంత విజయం రాజా కుంతీ పుత్రో యుధిష్ఠిరః
నకులః సహదేవశ్చ సుఘోష మణిపుష్పకౌ

తే.గీ. పదపడి యనంత విజయముఁ బార్థుఁ డా యు
ధిష్ఠిరుండు పూరించెఁ గుంతీ తనయుఁడు
నకుల సహ దేవులు సుఘోష వికసిత మణి
పుష్పకమ్ముల నూఁదిరి ముదము మీఱ 16.

అనంత శంఖమును ధర్మరాజు, నకుల సహదేవులు సుఘోషము
మణిపుష్పకములను శంఖములను బూరించిరి.

కాశ్యశ్చ పరమేష్వాసః శిఖండీ చ మహారథః
ధృష్టద్యుమ్నో విరాటశ్చ సాత్యకి శ్చాపరాజితః

తే.గీ. దిట్ట విలుకాఁడు కాశీపతియు మహా ర
థుఁడు శిఖండి ధృష్టద్యుమ్ను లడర మఱి వి
రాటుఁడును సాత్యకి రణాపరాజితుండు
రాజ వరులు సంగ్రామాభిరతులు మఱియు 17.

కాశీరాజు, శిఖండి, ధృష్టద్యుమ్నుఁడు, విరాటుఁడు, సాత్యకి మఱియు

ద్రుపదో ద్రౌపదేయాశ్చ సర్వశః పృథివీపతే
సౌభద్రశ్చ మహాబాహుః శంఖాన్ దధ్ముః పృథక్పృథక్

తే.గీ. వేరు వేరుగ ద్రుపదుఁడు వీర వరుఁడు
ద్రౌప దేయులు శూరులు భూపతీంద్ర
ధీర వరుఁడు సౌభద్రుఁడు దీర్ఘ భుజుఁడు
నంత నూదిరి శంఖము లంతట ధృతి 18.

మహా రాజా! ద్రుపదుఁడు, ద్రౌపదీ సుతులు, నభిమన్యుఁడు, శంఖములను వేర్వేర పూరించిరి.

స ఘోషా ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్
నభశ్చ పృథివీంచైవ తుములో వ్యనునాదయన్

తే.గీ. అమ్మహా ఘోషము నభము నవని యందు
మారు మ్రోఁగుచుఁ గరము సంభ్రమము సెలఁగ
ధార్త రాష్ట్రులు సర్వులు నార్తి తోడఁ
దల్లడిల్లిరి యట గుండె లెల్ల నదర 19.

ఆ శంఖనాదములు భూమిని నాకాశమును దద్దరిల్లఁ జేయ కౌరవుల హృదయములు తల్లడిల్లినవి.

అథః వ్యవస్థితాన్ దృష్ట్వా ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః
ప్రవృత్తే శస్త్రసంపాతే ధనురుద్యమ్య పాండవః

తే.గీ. శస్త్రములు మొదలిడు తఱి సమర భూమి
నున్న ధార్తరాష్ట్రులఁ గాంచి యుత్సహించి
వీరుఁడు కపిధ్వజుఁడు మేటి విల్లు నెత్తి
యనియె నరుఁడు హృషీకేశు నరసి రాజ 20.

రాజా! యుద్ధ ప్రారంభమున ధార్తరాష్ట్రులను జూచి విల్లు నెత్తి యర్జునుఁడు శ్రీకృష్ణునితో నిట్లనియెను.

అర్జున ఉవాచ
సేనయో రుభయోర్మధ్యే రథం స్థాపయ మేఽచ్యుత

అర్జునుని పలుకులు

తే.గీ. రెండు సేనల మధ్యను భండనమ్ము
నందు నాదు రథ మ్మరవింద నయన
దేవకీ నందనా వాసుదేవ వేగ
నిల్పు మచ్యుత కనఁ గమనీయముగను 21.

రెండు సేనల మధ్య నా రథమును నిల్పు మచ్యుత యని అర్జునుఁడు పలికి యింకను

యావ దేతాన్నిరీక్షేఽహం యోద్ధు కామానవస్థితాన్
కైర్మయా సహ యోద్ధవ్య మస్మిన్ రణ సముద్యమే

తే.గీ. ఈ మహా రణోద్యమమున భీమ రథుల
నెన్న మిన్ననై చెలరేఁగి నన్ను గూడి
యేరు వచ్చిన వారిలో పోరు వారు
జాత యుద్ధాభిలాషులఁ జూతు నేను 22.

ఈ యుద్ధమున నుత్సహించిన వారిలో నాతో యుద్ధము చేయ వలసిన వారిని జూచెదను.

యోత్స్యమానా నవేక్షేఽహం య ఏతేఽత్ర సమాగతాః
ధార్త రాష్ట్రస్య దుర్బుద్ధేః యుద్ధే ప్రియ చికీర్షవః

తే.గీ. మేలు సేయంగఁ గోరుచు నాల మందు
ధార్తరాష్ట్రున కత్యంత ధూర్తునకును
నాజి సేయ వచ్చిన వారి నరయఁ దలఁతు 23.

నేను రాజుల నెల్లర దీన బంధు

దుర్బుద్ధి దుర్యోధనునకు సాహాహ్యము చేయ యుద్ధమునకు వచ్చిన వారిని౯
జూచెదను.

సంజయ ఉవాచ
ఏవ ముక్తో హృషీకేశో గుడాకేశేన భారత
సేనయో రుభయో ర్మధ్యే స్థాపయిత్వా రథోత్తమమ్

సంజయుని పలుకులు

తే.గీ. పలుక౯ బడ గుడాకేశుచే వచనము లిటు
భారతా హృషీకేశుఁడు నా రథ వర
మును రయమ్ముగ నుభయ చమువుల మధ్య౯
గౌశలమ్ముగ నునిచి యా కేశవుండు 24.

ఓ రాజా! యిట్లర్జునుఁడు పలుకగా శ్రీ కృష్ణుఁడు శ్రేష్ఠ రథమును రెండు సేనల మధ్య
నిల్పెను.

భీష్మ ద్రోణ ప్రముఖతః సర్వేషాం చ మహీక్షితామ్
ఉవాచ పార్థ పశ్యైతాన్సమావేతాన్ కురూనితి

తే.గీ. నిలిపి ద్రోణ భీష్ము లెదుట నిఖిల రాజ
లోకమునకు నెదుట నంత౯ బ్రాకటముగ౯
బలికె౯ బార్థ చూడుము కురు ప్రముఖుల సమ
రాగతుల నని శ్రీకృష్ణు౯ డర్జును గని 25.

భీష్మ ద్రోణుల యెదుట రాజులందఱి యెదుట నిలిపి యుద్ధమునకు వచ్చిన వీరిని
కురు వీరులను జూడు మని యర్జునునితో౯ గృష్ణుఁడు పలికెను.

తత్రాపశ్యత్ స్థితాన్ పార్థః పితౄనథ పితామహాన్
ఆచార్యాన్ మాతులాన్ భ్రాతౄన్ పుత్రాన్ పౌత్రాన్ సఖీం స్తథా
శ్వశురాన్ సుహృదశ్చైవ సేనయో రుభయో రపి

తే.గీ. పార్థుఁ డట నంతఁ గాంచె నప్పలను దాత
ల గురువుల మేనమామల భ్రాతలఁ దన
యుల మనుమల సఖుల శ్వశురుల సుజనుల
నుభయ సేనల నడుమున నున్న వారి 26.

పార్థుఁడు రెండు సేనల మధ్య యుద్ధమున నిల్చిన తండ్రుల తాతల గురువుల మేన
మామల సోదరుల పుత్రుల మనుమల సఖుల మామల సుజనులను జూచెను.

తాన్ సమీక్ష్య స కౌంతేయః సర్వాన్ బంధూనవస్థితాన్
కృపయా పరయా నిష్టో విషీదన్నిదమబ్రవీత్

తే.గీ. బంధువుల నందఱ ననికి వచ్చి నట్టి
వారిఁ గుంతీ కుమారుఁ డేపార దయ భృ
శమ్ముగ మదిఁ గాంచి యంత విచార పడుచు
మిక్కిలి పలికె నివ్విధి నక్కజముగ 27.

వారి నిల్చిన బంధువులను జూచి జాలితో విచారముగా నర్జునుఁ డిట్లు పలికెను.

దృష్ట్వేమం స్వజనం కృష్ణ యుయుత్సవం సముపస్థితమ్

సీదంతి మమ గాత్రాణి ముఖంచ పరిశుష్యతి
వేపథుశ్చ శరీరే మే రోమహర్షశ్చ జాయతే

తే.గీ. యుద్ధ మొనరింప మనమున నుత్సహించి
చలమున నరుదెంచిన నిజ జనులు ధీరు
లిచట నిల్చిరి విక్రమ మెంచి మదిని
వీరిఁ గాంచ నిపుడు కృష్ణ వీర వరుల 28.

తే.గీ. క్రుంగు చున్నవి భృశము నా యంగము లివి
యెండు చున్నది నానోరు మెండుగాను 29.

వణఁకు చున్నది దేహము ప్రస్ఫుటముగ
గగురుపా టగు చున్నది కలవరమున

ఉత్సహించి వచ్చిన స్వజనులను జూచి కృష్ణ నా యవయువములు క్రుంగుచున్నవి,
నోరు తడి యాఱు చున్నది, మేను వణఁకు చున్నది, యొళ్ళు జలదరించుచున్నది.

గాండీవం స్రంసతే హస్తాత్ త్వక్చైవ పరిదహ్యతే
న చ శక్నోమ్యవస్థాతుం భ్రమతీవ చ మే మనః

తే.గీ. కరము విడి పడుచున్నది గాండివమ్ము
మండు చున్నది మిగుల చర్మమ్ము నాకు
నుడిగినది శక్తి నిలఁబడి యుండుటకును
మనము నందుఁ గాంచంగ సంభ్రాంతి వొడమె 30.

గాండీవము చే జాఱుచున్నది, చర్మము మండుచున్నది, నిలబడుటకు శక్తి చాల
కున్నది, మనస్సు భ్రమించుచున్నది.

నిమిత్తానిచ పశ్యామి విపరీతాని కేశవ
న చ శ్రేయోఽనుపశ్యామి హత్వా స్వజన మాహవే

తే.గీ. సూచకములు సెఱపునకుఁ జూచు చుంటి
శకునములను బెక్కింటిని సంగరమునఁ
గేశవ తనవారి వధింపఁ గీడె కాని
మేలు పిదప సుంతయుఁ జూడఁ జాల నకట 31.

కేశవ! దుర్నిమిత్తములు కనిపించుచున్నవి, రణమున మనవారిని చంపిన మేలు
గాంచలేను.

న కాంక్షే విజయం కృష్ణ న చ రాజ్యం సుఖాని చ
కిం నో రాజ్యేన గోవింద కిం భోగైర్జీవితేన వా

తే.గీ. కోర నీ రాజ్యమును గృష్ణ కోర నీ వి 32.

జయమును సుఖమ్ము నైన రాజ్య మది యేల
మాకు గోవింద భోగ సమాజము లవి
యేల జీవితమ్ము నదియు నేల యింక

గోవింద విజయము, రాజ్యము సుఖములు కూడా వలదు. భోగము లేల జీవితమేల?

యేషా మర్థే కాంక్షితం నో రాజ్యం భోగాః సుఖాని చ
త ఇమేఽవస్థితా యుద్ధే ప్రాణాం స్త్యక్త్వా ధనాని చ

తే.గీ. ఎవ్వరి కొఱకు రాజ్యము నీ సుఖమ్ము
లు మఱి భోగములను గోరితి మిట మేము
వారు విడిచి యాశను నిజ ప్రాణ ధనము
లందు నిల్చిరి చూడుమ యంక మందు 33.

ఎవరి కొఱకు మన మీ రాజ్యము సుఖమును కోరుచున్నామో వారే ప్రాణముల మీద నాశ వదలి యుద్ధమున నిలిచి యున్నారు.

ఆచార్యాః పితరః పుత్రాః తథైవ చ పితామహాః
మాతులాః శ్వశురాః పౌత్రాః శ్యాలాః సంబంధిన స్తథా

తే.గీ. పూజ్య గురువులు జనకులు పుత్ర గణము
లు మఱియు పితామహులు మామలు మఱి మేన
మామలు మనుమలును బావమఱఁదు లింక
బంధు వర్గము సర్వము భండనమున 34.

గురువులు, తండ్రులు, తాతలు, కొడుకులు, మనుమలు, మేనమామలు, మామలు, బావమఱదులు, బంధువులు నందఱును నిల్చిరి.

ఏతాన్న హంతుమిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన
అపి త్రైలోక్య రాజ్యస్య హేతోః కిం ను మహీకృతే

తే.గీ. వీరి నేఁ జంప నొల్లను వీరు నన్ను 35.

జంప నున్నను నింక ముజ్జగముల కొఱ
కైన నన్ను మహీతలం బనఁగ నేల
చెప్పు మధుసూదన హృదయ మొప్ప దిపుడు

ముల్లోకముల యాధిపత్యమునకునైన వీరిని నేను జంపను. రాజ్యమెంత! నన్ను జంప నెంచినను మధుసూదన నేను జంపను.

నిహత్య ధార్తరాష్ట్రాన్నః కా ప్రీతిః స్యాజ్జనార్దన
పాపమేవాశ్రయేదస్మాన్ హత్వైతానాతతాయినః

తే.గీ. చంప దుర్యోధ నాదుల సమర మందు
హర్ష మేమి కలుగు మన కందఱకును
దుష్టు లైన వీరి వధింపఁ దోరముగను
బాపమే కల్గు మాకు నవారితముగ 36.

ధార్తరాష్ట్రులను జంపిన నేమి ప్రీతి? దుష్టులయినను జంపిన మనకు పాపమే కల్గును.

తస్మాన్నార్హావయం హంతుం ధార్తరాష్ట్రాన్ స్వబాంధవాన్
స్వజనం హి కథం హత్వా సుఖినః స్యామ మాధవ

తే.గీ. ధార్త రాష్ట్రులు బంధు సంతతియె కాన
చంపఁ జనదు మనకు వారి సమర మందు
స్వజను లైన వారిని నెల్ల జంప నెట్లు
సుఖుల మగుదుము మాధవ సుంత యైన 37.

స్వజనులు కావున ధార్తరాష్ట్రులను జంప మన మర్హులము కాము. వారి జంపి సుఖముగా నెట్లుండ గలము?

యద్యపి తే న పశ్యంతి లోభోప చేతసః
కులక్షయ కృతం దోషం మిత్ర ద్రోహే చ పాతకమ్

తే.గీ. వంశ ఘోర విధ్వంసము వలని దోష
మింతయును మది నెంచక యింక లోభ
చేతనమున మిత్రద్రోహ పాతకమును
బన్నుగ మఱి వా రిటఁ జూడ కున్న నైన 38.

లోభము వలన వారు కులనాశనపు దోషమును మిత్ర ద్రోహ పాపమును జూడకున్న యెడల

కథం న జ్ఞేయ మస్మాభిః పాపాదస్మాన్నివర్తితుమ్
కులక్షయ కృతం దోషం ప్రపశ్యద్భిర్జనార్దన

తే.గీ. కుల వినాశమునఁ గలుగు కలుష మంచి
తముగ నెఱిఁగిన మనము గూడ మఱి తివిరి
యీ యఘమ్ము నివర్తింప నిపుడు తెలియ
కున్న నెట్లు జనార్దన యుక్త మగును 39.

కులనాశన పాపము నెఱిగిన మనము కూడా దీనిని వారింపకున్న భావ్యమే జనార్దన?

కులక్షయే ప్రణశ్యంతికుల ధర్మాః సనాతనాః
ధర్మే నష్టే కులం కృత్స్న మధర్మోఽభిభవత్యుత

తే.గీ. కుల మది నశింప లయ మగు నల సనాత
నములు కుల ధర్మములు సకలములు ధర్మ
నాశనమ్మున కుల మంత యాశువుగ ము
సరు ననాచార మక్కట సంతతమ్ము 40.

కులము నశించిన సనాతన కుల ధర్మములు నశించును. ధర్మము నశించిన కులమున ననాచారము వ్యాపించును.

అధర్మాభి భవాత్కృష్ణ ప్రదుష్యంతికులస్త్రియః
స్త్రీషు దుష్టాసువార్ష్ణేయ జాయతే వర్ణసంకరః

తే.గీ. చెడుదురు కులకాంతలు కృష్ణ బెడిదముగ న
ధర్మ మతిశయింప ధరణిఁ దరుణులు చెడి
నంత వార్ష్ణేయ జనియించు వింత వింత
వర్ణ సంకరములు నిరవధిక మింక 41.

అధర్మము పెరిగిన కుల స్త్రీలు చెడిపోవుదురు. వారు చెడిన వర్ణసంకరములు
కలుగును కృష్ణ.

సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్య చ
పతంతి పితరో హ్యేషాం లుప్త పిండోదక క్రియాః

తే.గీ. కులమునకును గులఘ్నులకును నరక మొ
సంగు వర్ణ సంకర మవశ్యమ్ము కృష్ణ
వారి పితరులు తథ్యమ పతిత మౌదు
రింకఁ బిండోదకమ్ముల శంక తోడ 42.

కృష్ణ వర్ణసంకరము కులమును కులఘ్నులను నరకమునకు త్రోయును. వారి పితృ
దేవతలు పిండోదకములు లేక పతన మౌదురు.

దోషై రేతైః కులఘ్నానాం వర్ణ సంకర కారకైః
ఉత్పాద్యంతే జాతి ధర్మాః కుల ధర్మాశ్చ శాశ్వతాః

తే.గీ. వర్ణ సంకర కారక పాపము లవి
కుల వినాశకుల సకల కుల పురాత
న వర ధర్మముల మఱి ఘన తర జాతి
ధర్మముల లయ మొనరించు దారుణముగ 43.

వర్ణసంకర కారకములైన యీ దోషములు కులఘ్నుల కుల ధర్మములను జాతి
ధర్మములు నశింప జేయును.

ఉత్సన్న కుల ధర్మాణాం మనుష్యాణాం జనార్దన

నరకేఽనియతం వాసో భవ తీ త్యనుశుశ్రుమ

తే.గీ. తమదు కుల ధర్మము లీఁకఁ బతన మయిన న
రులకు నరక నివాసమ్ము కలుగును జిర
కాల మని జనార్దన పలుకంగ వినమె
సత్య దూరములే యా వచనము లెల్ల 44.

జనార్దన! కుల ధర్మములు పతన మైన నరులకు నరక వాసము తప్ప దని విందుము.

అహో బత మహత్పాపం కర్తుం వ్యవసితా వయమ్
యద్రాజ్య సుఖ లోభేన హంతుం స్వ జనముద్యతా

తే.గీ. రాజ్య సుఖములఁ గాంక్షించి రణము నందు
స్వీయ జనుల వధింప నెంచితిమి ఘోర
పాపమును జేయ ధృతిఁ దలపడితి మకట
మేము దీని మించిన శోక మేమి కలదు 45.

రాజ్య సుఖముల కొఱకు నక్కట స్వజనులనే చంప నుద్యమించితిమి. మహా పాపమునకు నొడఁబడితిమి.

యది మామప్రతీకార మశస్త్రం శస్త్ర పాణయః
ధార్తరాష్ట్రే రణే హన్యుః తన్మే క్షేమతరం భవేత్

తే.గీ. ఎదురు కొన నిచ్చ గింపని యెట్టి యస్త్ర
మును ధరించ నొల్లని నన్ను ననినిఁ జంప
నెంచినను ధార్త రాష్ట్రులు మించి శస్త్ర
పాణు లది క్షేమ తరమునై పరఁగు నాకు 46.

ఎదిరించని నన్ను శస్త్ర హీనుని ధార్తరాష్ట్రులు శస్త్రపాణులు చంపిన నది నాకు క్షేమతరమే యగును.

సంజయ ఉవాచ

ఏవముక్త్వా ర్జునః సంఖ్యే రథోపస్థ ఉపావిశత్

విసృజ్య సశరం చాపం శోక సంవిగ్న మానసః

సంజయుని పలుకులు:

తే.గీ. పలికి యర్జునుఁ డివ్విధి భండనమున

విల్లు బాణము తోడుత విడిచి యంత

శోక సంతప్త చిత్తుఁడై వీఁక వీడి

యరద మందునఁ గూర్చుండె నబ్బురముగ 47.

సంజయుని పలుకులు.

అర్జునుఁ డివ్విధి పలికి బాణములతో సహా వింటిని వీడి శోకమున మునిఁగి రథమునఁ జతికిలఁబడెను.

ఇది శ్రీకృష్ణ సూక్తి సుధాకరమను శ్రీమదాంధ్ర భగవద్గీత యందు నర్జున విషాద యోగమను మొదటి యధ్యాయము.

వోచిరాజు కామేశ్వర రావు నామధేయ ప్రణీతము.

శ్రీకృష్ణాయ నమః

# శ్రీకృష్ణ సూక్తి సుధాకరము

మూలము శ్రీమద్భగవద్గీత

## అధ్యాయము రెండు – సాంఖ్య యోగము

సంజయుని పలుకులు.

తం తథా కృపయావిష్ట మశ్రు పూర్ణాకులేక్షణమ్
విషీదంత మిదం వాక్య మువాచ మధుసూదనః

తే.గీ. అట్లు జాలి గూడిన వాని నత్యధిక మ
లమట వొందిన వాని నేత్రముల నిండ
వేడి కన్నీరు నిండిన వీరు నర్జు
నుని నరసి మధుసూదనుఁ డనియె నిట్లు 1.

అట్లు జాలి గూడిన వానిని, నధికముగా చింత నొందిన వానినిఁ, గన్నుల నీరు నిండిన వానిని నర్జునునిఁ జూచి మధుసూదనుఁ డిట్లు పలికెను.

శ్రీ భగవానుని పలుకులు.

కుత స్త్వా కశ్మల మిదం విషమే సముపస్థితమ్
అనార్య జుష్ట మస్వర్గ్య మకీర్తికర మర్జున

తే.గీ. కూడు నట్టిదియ యవివేకుల మనమున
స్వర్గ మీయ నట్టిదియు యశము హరించు
నట్టి యీ మోహ మెటఁ గల్గె నకట నీకు
నర్జున విషమ సమయమ్ము నందు నిట్లు 2.

అవివేకులకు కూడునది, స్వర్గమీయఁ జాలనిది, కీర్తిని హరించునది యైన యీ మోహ మర్జున యీ విషమ సమయములో నీ కెక్కడ కల్గినది?

క్లైబ్యం మాస్మ గమః పార్థ నై తత్త్వ య్యుపపద్యతే
క్షుద్రం హృదయ దౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప

తే.గీ. పేడితన మింక నర్జున వీడు మిచట
తగదు నీకిది యెల్ల క్షుద్రమ్ము హృదయ
మందు దౌర్బల్యమును వీడి యరి నిషూద
న సుధృఢ మతివై లెమ్ము దనర జవమ్ము 3.

నపుంసకత్వము నర్జున వీడుము. ఇది నీచము నీకు తగదు. హృదయములో నిస్సత్తువను వీడి దృఢ చిత్తుఁడవై లెమ్ము.

అర్జున ఉవాచ
కథం భీష్మ మహం సంఖ్యే ద్రోణం చ మధుసూదన
ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హా వరిసూదన

అర్జునుని పల్కులు.

తే.గీ. భీష్ముని౯ బితామహుని౯ గురువృద్ధు నింక
ద్రోణు నాచార్యు౯ బూజ్యులు దురము నందు
వారి నెదిరించి శరముల ఘోరముగను
యుద్ధ మే నెట్లు సలుపంగ నోప గలను 4.

ఓ మధుసూదనా భీష్ముని, ద్రోణుని పూజ్యులను బాణములతో యుద్ధమున నే నెట్లు చంపగలను?

గురూ నహత్వా హి మహానుభావాన్ శ్రేయో భోక్తుం భైక్ష్య మ పీహ లోకే
హత్వార్థ కామాంస్తు గురూ నిహైవ భుంజీయ భోగాన్ రుధిరప్రదిగ్ధాన్

తే.గీ. పెద్దల వధించక ఘనుల బిక్ష మెత్తు
కొనుట మే లగు హతమార్చి గురువుల నిఁక
రక్త సిక్తము లయిన యర్థములు కామ
భోగము లనుభవింతు నప్పుడు దలంప 5.

తాత్పర్యము సుగమము

న చైతద్విద్మః కతరన్నో గరీయో యద్వా జయేమ యది వా నో జయేయుః
యానేవ హత్వా న జిజీవిషామః తేఽవస్థితాః ప్రముఖే ధార్త రాష్ట్రాః

తే.గీ. ఏరిఁ జంపి యిక మనఁగఁ గోరమో మ
న మిట వా రుండి రెదుటఁ గనంగ ధార్త
రాష్ట్రులు, జయింతుమొ మఱి వారలె జయింపఁ
గలరొ యేది హితమగునొ తెలియ రాదు 6.

తాత్పర్యము సుగమము.

కార్పణ్య దోషోపహత స్వభావః అపృచ్ఛామి త్వాం ధర్మ సమ్మూఢ చేతాః
యచ్ఛ్రేయః స్యాన్నిశ్చితం బ్రూహి తన్మే శిష్యస్తేఽ హం త్వాం ప్రసన్నమ్

తే.గీ. జాలి హరియింపఁగ మనము తూల ధర్మ
మెఱుఁగ మూఢుఁడ నడుగుదు వెఱచి నేను
శ్రేయ మెయ్యది ధ్రువముగఁ జెప్పుమ శర
ణాగతుఁడ శిష్యుఁడను నాకు నాన తిమ్ము 7.

తాత్పర్యము సుగమము.

న హి ప్రపశ్యామి మమాపనుద్యాద్
యచ్ఛోకముచ్ఛోషణమిన్ద్రియాణామ్ ।
అవాప్య భూమావసపత్నమృద్ధం
రాజ్యం సురాణామపి చాధిపత్యమ్ ॥

తే.గీ. ధరఁ బగతురు లేని మహోన్నత మయి నట్టి
రాజ్యము సురాధిపత్యము భోజ్య మైన
నింద్రియమ్ముల వేధించు నిట్టి శోక
ము నిఁక వారించెడు విధానము గన నేర 8.

సఞ్జయ ఉవాచ ।
ఏవముక్త్వా హృషీకేశం గుడాకేశః పరన్తప ।
న యోత్స్య ఇతి గోవిన్దముక్త్వా తూష్ణీం బభూవ హ ॥

సంజయుని పలుకులు.

తే.గీ. పలికి యా గుడాకేశుఁడు పర దమనుఁడు
నా హృషీకేశుతో నిట్లు నాజి సేయ
నంచు గోవిందుఁ దిలకించి యంతఁ బలికి
మిన్న కుండెను రథమందు వెన్ను నెదుట 9.

ఇట్లర్జునుఁడు కృష్ణుని తోఁ దా నిఁక యుద్ధము చేయలే నని పలికి యూఱకుండెను.

తమువాచ హృషీకేశః ప్రహసన్నివ భారత ।
సేనయోరుభయోర్మధ్యే విషీదన్తమిదం వచః ॥

తే.గీ. రెండు సేనల మధ్యను మెండుగ విల
పించు నాతని నవ్వుచుఁ గాంచి యంత
నా హృషీ కేశుఁ డనునయ మతిశ యిల్ల
భారత వచించె నీ రీతి భాషణములు 10.

ధృతరాష్ట్ర మహారాజా రెండు సేనల మధ్య విచారించు నర్జునుని జూచి నవ్వుచు కృష్ణుఁ
డిట్లనెను.

శ్రీభగవానువాచ ।
అశోచ్యానన్వశోచస్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే ।
గతాసూనగతాసూంశ్చ నానుశోచన్తి పణ్డితాః ॥

శ్రీ భగవానుని పలుకులు.

తే.గీ. తగని వారికి శోకింపఁ దలపడితివి
జ్ఞాని వలెఁ బలికెదవు వచనము లెల్ల
నసువు లుడగని యుడిగిన యట్టి వారి 11.

కిని విచారించరు విబుధ జనులు వినుమ

సుగమము. ప్రాణములున్న వారికిని లేని వారికిని పండితులు విచారించరు.

న త్వేవాహం జాతు నాసం న త్వం నేమే జనాధిపాః ।
న చైవ న భవిష్యామః సర్వే వయమతః పరమ్ ॥

తే.గీ. ఏను నొక తరి మఱి నీవు నీ నరాధి
పులును లేరనుటయు లేదు తలఁప నిజము
మఱియు నిఁకఁ బిమ్మట నిచట మనము నిక్క
ముండ మందఱ మనుటయు నుండఁ బోదు 12.

నేను నీవు నీ రాజులు నొకప్పుడు లేరనుట నిజము కాదు. ఇక ముందు కూడా మన మందఱము నుండుటయు నిజము.

దేహినోఽస్మిన్యథా దేహే కౌమారం యౌవనం జరా ।
తథా దేహాన్తరప్రాప్తిర్ధీరస్తత్ర న ముహ్యతి ॥

తే.గీ. దేహి వసియించు చుండఁగఁ దివిరి దేహ
మునఁ బసితనము యౌవనము ముదిమియును
గలుగు రీతి నితర దేహములను దేహి
వొందుఁ బిదప ధీరులు మోహ మంద రెపుడు 13.

శరీర మున్నప్పుడు బాల్యము, యౌవనము, ముసలి తనము పొందు నట్లు మరణించి యితర దేహములను బొందుదురు. దానికి ధీరులు మోహము సెందరు.

మాత్రాస్పర్శాస్తు కౌన్తేయ శీతోష్ణ సుఖ దుఃఖదాః ।
ఆగమాపాయినోఽనిత్యాస్తాంస్తితిక్షస్వ భారత ॥

తే.గీ. ఇంద్రియము లైదు కౌంతేయ యిచ్చును సుఖ
దుఃఖ శీతోష్ణముల నింకఁ దోరముగను
వచ్చుచుం బోవు నుండవు నిచ్చ లెల్ల 14.

భారత సహింపుమ ధృతి విచార మేల

ఇంద్రియము లైదింటి వలన సుఖ దుఃఖములును శీతోష్ణములును వచ్చుచు బోవుచుండును. నిత్యములు గావు. కుంతీ కుమార సహింపుము.

యం హి న వ్యథయన్త్యేతే పురుషం పురుషర్షభ ।
సమదుఃఖసుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే ॥

తే.గీ. ఎవని నివి యెల్ల వేధించ నెఱుఁగ వెవ్వ
డుండు సుఖముల బాధల నొక్క విధము
నా పురుషుఁడు ధీరుం డిఁక నర్హుఁ డగును
బొంద నమృతత్వ మింపుగఁ బురుష ముఖ్య 15.

ఎవనిని యివి బాధించ లేవో యెవడు సుఖ దుఃఖములందు సమానముగా నుండునో యా పురుషుఁడు ధీరుఁడు. అమరత్వము పొందుట కర్హుఁడు.

నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః ।
ఉభయోరపి దృష్టోఽన్తస్త్వనయోస్తత్త్వదర్శిభిః ॥

తే.గీ. సతము కాని దాని కునికి సతము నైన
దానికి నభావముఁ దలఁపఁ గాన రాదు
గలవరము లేకయు నుభయముల స్వభావ
మంతయుఁ బరమ దైవజ్ఞు లరయఁ గలరు 16.

అనిత్యమైన దానికి (అనగా దేహము) నుండుట యన్నది లేదు. నిత్యమైన (అనగా నాత్మ) దానికి లేకపోవుట లేదు.  రెంటి స్వభావము తత్త్వజ్ఞులు తెలిసికొనగలరు.

అవినాశి తు తద్విద్ధి యేన సర్వమిదం తతమ్ ।
వినాశమవ్యయస్యాస్య న కశ్చిత్కర్తుమర్హతి ॥

తే.గీ. దేని వలన నడరె జగతి సకలమ్ము
నెఱుఁగు మవినాశ మని యది యెవరి కైన 17.

దాని నాశన మొనరింపఁ దరము గాదె
యవ్యయం బైన తత్వ మయ్యది తలంప

దేని వలన యీ జగతి యంతయు వ్యాపించినదో దానిని నాశము లేనిదిగా
తెలిసికొనుము. దానిని నెవరు నాశము చేయ లేరు. అది అవ్యయము.

అన్తవన్త ఇమే దేహా నిత్యస్యోక్తాః శరీరిణః ।
అనాశినోఽప్రమేయస్య తస్మాద్యుధ్యస్వ భారత ॥

తే.గీ. ఆరయ నవినాశుఁడు నిత్యుఁ డప్రమేయ
దేహి యొక్క యీ తనువులు తెల్లముగ న
శించు నట్టివి యొక తరి యంచుఁ జెప్పఁ
బడును భారత కాన బవర మొనర్చు 18.

దేహి నాశనము లేని వాడు, నిత్యుడు మితి లేని వాడు. దేహములు నశించును.
కావున యర్జున యుద్ధము చేయుము.

య ఏనం వేత్తి హన్తారం యశ్చైనం మన్యతే హతమ్ ।
ఉభౌ తౌ న విజానీతో నాయం హన్తి న హన్యతే ॥

తే.గీ. హంతగఁ దలఁచు వారును హతముగ మదిఁ
దలఁచు వారు దీనిని నిద్ద ఱల తెలియని
వారు సుమ్ము చంపదు చంపఁ బడదు కూడ
నిక్కముగ నెన్న డియ్యది యెక్క డైన 19.

ఆత్మను చంపు వానిగా దలచిన వాడు, చంపబడి నట్లుగాను దలచిన వాడు
నిద్దఱును తెలియని వారే. అది చావబడదు చంపదు.

న జాయతే మ్రియతే వా కదాచి న్నాయం భూత్వా భవితా వా న భూయః ।
అజో నిత్యః శాశ్వతోఽయం పురాణో న హన్యతే హన్యమానే శరీరే ॥

తే.గీ. ఎన్నఁ డిది పుట్టదు మఱి చా వెఱుఁగ నదియు 20.

నుండినదియుఁ గాదు మఱల నుండు నదియుఁ
గాదు సుమ్మిది స్థిరము ననాది శాశ్వ
తమ్మజము చావదు తనదు తను వెడలిన

ఈ యాత్మ పుట్టదు చావదు. శాశ్వతము ఒకప్పు డున్నదియు లేనిదియు కాదు.
శరీరము పోయినను యిది చావదు.

వేదావినాశినం నిత్యం య ఏనమజమవ్యయమ్ ।
కథం స పురుషః పార్థ కం ఘాతయతి హన్తి కమ్ ॥

తే.గీ. నిత్య మవినాశనము పుట్టనిదియు నవ్య
యమ్ము దీనిని నెఱిఁగిన యట్టి యే పు
రుషుఁ డెవరి నెట్లు చంపఁ గలుగును మఱియు
పార్థ యేరినిఁ జంపించు వాఁ డరయగ 21.

ఎల్లప్పుడు నుండునది, నశించనిది, పుట్టనిది దీనిని నెఱిగిన వాఁ డెవరిని నెట్లు
చంపగలఁడు? చంపించగలఁడు?

వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరోఽపరాణి ।
తథా శరీరాణి విహాయ జీర్ణాన్యన్యాని సంయాతి నవాని దేహీ ॥

తే.గీ. చినిగి నట్టి బట్టలు విడిచి సరి క్రొత్త
బట్టలు నరు లితరములు వడయు పగిది
జీర్ణ దేహములను వీడి చేరు నితర
నవ్య కాయములను దేహి భవ్యముగను 22.

నరులు పాత బట్టలు విడిచి క్రొత్త బట్టలు ధరించు నట్లు దేహి పాత శరీరమును వీడి
క్రొత్త శరీరమున ప్రవేశించును.

నైనం ఛిన్దన్తి శస్త్రాణి నైనం దహతి పావకః ।
న చైనం క్లేదయన్త్యాపో న శోషయతి మారుతః ॥

తే.గీ. కోయ జాల వాయుధములు కొంచ మైన
నరయ జాలదు మండింప నగ్ని సుంత
చేరి తడుపంగ నేరదు నీర మింత
కదలి యెండింపఁ జాలదు గాలి దీని 23.

ఆత్మ నాయుధములు కోయ జాలవు. అగ్ని కాల్చ లేదు. నీళ్ళు తడుపలేవు. గాలి యెండింపఁ జాలదు.

అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయమక్లేద్యోఽశోష్య ఏవ చ ।
నిత్యః సర్వగతః స్థాణురచలోఽయం సనాతనః ॥

తే.గీ. నఱుకఁ బడని దిది మఱి మండఁ బడనిదియుఁ
దడుపఁ బడనిది యిది యెండఁ బడనిదియును
నిత్యము స్థిర మచలము నన్నిదిశ లొలయు
నిది తలంప సనాతనం బిది నిజమ్ము 24.

నిత్యమైనది, స్థిరమైనది, చలించనిది, అన్ని దిక్కుల నుండునది, పురాతన మయినది, నఱకఁబడనిది, మండఁబడనిది, యెండఁబడనిది, తడుపఁబడనిది యీ యాత్మ.

అవ్యక్తోఽయమచిన్త్యోఽయమవికార్యోఽయముచ్యతే ।
తస్మాదేవం విదిత్వైనం నానుశోచితుమర్హసి ॥

తే.గీ. తెలియఁ బడనిది చింత కిది దొరకనిది
దీని నవికారి యని చెప్పితి రిటఁ గాన
నెఱిఁగి దీని నీ రీతిగ నెన్నఁ డింక
వగపు నొందఁగ మనమందుఁ దగదు నీకు 25.

తెలియ రానిది, చింతింప దగనిది, వికారము చెందని దని చెప్పబడును గావున నది తెలిసికొని చింత నొంద రాదు.

అథ చైనం నిత్యజాతం నిత్యం వా మన్యసే మృతమ్ ।

తథాపి త్వం మహాబాహో నైవం శోచితుమర్హసి ॥

తే.గీ. నిత్య ముదయించు నంచును నిత్యము మఱి
యీల్గు నంచు దీనిని నెంచి తేని నీవు
చిత్త మందు ధృఢమ్ముగ నత్తెరి నయి
నను మహాబాహు శోకమునఁ బడఁ దగదు 26.

ఈ యాత్మకు చావు పుట్టుక లున్నవని నీవు తలచినను దానికి శోకించరాదు.

జాతస్య హి ధ్రువో మృత్యుర్ధ్రువం జన్మ మృతస్య చ ।
తస్మాదపరిహార్యేఽర్థే న త్వం శోచితుమర్హసి ॥

తే.గీ. వచ్చు మరణము పుట్టిన వారి కెల్ల
జన్మ కలుగుటయు ధ్రువము సచ్చినంతఁ
దప్ప నట్టి యిట్టి పనులు దలఁచి తలఁచి
వంతఁ జెందంగ నీకు భావ్యమ్ము గాదు 27.

పుట్టినవాఁడు చచ్చును. చచ్చిన వాఁడు మఱల పుట్టును. తప్పనట్టి యిట్టి వానికి
నీవు చింతించరాదు.

అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత ।
అవ్యక్తనిధనాన్యేవ తత్ర కా పరిదేవనా ॥

తే.గీ. పుట్టక మునుపు గనిపించవు కద మఱియు
గిట్టినను గనిపించవె యెట్టి భూత
ములు నడుము నంద గోచరము లవి దాన
నేల భారత శోకించ నింక నీకు 28.

పుట్టక ముందు కనిపించవు, మరణించిన పిదప కనిపించవు మధ్యలో మాత్రమే
కనిపించు వీని కేల చింతింతు వర్జున.

ఆశ్చర్యవత్పశ్యతి కశ్చిదేనమాశ్చర్యవద్వదతి తథైవ చాన్యః ।

ఆశ్చర్యవచ్చైనమన్యః శృణోతి శ్రుత్వాప్యేనం వేద న చైవ కశ్చిత్ ॥

తే.గీ. అరయు నొకఁ డిట నాశ్చర్య మైన దంచు
నన్యుఁడు వలుకు నాశ్చర్య మైన దంచు
నలరి విను నొకఁ డాశ్చర్య మైన దంచు
నెఱుఁగ రకట వినిన దీని నెవ్వ రింక 29.

ఆశ్చర్యముగా చూచు నొకఁడు, పలుకు నొకఁ డాశ్చర్యముగా, విను నొఁక డాశ్చర్యముగ. అయిన నెవ్వఁడు దీని నెఱుఁగఁడు.

దేహీ నిత్యమవధ్యోఽయం దేహే సర్వస్య భారత ।
తస్మాత్సర్వాణి భూతాని న త్వం శోచితుమర్హసి ॥

తే.గీ. అరయఁ బ్రతి వాని దేహము నందు నున్న
యట్టి యీ దేహి సత మవధ్యమ్ము సుమ్ము
కాన భారత చనదు వగవఁగ నీకు
సకల భూతముల కొఱకు వికలముగను 30.

ప్రతి వాని దేహమున నున్న యీ దేహి చంపఁబడని వాఁడు. అందుచే నర్జున ప్రాణుల కొఱకు నీవు చింతించ దగవు.

స్వధర్మమపి చావేక్ష్య న వికమ్పితుమర్హసి ।
ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయోఽన్యత్క్షత్రియస్య న విద్యతే ॥

తే.గీ. అరసి నీ దగు ధర్మమ్ము నైన నీవు
తగవు కంపింప నిచ్చట వగపు తోడ
ధర్మ పరమైన యుద్ధపు కర్మమునకు
శ్రేయ మైనది ఱేనికి లేదు పరము 31.

నీ ధర్మమును దలఁచియైన నీవు చింత తో నిచట వణఁకఁ దగదు. రాజులకు ధర్మయుద్ధము కన్న మిన్నయైన ధర్మము లేదు.

యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వారమపావృతమ్ ।
సుఖినః క్షత్రియాః పార్థ లభన్తే యుద్ధమీదృశమ్ ॥

తే.గీ. తలవని తలంపుగా మఱి తలపడు నది
దివి తలుపు లెల్ల నింపుగఁ దెఱచు నదియు
సుఖము గాంచు క్షత్రియులకుఁ జూడఁ జూడ
నిట్టి యుద్ధము ధర లభియించుఁ బార్థ 32.

అనుకొన కుండయిట్టి యుద్ధము క్షత్రియులకు సుఖము లొసఁగుటకు లభించును.
ఇది స్వర్గ ద్వారములను తెఱచి యుంచును.

అథ చేత్త్వమిమం ధర్మ్యం సఙ్గ్రామం న కరిష్యసి ।
తతః స్వధర్మం కీర్తిం చ హిత్వా పాపమవాప్స్యసి ॥

తే.గీ. ధర్మ యుతమైన యీ యుద్ధ కర్మ మాచ
రించకయు మిన్న కున్న నీ వెంచి కరుణ
నంత స్వీయ ధర్మము వీడి యశము నాశ
నమ్ము కావింపఁ గలుగుఁ బాపమ్ము నీకు 33.

ధర్మబద్ధమైన యీ యుద్ధము చేయక నీవు నిలిచిన నీ ధర్మమును వీడిన వాఁడవై
కీర్తి నాశనమును పాపమును బొందఁ గలవు.

అకీర్తిం చాపి భూతాని కథయిష్యన్తి తేఽవ్యయామ్ ।
సమ్భావితస్య చాకీర్తిర్మరణాదతిరిచ్యతే ॥

తే.గీ. నీదు సతతంపు టపకీర్తినిఁ బరిపరి వి
ధమ్ముల జను లెల్లఁ బలికెదరు నిరతము
మాననీయుల కిద్ధర మరణ మెంచ
మిన్న కానేర దపకీర్తి కన్న నెపుడు 34.

నీ యపకీర్తిని జనులు నిత్యము పరిపరి విధములఁ జెప్పుకొనెదరు. అపకీర్తి కన్నను
మరణము మిన్న కాదు.

భయాద్రణాదుపరతం మంస్యన్తే త్వాం మహారథాః ।
యేషాం చ త్వం బహుమతో భూత్వా యాస్యసి లాఘవమ్ ॥

తే.గీ. సమర మన్న భయము సెంది విముఖుఁడ వయి
పాఱి నట్లు తలంతురు మీఱి యింక
నిను మహారథులు మును మన్నించి నట్టి
వార మఱి కించపఱతురు దారుణముగ 35.

యుద్ధమునుండి భయముతో నీవు పాఱి పోయినట్లు తలఁచెద రెల్లరు. మునుపు నిన్ను బొగిడిన మహారథులే యవమాన పఱచెదరు.

అవాచ్యవాదాంశ్చ బహూన్వదిష్యన్తి తవాహితాః ।
నిన్దన్తస్తవ సామర్థ్యం తతో దుఃఖతరం ను కిమ్ ॥

తే.గీ. వినఁ దగని మాట లందురు పెక్కు లింక
నీదు శత్రువు లెల్లరు నిన్ను గూర్చి
నీదు శక్తిని సేర్పును నింద సేయ
నంత దాని మించిన దుఃఖ మరయ గలవె 36.

నీ శత్రువులు నిన్ను వినఁగూడని మాటలతో బాధ పఱచెదరు. నిన్ను నీ సేర్పును నింద చేసిన దాని కన్న యెక్కువ దుఃఖము కలదా!

హతో వా ప్రాప్స్యసే స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీమ్ ।
తస్మాదుత్తిష్ఠ కౌన్తేయ యుద్ధాయ కృతనిశ్చయః ॥

తే.గీ. పడయఁ గలవు నెగ్గిన మహీ వైభవమ్ము
సమసిన మఱి పొందఁ గలవు స్వర్గ మంత
లెమ్ము మది నుంచి కౌంతేయ నెమ్మి నీవు
నిశ్చయమ్ముగ నని సేయ నిర్ణయించి 37.

యుద్ధములో నెగ్గిన రాజ్యసుఖములను బొందఁ గలవు. మరణించిన స్వర్గము

లబించును. కనుక యుద్ధము చేయ దృఢ నిశ్చయముతో లెమ్ము.

సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ ।
తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాపమవాప్స్యసి ॥

తే.గీ. దుఃఖములు సుఖముల నెల్లఁ దుల్యములుగ
నెంచి లాభము నష్టము నింక జయము
నప జయమ్మును సమముగ నరసి యుద్య
మించు మాజికి నఘము రా దించుకయును 38.

సుఖ దుఃఖములు, లాభ నష్టములు, జయాపజయములను సమానముగా నెంచి
యుద్ధము చేయుము. పాపము రాదు.

ఏషా తేఽభిహితా సాఙ్ఖ్యే బుద్ధిర్యోగే త్విమాం శృణు ।
బుద్ధ్యా యుక్తోయయా పార్థ కర్మబన్ధం ప్రహాస్యసి ॥

తే.గీ. సాంఖ్య మందలి యీ బుద్ధి సవివరణము
చెప్పఁబడినది నీకిది యొప్పఁ బార్థ
యోగ మందు దీని వినుము వేగ బుద్ధి
గూడఁ గర్మ బంధమ్ము తగులదు నీకు 39.

సాంఖ్య శాస్త్రమున వివరించిన యీ బుద్ధి నీకు చెప్పితిని. కర్మ యోగమును
వినుము. ఈ బుద్ధితో గూడిన వాఁడవైన నీకు కర్మ బంధము తగులదు.

నేహాభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే ।
స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్ ॥

తే.గీ. దీని కారంభపు లయము కాని యింక
దోష మించుక లేదని భాషితమ్ము
సుంత యైన నీ ధర్మము వింత నుత్త
రించును మహద్భయమ్ముల నంచితముగ 40.

దీని కారంభ నాశము లేదు. దోషము లేదు. ఇది కొంచెమైన నీ ధర్మము
భయములను బోగొట్టును.

వ్యవసాయాత్మికా బుద్ధిరేకేహ కురునన్దన ।
బహుశాఖా హ్యనన్తాశ్చ బుద్ధయోఽవ్యవసాయినామ్ ॥

తే.గీ. ఇందు గమనించ నొక యింత సందియమ్ము
లేని కృత నిశ్చయమ్మగు నేని బుద్ధి
యొక్క టుండును బహుళములుం డనిశ్చ
యంపు బుద్ధు లంతము లేక యర్జున విను 41.

సందేహములు లేక కృత నిశ్చయమైన బుద్ధి యొక్కటియే యుండును.
అనిశ్చయములైన బుద్ధులు అనేకము లుండును.

యామిమాం పుష్పితాం వాచం ప్రవదన్త్యవిపశ్చితః ।
వేదవాదరతాః పార్థ నాన్యదస్తీతి వాదినః ॥

తే.గీ. వేద వచనముల రతిని వాదనమ్ముఁ
బ్రీతిఁ జేయుచు నన్యము లేదు వీని
కంచు మధురంపు వచనమ్ము లలరి యనెడు
వారి నవివేకులను మఱి పార్థ యెంచ 42.

వేద వాక్యము లందు ప్రీతి నుంచి వీని కంటె భిన్నములు లేవని తియ్యగాఁ బల్కెడు
నవివేకులైన వారిు యందుఁ దలంప పార్థా

కామాత్మానః స్వర్గపరా జన్మకర్మఫలప్రదామ్ ।
క్రియావిశేషబహులాం భోగైశ్వర్యగతిం ప్రతి ॥

తే.గీ. స్వర్గమున నాశ లున్నట్టి వారు మఱియు
జన్మ కర్మ ఫలముల నొసంగు నట్టి
భోగముల సంపదలను సంపూర్ణ మిచ్చు
నమితపుఁ బనుల కోర్కుల నలరు వారు 43.

స్వర్గమందు నాశ యున్నవారు జంమను కర్మ ఫలమును  భోగములు సంపదల
నిచ్చు పనుల పై నిష్టమున్న వాఋ యందు

భోగైశ్వర్యప్రసక్తానాం తయాపహృతచేతసామ్ ।
వ్యవసాయాత్మికా బుద్ధిః సమాధౌ న విధీయతే ॥

తే.గీ. భోగముల వైభవమ్ముల రాగ మున్న
వారి యందు నమ్మాటల నేరి మనము
లపహరింపఁ బడును వారి యందు నిశ్చ
యాత్మకంపు సమపు బుద్ధి నరయ లేము 44.

భోగములు వైభవములపై ప్రీతి యున్న వారి యందు, వారి మాటలకు లొంగు వారి
యందు స్థిరమైన సమపు బుద్ధి యుండదు.

త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున ।
నిర్ద్వన్ద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్ ॥

తే.గీ. వేదముల గుణత్రయములు విదిత మగును
మూడు గుణములు నీక ద్వంద్వములను వీడి
యాత్మ నెఱిఁగి నిత్యపు సత్త్వ మందు నిలిచి
యర్జున శుభ యోగము లందు నాశ వీడు 45.

వేదములు మూడు గుణము (సత్త్వ,రజస్తమో గుణములు) లున్నవి. నీవు
నిర్గుణుఁడవు, ద్వంద్వములు (సుఖ దుఃఖముల వంటివి) లేని వాఁడవు, నిత్యము
సత్త్వము తో నిలిచి యోగ క్షేమముల యందు రక్తి లేని వాఁడవు కమ్ము.

యావానర్థ ఉదపానే సర్వతః సంప్లుతోదకే ।
తావాన్సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః ॥

తే.గీ. అంతటను నిండి జలముండి నంత నూతి
వలన నెట్టి లాభము కల్గుఁ దలఁప నట్టి 46.

లాభమే యుండు వేదముల వలన నిఁక
జ్ఞాని యైన విప్ర వరేణ్యునకు నిజముగ

అంతట జలము కనిపించ నూతి వలన లాభ మెంత యుండునో జ్ఞాని యైన విప్రునకు వేదముల వలన నంతియే యుండును.

కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన ।
మా కర్మఫలహేతుర్భూర్మా తే సఙ్గోఽస్త్వకర్మణి ॥

తే.గీ. కర్మములు సేయ నీ కధికార ముండు
నెన్నఁ డైన ఫలము లందు నున్న సుమ్ము
కాకు వాని ఫలములకు కారణమ్ము
నుంచకు మకర్మముల నాశఁ గొంచ మైన 47.

కర్మములను జేయుటకే నీ కధికార ముండును. వాని ఫలము లందు కాదు. ఆ ఫలములకు కారణము గాకుము. కర్మములు వీడుట యందు నాశ నుంచకుము.

యోగస్థః కురు కర్మాణి సఙ్గం త్యక్త్వా ధనఞ్జయ ।
సిద్ధ్యసిద్ధ్యోః సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే ॥

తే.గీ. తగులు విడనాడి పనులను దగిలి యోగ
మందున ధనంజయా చేయు మయ్య నీవు
మున్ను సిద్ధించ సిద్ధించ కున్న సముఁడ
వయి చను సమత్వమును యోగ మందు రింక 48.

యోగా మందు నుండి తగులము వీడి కర్మములను జేయుము. ఫలించిన ఫలించ కున్నను సముఁడ వగుము. ఈ సమత్వమునే యోగ మందురు.

దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగాద్ధనఞ్జయ ।
బుద్ధౌ శరణమన్విచ్ఛ కృపణాః ఫలహేతవః ॥

తే.గీ. మిన్న బుద్ధియోగము పని కన్న కరము 49.

శరణు గోరు ధనంజయ పరమ బుద్ధి
నరయ ఫలములు పను లందు నరులు లోభు
లగుదు రెల్లరు సందియ మ్మది వల దిట

బుద్ధి యోగము కర్మము కన్న మిక్కిలి శ్రేయము. ధనంజయ దానినే శరణుగోరుము. ఫలముల కాశించు వారు లోభులు.

బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృతదుష్కృతే ।
తస్మాద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలమ్ ॥

తే.గీ. బుద్ధి గూడిన నింపుగఁ బురుష వరుల
కింకఁ బుణ్య పాపము లంట విహము నందు
యుద్యమింపుమ యది యెంచి యోగ మందుఁ
గౌశలం బగు యోగము కర్మ మందు 50.

బుద్ధి యోగమున జనుల కీ లోకముననే పుణ్య పాపము నశించును. సమత్వము న నుద్యమించుము. ఇదియే కర్మము లందు కౌశలము.

కర్మజం బుద్ధియుక్తా హి ఫలం త్యక్త్వా మనీషిణః ।
జన్మబన్ధవినిర్ముక్తాః పదం గచ్ఛన్త్యనామయమ్ ॥

తే.గీ. బుద్ధిఁ గూడి చేయు పనుల పుట్టి నట్టి
ఫలము లన్ని వీడి విదులు వదల జన్మ
బంధములు సకలమ్ములు పద మనామ
యంబయిన దానిఁ బొందెద రంచితముగ 51.

సమబుద్ధి తో చేయు పనుల వలన కలిగిన ఫలములను వీడి చేసిన బుధులకు జన్మ బంధములు తొలగి పరమమైన పదము ప్రాప్తించును.

యదా తే మోహకలిలం బుద్ధిర్వ్యతితరిష్యతి ।
తదా గన్తాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ ॥

తే.గీ. వినిన మఱి వినదగు వాని విషయముల వి
రాగి వౌదువా క్షణమున రమ్యమైన
నీదు బుద్ధి యెప్పుడు దాట నేర్చు మోహ
మసెడు మాలిన్య మంతయు నంచితముగ 52.

మోహ మనెడి మాలిన్యమును నీ వెప్పుడు దాట గల్గుదువో యప్పుడు వినిన
వినబోవు విషయముల వైరాగ్యమును బొందుదువు.

శ్రుతివిప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా ।
సమాధావచలా బుద్ధిస్తదా యోగమవాప్స్యసి ॥

తే.గీ. ఎప్పు డుండు నిశ్చలముగ నొప్పి బుద్ధి
తిరముగ సమాధిలోఁ బరస్పర విరోధ
ము లయి నట్టి మాటలు విన్నఁ గలుగు నప్పు
డు సురుచిరమైన యీ యోగ మెసక మెసఁగి 53.

పరస్పర విరోధము లైన మాటలు వినినను నీ బుద్ధి యెప్పుడు స్థిరముగ
నుండునో సమాధిలో నప్పుడు యోగము( సమ బుద్ధి) కలుగును.

అర్జున ఉవాచ ।
స్థితప్రజ్ఞస్య కా భాషా సమాధిస్థస్య కేశవ ।
స్థితధీః కిం ప్రభాషేత కిమాసీత వ్రజేత కిమ్ ॥

అర్జునుని పలుకులు:

తే.గీ. మఱి స్థితప్రజ్ఞుని వర సమాధి యందు
నున్న వాని పలుకు లవి యుండు నెట్లు
కేశవ స్థిత బుద్ధియుఁ బలికెడు విధమ్ము
నడక యాసీనములు గన నడరు నెట్లు 54.

ఓ కేశవా సమాధి లో నున్న స్థితప్రజ్ఞుని పలుకు విధము, పలుకు లెట్లెండును, వాని
నడకయు నుండుటయు నెట్లుండును?

శ్రీభగవానువాచ ।
ప్రజహాతి యదా కామాన్సర్వాన్పార్థ మనోగతాన్ ।
ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞస్తదోచ్యతే ॥

శ్రీభగవానుని పలుకులు:

తే.గీ. ఎప్పుడు మన మందలి కోర్కు లెల్లఁ దునిమి
పార్థ యాత్మ యందాత్మచేఁ బడయుఁ దృప్తి
నప్పు డందు రందఱు వాని నరసి యింపు
గను స్థితప్రజ్ఞుఁ డంచుఁ బ్రకాశముగను 55.

అర్జునా యెవఁడు కోరిక లన్నిటిని వీడి యాత్మలో నాత్మచేఁ దృప్తిఁ బొందునో వానిని స్థిత ప్రజ్ఞుఁ డని యందురు.

దుఃఖేష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః ।
వీతరాగభయక్రోధః స్థితధీర్మునిరుచ్యతే ॥

తే.గీ. కలత నొందని మదిని దుఃఖముల యందుఁ
గలుగు వాని సుఖమ్ములు గలుగఁ బొంగ
నట్టి వాని భయము రక్తి యలుక లుడుగ
నతని మునియు స్థితప్రజ్ఞుఁ డనఁగఁ దగును 56.

దుఃఖములలో కలఁత నొందక సుఖములలోఁ బొంగక భయము, రక్తి, కోపము విడిచిన వానిని ముని మఱియు స్థిత ప్రజ్ఞుఁ డందురు.

యః సర్వత్రానభిస్నేహస్తత్తత్ప్రాప్య శుభాశుభమ్ ।
నాభినన్దతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥

తే.గీ. అన్నిట మమత లరయని యట్టి వాని
బొంద శుభము లశుభములు నెందు సంత
సమ్ము గాని ద్వేషము గాని క్రమ్ము కొనవొ
యట్టి వాని బుద్ధియె స్థిరమై తనరును 57.

దేని యందు మమత నుంచక శుభము నశుభములలో సంతోషము ద్వేషము చెంద
కుండునో యట్టి వాని యందు బుద్ధి స్థిరమై యుండును.

యదా సంహరతే చాయం కూర్మోఽఙ్గానీవ సర్వశః ।
ఇన్ద్రియాణీన్ద్రియార్థేభ్యస్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥

తే.గీ. వీలుగ నవయువముల, దాఁబేలు ముడుఁచు
కొనును జుట్టు నవ్విధముగఁ దనదు విషయ
తతుల యం దింద్రియమ్ముల, దగుల నీయ
నట్టి వాని బుద్ధియె స్థిరమై తనరును 58.

తాబేలు తన యవయవములను ముడుచు కొను నట్లు నెవఁ డింద్రియ విషయము
లందు నింద్రియములను దగుల నీయఁడో వాని బుద్ధి స్థిరముగా నుండును.

విషయా వినివర్తన్తే నిరాహారస్య దేహినః ।
రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే ॥

తే.గీ. కైకొనని పురుషునకు సకల విషయము
లుడుగు వాని యందలి రక్తి యుడుగ రాదు
పరము నీక్షింపఁ గల్గిన పురుషున కిఁక
రాగ మదియు నివర్తిలు రమ్యముగను 59.

ఇంద్రియముల ద్వారా విషయములను గ్రహించని పురుషునకు నవి నశించును. కాని
వానిపై నాసక్తి నశించదు. పరమాత్ముని చూడగలిగిన వానికి యా రాగము కూడ
నశించును.

యతతో హ్యపి కౌన్తేయ పురుషస్య విపశ్చితః ।
ఇన్ద్రియాణి ప్రమాథీని హరన్తి ప్రసభం మనః ॥

తే.గీ. ఎంత యత్నించిన వివేకవంత మైన
పురుషున కొసంగుఁ గౌంతేయ యురు తరపుఁ బ్ర
మాదముల నింద్రియమ్ములు మనసు నవి హ 60.

రించు బలవంతముగ నింకఁ బొంచి పొంచి

ఎంత ప్రయత్నించినను వివేకునకు నింద్రియములు ప్రమాదముల నొసంగును. అవి బలమైనవి. పొంచి పొంచి వాని మనస్సును హరించును.

తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః ।
వశే హి యస్యేన్ద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥

తే.గీ. ఇంద్రియముల నదుపు నందు నెలమి నుంచి
ప్రీతి నుంచి నాయందున విరివి యుక్తుఁ
డయ్యు నుండ వలయు వశ మందు నున్న
నింద్రియములు బుద్ధి స్థిరమై యెసఁగు నంత 61.

ఇంద్రియములను వశము నందుంచుకొని నా యందుఁ బ్రీతి నుంచి. యోగ యుక్తుఁడై యుండ వలయును. ఇంద్రియములు వశము నందు నున్న బుద్ధి స్థిరముగా నుండును.

ధ్యాయతో విషయాన్పుంసః సఙ్గస్తేషూపజాయతే ।
సఙ్గాత్సఞ్జాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే ॥

తే.గీ. విషయములఁ దలంపఁ బెరుగు వీని యందు
బలపు టాసక్తి యాసక్తి వలనఁ గల్గుఁ
గామము కరము గలుగంగఁ గామ మింకఁ
గ్రోధము జనించుఁ బురుషునకు నధికమ్ము 62.

ఇంద్రియ విషములను దలఁచుచుండ వానిపై నాసక్తి పెరుగును. ఆసక్తి వలన కోరికలు కలుగును. కోరికల వలన క్రోధము పెరుగును.

క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహాత్స్మృతివిభ్రమః ।
స్మృతిభ్రంశాద్ బుద్ధినాశో బుద్ధినాశాత్ప్రణశ్యతి ॥

తే.గీ. క్రోధమునఁ గల్గు మోహము గురు తరమ్ము 63.

మోహమున నశించును దలఁపు సకలమ్ము
స్మృతి నశించిన బుద్ధి నిహతము సుమ్ము
బుద్ధి లయమైనఁ బతితుఁడ పురుషుఁ డింక

క్రోధము వలన మోహము కలుగును. మోహము వలన స్మృతి నశించును. స్మృతి నశించిన బుద్ధి నశించును. బుద్ధి నశించిన నరుఁడు పతన మగును.

రాగద్వేష వియుక్తైస్తు విషయానిన్ద్రియైశ్చరన్ ।
ఆత్మవశ్యైర్విధేయాత్మా ప్రసాదమధిగచ్ఛతి ॥

తే.గీ. రాగమును ద్వేషమును వీడి బాగుగఁ దన
వైన నింద్రియముల నెల్ల నాత్మ వశము
సేసికొని విషయముల నిల్చినను శాంతిఁ
బొందఁ దగు విధేయపు టాత్మ డెందమునను 64.

రాగ ద్వేషములు వీడి యింద్రియములను వశమునం దుంచుకొనిన విషయములను గ్రహించినను శాంతిని బొందఁ గలఁడు.

ప్రసాదే సర్వదుఃఖానాం హానిరస్యోపజాయతే ।
ప్రసన్నచేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతే ॥

తే.గీ. శాంతి కల్గఁగ నితనికి సకల దుఃఖ
ములు వినాశనం బగును సుమ్ము మఱియుకఁ బ్ర
సన్న మైన చిత్తపు వాని మిన్న యైన
బుద్ధి శీఘ్రముగను స్థిరముగ వెలుంగు 65.

శాంతి కలిగిన దుఃఖములు నాశన మగును. ప్రసన్న చిత్తుని బుద్ధి వేగముగ స్థిరముగ వెల్గును.

నాస్తి బుద్ధిరయుక్తస్య న చాయుక్తస్య భావనా ।
న చాభావయతః శాన్తిరశాన్తస్య కుతః సుఖమ్ ॥

తే.గీ. భావనమ్ముం వివేకము వడయ నేరఁ
డిఁక నయుక్తుండు భావ విహీనుఁ డెట్లు
పొంద నేర్చును శాంతిని నెందు నింక
శాంతి హీనుఁడు గనలేఁడు సౌఖ్య మింత 66.

యోగ యుక్తుఁడు కాని వాఁడు వివేకమును భావనమును బొంద లేడు. భావనము (ఆస్తిక భావము) లేని వాఁడు శాంతినిఁ బొందలేఁడు. శాంతి లేని వానికి సుఖ మెక్కడ?

ఇన్ద్రియాణాం హి చరతాం యన్మనోఽనువిధీయతే ।
తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావమివామ్భసి ॥

తే.గీ. ఇంద్రియ విషయములఁ జరియించు మనము
ననుసరించెడు చిత్త మా మనుజు బుద్ధిఁ
దథ్యముగ హరించు నిఁక నుదకము నందు
నున్న నావను వాయువు చెన్ను నలరి 67.

జలము నందు నున్న నావను గాలి హరించు నటుల నింద్రియ విషయములను గోరు మనస్సు మనుష్యుని బుద్ధిని హరించును.

తస్మాద్యస్య మహాబాహో నిగృహీతాని సర్వశః ।
ఇన్ద్రియాణీన్ద్రియార్థేభ్యస్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥

తే.గీ. కాన నింద్రియ విషయ నికాయముల ఘ
నంపు బారి నుండి యెవఁడు నయముగ సక
ల విధముల మహాబాహు నిగ్రహ మొనర్చు
నింద్రియమ్ముం లతని బుద్ధి యింక స్థిరము 68.

కావున యింద్రియ విషయముల బారి నుండి యింద్రియముల నెవఁ డన్ని విధముల నిగ్రహించునో వాని బుద్ధి స్థిరముగా నుండును.

యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ ।

యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః ॥

తే.గీ. సకల భూతములకు నిసి కాఁగ నింక
సంయమీంద్రుఁడు మేల్కొని సంచరించు
దేని యందున మేల్కొను దివిరి భూత
ము లిఁకఁ గాంచఁగ నిసి యగు మునికి నదియ 69.

ఎల్ల ప్రాణులకు రాత్రి కాగ ముని మేల్కొని యుండును. ఆ జీవు లెప్పుడు మేల్కొని
యుండునో యప్పుడు మునికి రాత్రి యగును.

ఆపూర్యమాణమచలప్రతిష్ఠం
సముద్రమాపః ప్రవిశన్తి యద్వత్ ।
తద్వత్కామా యం ప్రవిశన్తి సర్వే
స శాన్తిమాప్నోతి న కామకామీ ॥

తే.గీ. నిండ నీరున్న స్థిర మైన నీరధి జల
మెవ్విధిఁ దమిఁ గలియఁ జేరు నవ్విధమ్ము
సర్వ కామ విషయములు పర్విన నిఁకఁ
గామి గానట్టి వానినిఁ గలుగు శాంతి 70.

నిండుగా నీరున్న సుస్థిరమైన కడలిలో జల మెట్లు జేరునో చాలనము లేకుండ నా
విధము కామము లన్నియు కామి కాని వానిని చేరినను వాఁడు శాంతినిఁ బొందును.
కాముకుఁడు పొందలేఁడు.

విహాయ కామాన్యః సర్వాన్పుమాంశ్చరతి నిఃస్పృహః ।
నిర్మమో నిరహఙ్కారః స శాన్తిమధిగచ్ఛతి ॥

తే.గీ. విడిచి కామము లన్నింటిఁ బడయక మమ
కారము మఱి క్రోధమ్మును దూర ముంచి
నిస్పృహుం డయి చరియించ నేర్చి నట్టి
వాఁడు నిశ్శంక శాంతినిఁ బడయఁ గలఁడు 71.

కోరిక లన్నిటిని విడిచి మమకారమునఁ బడక కోపమును దూరముగా నుంచి
నిస్పృహగాఁ జరియించ నేర్చిన వాఁడు శాంతిఁ బొందగలడు.

ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ నైనాం ప్రాప్య విముహ్యతి ।
స్థిత్వాస్యామన్తకాలేఽపి బ్రహ్మనిర్వాణమృచ్ఛతి ॥

తే.గీ. అరయ దీని బ్రాహ్మీస్థితి యందురు సుమి
జెంద రెవ్వరు మోహముఁ బొంద దీని
నంత కాల మందున దీని యందు నున్న
మోక్ష మింపుగఁ బురుషుఁడు పొందు బార్థ 72.

దీనినే బ్రాహ్మీ స్థితి యని యందురు. ఇందు నున్న వారు మోహమును బొందరు.
అవసాన సమయమున దీని నందు నున్న పురుషుఁడు మోక్షమును బొందఁ గలఁడు.

ఇది శ్రీకృష్ణ సూక్తి సుధాకరమను శ్రీమదాంధ్ర భగవద్గీత యందు సాంఖ్య యోగమను రెండవ యధ్యాయము.
పోచిరాజు కామేశ్వర రావు నామధేయ ప్రణీతము.

శ్రీకృష్ణాయ నమః

# శ్రీకృష్ణ సూక్తి సుధాకరము

మూలము శ్రీమద్భగవద్గీత

# అధ్యాయము మూడు – కర్మ యోగము

అర్జున ఉవాచ ।
జ్యాయసీ చేత్కర్మణస్తే మతా బుద్ధిర్జనార్దన ।
తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ ॥

అర్జునుని పలుకులు:

తే.గీ. కర్మమునకు మిన్నయె బుద్ధి కద జనార్ద
న తగ నీ మతమ్మున మఱి నన్ను ఘోర
కర్మ మందుఁ గేశవ నియోగమ్ము సేయ
నేల చింతించితి వెఱుఁగఁ జాల కుంటి 1.

కేశవా నీ మతమున బుద్ధియే కర్మము కన్న మిన్న కదా. మఱి నన్ను యీ ఘోరమైన యుద్ధ కర్మమునకు నేల నియోగించుచున్నావు?

వ్యామిశ్రేణేవ వాక్యేన బుద్ధిం మోహయసీవ మే ।
తదేకం వద నిశ్చిత్య యేన శ్రేయోఽహమాప్నుయామ్ ॥

తే.గీ. కలగలపు మాటల వలనఁ గలవర పఱ
చెదవు కృష్ణ బుద్ధిఁ గరముఁ జెప్ప వలయు
నాకు నిప్పట్టున హిత మొనర్చు నట్టి
కార్య మొకటి నిశ్చయముగఁ గరుణ తోడ 2.

కృష్ణ కలగలపు మాటలతో నన్ను మిక్కిలి కలవరపఱచు చుంటివి. హితమును బొందు మార్గము నొక్కటి నాకు నిశ్చయముగఁ జెప్పుము.

శ్రీభగవానువాచ ।
లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయానఘ ।
జ్ఞానయోగేన సాఙ్ఖ్యానాం కర్మయోగేన యోగినామ్ ॥

శ్రీభగవానుని పలుకులు:

తే.గీ. రెండు విధము లీ జగతి దురిత విహీన
చెప్పఁ బడెను నిష్ఠ లవి నాచే మును దగ
నొప్పు సాంఖ్యుల కల జ్ఞాన యోగమునను
యోగులకు నెంచ మఱి కర్మ యోగమునను 3.

అనఘా, లోకమున రెండు విధము లైన నిష్ఠ లున్న వని మున్ను చెప్పితిని కదా. ఆత్మ తత్త్వము విచారించు సాంఖ్యులకు జ్ఞానయోగముచేత యోగులకు కర్మ యోగము చేత  నిష్ఠ కల్గును.

న కర్మణామనారమ్భాన్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే ।
న చ సంన్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి ॥

తే.గీ. పనుల మొద లిడమి కతనఁ బడయ రాదు
పురుషునకు నింక నిష్కర్మపు ఫల మెంచ
విడిచిన నతండు సిద్ధినిఁ బడయ నేరఁ
డన్నదియు నిక్క మది తల్ప నెన్నఁ డైన 4.

కర్మములు ప్రారంబింప  నంత మాత్రమునఁ బురుషులకు నిష్కర్మ ఫలము సిద్ధింపదు. అవి విడిచినను సిద్ధినిఁ బొందఁడు.

న హి కశ్చిత్క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్ ।
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః ॥

తే.గీ. ఒక్క క్షణమైన నెవ్వఁడు నొక తఱినిఁ బ
ని నొనరింపక యెవ్విధి నిలువఁ జనదు
ప్రాకృతపు గుణములచే నవశుఁ డయి ప్రతి
వాఁడు సేయింపఁ బడుచుండుఁ బనిని సతము 5.

పనులను జేయకుండ నొక్క క్షణమైన నెవ్వఁడు నుండఁ జాలఁడు. స్వాభావికమైన గుణమే వశపఱచుకొని  పనులను జేయించును.

కర్మేన్ద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్ ।
ఇన్ద్రియార్థాన్విమూఢాత్మా మిథ్యాచారః స ఉచ్యతే ॥

తే.గీ. సకల కర్మేంద్రియమ్ముల సంయమించి
మనసు నందు విషయముల స్మరణ నెవరు
వీడ లేకుండు వాఁ డవివేకి వాఁడ
యనఁబడు నిఁక మిథ్యాచారి యంచు నెంచ 6.

చేతల ద్వారా కర్మేద్రియములను నియంత్రించి మనస్సునందు నా యింద్రియ విషయముల స్మరణము నెవ్వఁడు వీడ లేకుండునో వానినే మిథ్యాచారి యని యందురు.

యస్త్విన్ద్రియాణి మనసా నియమ్యారభతేఽర్జున ।
కర్మేన్ద్రియైః కర్మయోగమసక్తః స విశిష్యతే ॥

తే.గీ. మనసు చేతను నియమించి ఘనపు టింద్రి
యముల నర్జున కర్మేంద్రియముల చేత
వీడి యాసక్తి పనులను గూడుట మొద
లిడఁగ నతఁ డధికుం డగు నెంచ నింక 7.

మనస్సు చే నింద్రియముల నదుపు లోనుంచుకొని యాసక్తి వీడి కర్మేంద్రియములచేఁ బనులను గూడి యుండుట నారంభించిన నతఁ డుత్తముఁడు.

నియతం కురు కర్మ త్వం కర్మ జ్యాయో హ్యకర్మణః ।
శరీరయాత్రాపి చ తే న ప్రసిద్ధ్యేదకర్మణః ॥

తే.గీ. నియమపుఁ బనినిఁ జేయుము నిరత మీవు
మిన్న యగుఁ బని చేయమి కన్నఁ బనిని
బ్రతుకు పయనమ్ము సమకూఱ దతని కింకఁ
బనిని విరమించి యుండెడు వాని కరయ 8.

నియమించిన పనిని నెల్లప్పుడు చేయుము. పని చేయ కుండుట కన్న చేయుటయే

మేలు కద. పని చేయనిచో జీవన యాత్ర సాగదు.

యజ్ఞార్థాత్కర్మణోऽన్యత్ర లోకోऽయం కర్మబన్ధనః ।
తదర్థం కర్మ కౌన్తేయ ముక్తసఙ్గః సమాచర ॥

తే.గీ. జన్నము కొఱకుఁ గానట్టి యన్ని పనుల
వలన నీ లోకమునఁ గల్గు బంధనములు
గానఁ గౌంతేయ విడిచి సంగమును మదినిఁ
గర్మము లొనర్పు దానికై ధర్మముగను 9.

యజ్ఞమునకు గాని పనులన్నియు బంధములను గలిగించును. కావునఁ గౌంతేయ తగులము విడిచి కర్మముల నాచరింపుము.

సహయజ్ఞాః ప్రజాః సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః ।
అనేన ప్రసవిష్యధ్వమేష వోऽస్త్విష్టకామధుక్ ॥

తే.గీ. మును పల సృజించి ప్రజల నంభోజ జన్ముఁ
డు క్రతువుల సహితము తివిరి క్రతు వరసి
వృద్ధిఁ బొందుఁడి జన్నము విస్తృతముగఁ
గోరికలు సమకూర్చెడు గో వగు ననె 10.

యజ్ఞముల సహితము ప్రజలను బూర్వము బ్రహ్మ సృజించి యో ప్రజలారా మీ రీ యజ్ఞముల ద్వారా వృద్ధి బొందుఁడు. ఈ యజ్ఞములు కోరికల నొసఁగు కామధేను వగు ననెను.

దేవాన్భావయతానేన తే దేవా భావయన్తువః ।
పరస్పరం భావయన్తః శ్రేయః పరమవాప్స్యథ ॥

తే.గీ. సురలఁ బూజింపుఁ డిష్టుల సురుచిరముగ
వార నుగ్రహింతురు మిమ్ము భావ్యముగను
నొండొరుల గారవింపఁగ నొప్పిదముగఁ
బొందఁ గల రెల్లరును శ్రేయము పరమమ్ము 11.

మీ కిష్ట మైన దేవతలను బూజింపుఁడు. వారును మి మ్మనుగ్రహింతురు. ఒకరి నొకరు గౌరవించుకొనఁగ శ్రేయమైన పరమపు గతినిఁ బొంద గలరు.

ఇష్టాన్భోగాన్హి వో దేవా దాస్యన్తే యజ్ఞభావితాః ।
తైర్దత్తానప్రదాయైభ్యో యో భుఙ్క్తే స్తేన ఏవ సః ॥

తే.గీ. ఇత్తు రమరులు భోగము లెల్లఁ బూజి
తు లయి యజ్ఞముల వలన దొరుక నీయ
వార లిష్ట ఫలమ్ములు వారి కీయ
క భుజియించెడు వాఁడు దొంగ యగు సుమ్మి 12.

పూజింపఁబడి సురలు భోగముల నొసఁగుదురు. యజ్ఞములు చేయ వారిచ్చిన ఫలములను గ్రహించి వారికి నీయక యనుభవించు వాఁడు దొంగ యగును.

యజ్ఞశిష్టాశినః సన్తోముచ్యన్తే సర్వకిల్బిషైః ।
భుఞ్జతే తే త్వఘం పాపా యే పచన్త్యాత్మకారణాత్ ॥

తే.గీ. జన్నపు మిగులు టన్నము సత్పురుషులు
తిని విముక్తు లయ్యెదరు పదిలముగ నిఁకఁ
బాపముల నుండి వారికై వండి కొనెడి
వారు పాపులు భుజియింత్రు పాపములను 13.

యజ్ఞమున మిగిలిన యన్నము దినెడు వారు సత్పురుషులు పాపముల నుండి విముక్తు లౌదురు. తమ కొఱకై వండికొని తిను వారు పాపులు. పాపముల ననుభవింతురు.

అన్నాద్భవన్తి భూతాని పర్జన్యాదన్నసమ్భవః ।
యజ్ఞాద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మసముద్భవః ॥

తే.గీ. అన్నము వలన భూతము లన్ని కలుగు
నంబుదమ్ములఁ బ్రభవించు నన్న మరయ 14.

మఖముల వలనఁ గల్గును మబ్బు లన్ని
కర్మముల వలనఁ గలుగుఁ గ్రతువు లింక

అన్నము వలనఁ  బ్రాణులు కల్గును. మేఘముల వలన నన్నము కల్గును. యాగముల వలన మేఘములు కల్గును. కర్మముల వలననే యజ్ఞములు కల్గును.

కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షరసముద్భవమ్ ।
తస్మాత్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్ ॥

తే.గీ. పుట్టెఁ గర్మము శ్రుతి నుండి యట్టి వేద
ముద్భవం బయ్యె నంతట నుండు నక్ష
రము వలన నని నీ వెఱుఁగుమ కనుక స్థి
ర మయి యుండు యజ్ఞమ్ముల బ్రహ్మ మెపుడు 15.

కర్మములు వేదముల నుండి పుట్టినవి. వేదము లక్షరమయిన దాని నుండి పుట్టిన వని యెఱుఁగుము. కనుక బ్రహ్మము యజ్ఞము లందు స్థిర మై యుండును.

ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయతీహ యః ।
అఘాయురిన్ద్రియారామో మోఘం పార్థ స జీవతి ॥

తే.గీ. ఇట్లు పరఁగు చక్రమ్మున నెవ్వఁ డనుస
రింపక చరించు నాతఁడె యెంచఁ బాప
మాయువుగ నుండు మఱి విషయముల రతినిఁ
బార్థ జీవించుఁ బృథ్విని వ్యర్థముగను 16.

ఈ విధముగా జరుగు సృష్టి చక్రము ననుసరింపక చరించు వాఁడు పాపమే యావుగాఁ గలవాఁ డగును. ఇంద్రియార్థముల నాసక్తి కలవాఁడై వ్యర్థముగ జీవించును.

యస్త్వాత్మ రతి రేవ స్యాదాత్మతృప్తశ్చ మానవః ।
ఆత్మన్యేవ చ సన్తుష్ట స్తస్య కార్యం న విద్యతే ॥

తే.గీ. ఎవ్వరికి నుండు నాత్మ యందె రతి మఱియు 17.

నాత్మ వలన సంతృప్తియు నాత్మ యంద
కలుగు సంతస మ్మతనికిఁ గార్య మేమి
యుఁ గనిపింప దెన్నఁడు సేయ నుత్సహించి

ఎవనికి యాత్మ యందే ఆసక్తి, యాత్మ వలననే సంతృప్తి, సంతసము కలుగు నతనికి నుత్సహించి చేయుటకు నెట్టి కార్యము కనిపింపదు.

నైవ తస్య కృతేనార్థో నాకృతేనేహ కశ్చన ।
న చాస్య సర్వభూతేషు కశ్చిదర్థవ్యపాశ్రయః ॥

తే.గీ. అట్టి వానికి నిఁకఁ గర్మ మాచరింప
నర్థ మించుకయును గన మాచరింప
కున్న లేదు భూతముల ప్రయోజనంపుఁ
గూటమియుఁ గాన రా దది కొంచమైన 18.

అట్టి వానికిఁ గర్మములు చేయుట వలనఁ బ్రయోజనము లేదు, మఱియు నాచరింప కున్నను లేదు. ప్రాణులతోఁ బ్రయోజనంపుఁ గూటమియు లేదు.

తస్మాదసక్తః సతతం కార్యం కర్మ సమాచర ।
అసక్తోహ్యాచరన్కర్మ పరమాప్నోతి పూరుషః ॥

తే.గీ. కానఁ జేయఁ దగిన యట్టి కర్మ మాచ
రింపు ఫలపు టాశను వీడి యింపుగాను
సతత మాశ నెల్ల వదలి చలుపఁ బనులు
పొందుఁ బురుషుఁడు పరము నిస్స్పందియమ్ము 19.

కావునఁ జేయఁదగిన పనులను ఫలము నందు నాశ వీడి చేయుము. అట్లు నాశను వీడి కర్మములను జేసిన నరుఁడు నిస్స్పందియముగఁ బరమాత్మ ప్రాప్తి బొందును.

కర్మణైవ హి సంసిద్ధిమాస్థితా జనకాదయః ।
లోకసఙ్గ్రహమేవాపి సమ్పశ్యన్కర్తుమర్హసి ॥

తే.గీ. కర్మములను సిద్ధిని జనకప్రభృతులు
పొంది రెల్లరు మున్ను నింపుగను గాంచి
యైన లోక కళ్యాణము నర్హుఁడ విట
నాచరింపఁగఁ గర్మము లాశ వీడి 20.

కర్మములను జేసియే జన కాది రాజులు సిద్ధినిఁ బడసిరి. లోక కళ్యాణ మరసి యైన నీవు కర్మములను జేయ నర్హుఁడవు.

యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరో జనః ।
స యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే ॥

తే.గీ. ఉత్తముండు దేనినిఁ జేయు నత్తెఱఁగున
నితర జనులును దానిఁ దలఁతురు సేయ
ననిశ మెద్దానినిఁ బ్రమాణ మనుచు నిల్పు
లోక మనుసరించును దాని వీఁక నింక 21.

ఈ రీతిని నుత్తముడైన వాడు చేయునో యారీతినే యితర జను లనుసరింతురు. ఏ ప్రమాణమును జూపుదురో దానినే నితరు లాచరింతురు.

న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కిఞ్చన ।
నానవాప్తమవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి ॥

తే.గీ. పార్థ ముల్లోకములఁ జేయ వలసి నట్టి
పని కలదె నాకు నించుకయు నయినఁ బడ
యనిది పొందఁ దగినదియు నరయ నైనఁ
గర్మ మందు నుంటిని కద ధర్మ మరసి 22.

పార్థ చేయ వలసిన యట్టి కర్మము కలదే నాకు ముల్లోకము లందు. పడయఁదగినది, పొందనిదియు నాకు లేదు. అయినను కర్మము లందు నుంటిని కదా.

యది హ్యహం న వర్తేయం జాతు కర్మణ్యతన్ద్రితః ।
మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః ॥

తే.గీ. పార్థ యొక వేళ నేనిటఁ బని మెలుకువఁ
జేయక మెలఁగి నయెడల శీఘ్రమ నరు
లన్ని విధముల నా మార్గ మంద చేరి
నడతు రెల్ల రనుసరించి నన్ను నింక 23.

అర్జునా నేను మెలకువతోఁ బనులు చేయక యున్న నిచట మానవు లందఱు నా మార్గముననే యెన్నుకొని నడతురు.

ఉత్సీదేయురిమే లోకా న కుర్యాం కర్మ చేదహమ్ ।
సఙ్కరస్య చ కర్తా స్యాముపహన్యామిమాః ప్రజాః ॥

తే.గీ. కర్మ మేఁ జేయకున్న లోకము లివి లయ
మగును వర్ణ సంకరమున కగుదు కర్త
నింకఁ జంపిన వాడిని నేన యగుదు
నీ ప్రజలను నిక్కమ్ముగ నెల్ల గతుల 24.

నేను గర్మములు చేయకున్న లోకములు లయ మగును. వర్ణ సంకరమునకు నేన కర్త నగుదును. ఈ ప్రజలను జంపిన వానిని నేన యగుదును.

సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వన్తి భారత ।
కుర్యాద్విద్వాంస్తథాసక్తశ్చికీర్షుర్లోకసఙ్గ్రహమ్ ॥

తే.గీ. పామరుఁడు ఫల మాశించి పనినిఁ జేయు
నెట్లు విద్వాంసుఁ డవ్విధి నెలమి సల్పఁ
గోరి లోకమునకు నాశ నేరక యొన
రింప వలయు భారత కర్మ మింపుగాను 25.

పామరుఁడు ఫలము నాశించి యెట్లు పనులను జేయునో యట్లు విద్వాంసుఁడు లోక హితము గోరిఁ ప్రీతిఁ జేయ వలయును. ఆస వీడి పనులు చేయ వలయును.

న బుద్ధిభేదం జనయేదజ్ఞానాం కర్మసఙ్గినామ్ ।

జోషయేత్సర్వకర్మాణి విద్వాన్యుక్తః సమాచరన్ ॥

తె.గీ. తగులమునఁ బనిఁ జేయు నితరుల తగిన
దెలివి లేనట్టి వారి మతిని భ్రమ పఱు
పఁ దగదు బుధులు యోగులు పనులు సల్పి
వారి చే నవి చేయింప వలయుఁ జుమ్మి 26.

కోరికలతోఁ బని జేయు నజ్ఞానులను బండితులు భ్రమపఱప రాదు. యోగులు, విద్వాంసులు యుక్తము లైన పనులను జేయుచు వారిచేఁ జేయింప వలయును.

ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః ।
అహఙ్కారవిమూఢాత్మా కర్తాహమితి మన్యతే ॥

తె.గీ. ప్రాకృతిక గుణములె చేయుఁ బరఁగి పనుల
నెల్ల నానా విధములుగ నుల్ల మంద
హంకృతినిఁ దానె మఱి కర్త యంచు మూఢ
చిత్తుఁడు దలఁచు చుండును జిత్రముగను 27.

స్వభావ సిద్ధమైన గుణములే పలు రకముల పనులను జేయించును. మనస్సులో నహంకారముతో మూఢుఁడు దానె కర్తగా భావించును.

తత్త్వవిత్తు మహాబాహో గుణకర్మవిభాగయోః ।
గుణా గుణేషు వర్తన్త ఇతి మత్వా న సజ్జతే ॥

తే.గీ. మూడు గుణముల పనులను బాడి యైన
భేద మెఱిఁగి మహాబాహు వేద విదుఁడు
దలఁచి యింద్రి యార్థ విషయములఁ గుణమ్ము
లొగిని వర్తించు నని యాస నొందఁ డింక 28.

ఓ మహాభాహు వర్జునా వేదజ్ఞుఁడు మూడు గుణముల పనుల భేదము నెఱిఁగి యింద్రియ విషయము లందు గుణములే వర్తించునని తెలిసి వాని యందు నాశఁ జెందఁడు.

ప్రకృతేర్గుణసమ్మూఢాః సజ్జన్తే గుణకర్మసు ।
తానకృత్స్నవిదో మన్దాన్కృత్స్నవిన్న విచాలయేత్ ॥

తే.గీ. సహజ గుణముల మోహ వశ మయి నట్టి
వారు కర్మపు ఫలములు గోరు వారు
మందు లజ్ఞులు వారినే చందమునను
విచలితులఁ జేయ నొప్పదు విజ్ఞులకును 29.

సహజమైన గుణములకు వశులై కర్మఫలములు కోరు వారిని మందమతు లజ్ఞానుల
నెట్టి విధము నైనను చలింపఁ జేయ రాదు విజ్ఞానులు.

మయి సర్వాణి కర్మాణి సంన్యస్యాధ్యాత్మచేతసా ।
నిరాశీర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః ॥

తే.గీ. విడిచి మమకార మాశయు వీడి యెట్టి
తాపమును బడయక సమస్తమ్ము లైన
కర్మము లిడి నాయందు నికరపు ధ్యాన
చిత్తమున యుద్ధ మిత్తఱిఁ జేయు మింక 30.

మమకారము నాశను విడిచి తాపము చెందక యన్ని పనులను నా యంద నుంచి
ధ్యాన చిత్తుఁడవై యిప్పుడు యుద్ధమును జేయుము.

ఁ

యే మే మతమిదం నిత్యమనుతిష్ఠన్తి మానవాః ।
శ్రద్ధావన్తోఽనసూయన్తో ముచ్యన్తే తేఽపి కర్మభిః ॥

తే.గీ. నిత్య మీ నా యభిప్రాయ మత్యధికపు
శ్రద్ధ తోడ నసూయా విరహిత మెవ్వ
రనుసరింతు రా మానవు లంద ఱింక
ముక్తు లౌదురు కర్మపు ముంపు నుండి 31.

ఎవ్వరు నిత్యము నా యీ యభిప్రాయమును శ్రద్ధతో నసూయను వీడి

యనుసరింతురో యా నరులు కర్మ బంధముల నుండి ముక్తు లౌదురు.

యే త్వేతదభ్యసూయన్తోనానుతిష్ఠన్తి మే మతమ్ ।
సర్వజ్ఞానవిమూఢాంస్తాన్విద్ధి నష్టానచేతసః ॥

తే.గీ. ఎవ్వ రనుసరింప రసూయ నివ్వటిల్ల
నా మతమ్మును మూర్ఖులు జ్ఞానశూన్యు
లైన వారిని నెఱుఁగుమ యన్ని గతుల
నెంచ నష్టులే యని మది నంచితముగ 32.

ఎవ్వరు ద్వేషముతో నా మతము ననుసరింపరో యట్టి మూర్ఖులు నవివేకు లన్ని
విధముల నష్ట పోయిన వారే యని తెలిసికొనుము.

సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతేర్జ్ఞానవానపి ।
ప్రకృతిం యాన్తి భూతాని నిగ్రహః కిం కరిష్యతి ॥

తే.గీ. నడతురు విబుధులుఁ దమ గుణమ్ముల కను
గుణముగ సతము మఱి భూత గణము లెల్లఁ
గూడ పొందుఁ దమ ప్రకృతిఁ గూర్మి నిగ్ర
హమ్మది తలఁప నేమి సేయఁ గల దిచట 33.

విబుధులు కూడ తమ గుణముల కనుగుణముగనే నడతురు నిత్యము.
భూతగణము లన్నియుఁ గూడ తమ తమ స్వాభావిక గుణములతోనే చరించును.
నిగ్రహ మిక్కడ యేమి చేయగలదు.

ఇన్ద్రియస్యేన్ద్రియస్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ ।
తయోర్న వశమాగచ్ఛేత్తౌహ్యస్య పరిపన్థినౌ ॥

తే.గీ. రాగము మఱి ద్వేషమ్మును రగులు చుండు
నింద్రియముల విషయము లందే నిరతము
కాఁ దగదు వాని వశ మెప్డుఁ గన నవియె య
తనికి శత్రువు లెన్నంగ ననవరతము 34.

రాగ ద్వేషము లింద్రియ విషయము లందే రగులు చుండును. వానికి వశము కారాదు. అవియే యెల్లప్పుడు శత్రువులు.

శ్రేయాన్స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్ ।
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః ॥

తే.గీ. చక్క(గ సమ కట్ట( బడిన మిక్కుటంపు
టితర ధర్మము కంటెను హీన గుణపు
స్వీయ ధర్మంబు మేలగు భీతి నొస(గు
ధర్మ మన్యము మృతి మేలు తన మతమున 35.

చక్క(గ( జేయు పర ధర్మము కన్న నల్పమైనను స్వీయ ధర్మము నాచరించుటయే మేలు. అన్య ధర్మము భీతి కరము. తన ధర్మమున మరణించినను మేలు.

అర్జున ఉవాచ ।
అథ కేన ప్రయుక్తోఽయం పాపం చరతి పూరుషః ।
అనిచ్ఛన్నపి వార్ష్ణేయ బలాదివ నియోజితః ॥

అర్జునుని పలుకులు:

తే.గీ. పురుషు( డట్లైన( దన కిష్ట కరము గాని
పాపము బలవంతమ్ముగ నోపు( జేయ
దేని ప్రేరణమున వాసుదేవ నియమి
తుని పగిది తెల్పు మి(క నాకు కనికరమున 36.

వాసు దేవా యట్లైన బురుషు(డు తనకు నిష్టము కాని పాపమును దేని ప్రేరణము వలన నియమింప( బడిన వాని వలె జేయుచున్నా(డో నాకు( దెలుపుము.

శ్రీభగవానువాచ ।
కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః ।
మహాశనో మహాపాప్మా విద్ధ్యేనమిహ వైరిణమ్ ॥

శ్రీభగవానుని పలుకులు:

తే.గీ. ఇది రజోగుణమున జనియించి నట్టి
కామ మిది యగు కోపము గాంచఁ దృప్తి
జెంద దెన్నఁడు గలుగంగఁ జేయు పాప
ముల నరి యనంగ నెఱుఁగఁగ వలయు దీని 37.

అది రజో గుణము వలనఁ బుట్టిన కామము, యిదియే క్రోధ మగును. తృప్తి జెందక దేని యందుఁ బాపములను జేయించు చుండును. దీనిని శత్రువుగాఁ దలఁప వలయును.

ధూమేనావ్రియతే వహ్నిర్యథాదర్శో మలేన చ ।
యథోల్బేనావృతో గర్భస్తథా తేనేదమావృతమ్ ॥

తే.గీ. కప్పఁ బడి నట్లు మసి చేత గొప్ప నిప్పు
దుమ్ము చే వన్నె తగ్గు నద్దమ్ము భంగి
మావి గప్పిన పిండమ్ము మాడ్కి దీని
చేత నావరింపఁ బడును జిక్కి నరుఁడు 38.

మసి చేత గప్పబడిన నిప్పు వలె, దుమ్ము నిండిన యద్దము వలె, మావి గప్పిన పిండము వలె, నీ కామముచే నరుఁడు కప్పఁ బడును.

ఆవృతం జ్ఞానమేతేన జ్ఞానినో నిత్యవైరిణా ।
కామరూపేణ కౌన్తేయ దుష్పూరేణానలేన చ ॥

తే.గీ. జ్ఞాన మావరింపఁ బడును జ్ఞానుల కను
నిత్య శత్రువు కామ మనెడు ననలము
నింప శక్య మేరికినిఁ గా నేర నట్టి
దాని చేతను గౌంతేయ దారుణముగ 39.

జ్ఞానులకు నిత్య శత్రు వైనదియు, నింపఁ గూడని దైనదియు నైన కామ మను నగ్ని చేత జ్ఞానము దారుణముగ నావరింపబడును.

ఇన్ద్రియాణి మనో బుద్ధిరస్యాధిష్ఠానముచ్యతే ।
ఏతైర్విమోహయత్యేష జ్ఞానమావృత్య దేహినమ్ ॥

తే.గీ. దాని కాధారముగ నుండుఁ దల్ప నింద్రి
యములు బుద్ధియు మనములె యంచుఁ జెప్పఁ
బడు నిదియ వీనిచేఁ గప్పి వడిని జ్ఞాన
మంత మోహ పఱచు దేహి ననవరతము 40.

ఇంద్రియములు, బుద్ధి,మనస్సులే కామమునకు నాధారముగా నుండును.
జ్ఞానమును కప్పి యిదియే జీవుని మోహ పఱచును.

తస్మాత్త్వమిన్ద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ ।
పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాననాశనమ్ ॥

తే.గీ. కాన భరతర్షభ మొదట కలుగఁ జేసి
యింద్రియమ్ముల కట్టడి నింక జ్ఞాన
కర్మ నాశకరము పాప కారణంపుఁ
గామమును వీడు మింపుగఁ గఠిన మైన 41.

కావున నర్జునా ముందు నింద్రియములను నియంత్రించి జ్ఞానవిజ్ఞానములను
నాశనము చేయు పాపపుఁ గామమును వీడుము.

ఇన్ద్రియాణి పరాణ్యాహురిన్ద్రియేభ్యః పరం మనః ।
మనసస్తుపరా బుద్ధిర్యో బుద్ధేః పరతస్తుసః ॥

తే.గీ. చెప్ప నిల నింద్రియమ్ములు గొప్ప వండ్రు
వాని కంటెను గొప్పది మానసమ్ము
మనసునకు మిన్న యగు బుద్ధి మహిమ మందు
నరయ బుద్ధిని మించిన దతఁడె చుమ్మి 42.

ఇంద్రియములు గొప్ప వని యందురు. వాని కన్న మనస్సు గొప్పది. మనస్సు కన్న
బుద్ధి గొప్పది. బుద్ధి కన్న నతఁడె (ఆత్మ) గొప్ప.

ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మానమాత్మనా ।
జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్ ॥

తే.గీ. ఇవ్విధము మహాబాహు మహితము బుద్ధి
కన్న నైన దాని నెఱిఁగి తన్ను నింక
నాత్మ చే నియమించి కామాకృతిఁ గని
పించు నరిని దురాసదుఁ ద్రుంచు మించి 43.

ఈ విధము మహాభుజా బుద్ధి కన్న మిన్ననైన దాని నెఱిఁగి యాత్మచే నియంత్రించి
కామపు రూపమునఁ గనిపించు శత్రువును జయింపుము.

ఇది శ్రీకృష్ణ సూక్తి సుధాకరమను శ్రీమదాంధ్ర భగవద్గీత యందుఁ గర్మ యోగమను మూడవ యధ్యాయము.
పోచిరాజు కామేశ్వర రావు నామధేయ ప్రణీతము.

శ్రీకృష్ణాయ నమః

# శ్రీకృష్ణ సూక్తి సుధాకరము

మూలము శ్రీమద్భగవద్గీత

## అధ్యాయము నాలుగు – జ్ఞాన కర్మ సన్న్యాస యోగము

శ్రీభగవానువాచ ।
ఇమం వివస్వతే యోగం ప్రోక్తవానహమవ్యయమ్ ।
వివస్వాన్మనవే ప్రాహ మనురిక్ష్వాకవేఽబ్రవీత్ ॥

శ్రీభగవానుని పలుకులు:

తే.గీ. అవ్యయంపు టీ యోగము నర్యమునకుఁ
జెప్ప నేను మనువునకుఁ జెప్పె నినుఁడు
మనువు నుడివె నిక్ష్వాకునకు నిన వంశ
వర్ధనునకు సంప్రీతి వివరము గాను 1.

క్షయము కాని యీ యోగమును మున్ను నేను సూర్యునకుఁ జెప్పితిని. సూర్యుఁడు వైవస్వత మనువునకుఁ జెప్పెను. మను విక్ష్వాకునకుఁ జెప్పెను.

ఏవం పరమ్పరాప్రాప్తమిమం రాజర్షయో విదుః ।
స కాలేనేహ మహతా యోగో నష్టః పరన్తప ॥

తే.గీ. ఇవ్విధిఁ బరంపరమ్ముగ నేఁగుదెంచ
నెఱిఁగి రెల్ల రాజర్షులు మఱియుఁ బెద్ద
పొద్దు గడవంగ నీ యోగము లయ మయ్యె
నిప్పుడు పరంతప కన రా దిప్పుడమిని 2.

ఈ విధముగాఁ గ్రమ క్రమముగా రాజర్షు లెల్ల యెఱిఁగిరి. చాల యేండ్లు గడవఁగ నిది మఱుగునఁ బడెను. పరంతపా యిప్పు డిది యిప్పుడమినిఁ గన్పట్టదు.

స ఏవాయం మయా తేఽద్య యోగః ప్రోక్తః పురాతనః ।
భక్తోఽసి మే సఖా చేతి రహస్యం హ్యేతదుత్తమమ్ ॥

తే.గీ. అతి పురాతన మీ యోగ మరయ నాదు
భక్తుఁడవు నీ వని తలఁచి పరమ గుంభ
నమ్ము నుత్తమమును దీని నయపు సఖుఁడ
వైన కతన నుడువు చుంటి నంత మఱల 3.

పురాతన మైన యీ యోగమును నాకు భక్తుఁడవు, సఖుఁడవు కనుక నీకు నిపుడు చెప్పు చుంటిని.

అర్జున ఉవాచ ।
అపరం భవతో జన్మ పరం జన్మ వివస్వతః ।
కథమేతద్విజానీయాం త్వమాదౌ ప్రోక్తవానితి ॥

అర్జునుని పలుకులు:

తే.గీ. మున్ను గద సూర్యుని జనన మన్నఁ బిదప
నీదు భవ మన్న మఱి నేను నేర్తు నెట్లు
చెప్పితి వన నీ యోగము చిత్రభాను
కొఱకుఁ బూర్వము సర్వము గూర్మి తోడ 4.

సూర్యుఁడు నీ కన్నను ముందుఁ బుట్టెను గదా మఱి నీవు సూర్యునకుఁ జెప్పితి వనిన నే నెట్లు తెలిసికొన వలెను? అని అర్జునుఁ డడిగెను.

శ్రీభగవానువాచ ।
బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున ।
తాన్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరన్తప ॥

శ్రీభగవానుని పలుకులు:

తే.గీ. పెక్కు జన్మలు గడచె నా కక్కజముగ
నీకుఁ గూడ నర్జున విను నేర వీవు
వానినిఁ బరంతప యిపుడు వాని నెల్ల
నే నెఱుఁగుదు వివరముగ మానసమున 5.

అర్జున నీకును నాకును బెక్కు జన్మలు గడచినవి. నే నన్నిటిని నెఱుంగుదును. నీ

వెలుఁగవు.

అజోఽపి సన్నవ్యయాత్మా భూతానామీశ్వరోఽపి సన్ ।
ప్రకృతిం స్వామధిష్ఠాయ సమ్భవామ్యాత్మమాయయా ॥

తే.గీ. జీవులకు నీశుఁడ నవినాశి నయిన మఱి
యజుఁడ నైన నాదు ప్రకృతి నాశ్రయించి
పుట్టు చుందును దలఁచి నప్పు డిటఁ జిత్ర
మైన నాదగు మాయచే నంచితముగ 6.

జీవులకు ప్రభువును. నాశము లేని వాఁడను. పుట్టుక లేని వాని నైనను నా
స్వభావముచేత మాయ చేతను దలంచి నప్పు డెల్ల బుట్టుదును.

యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత ।
అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్ ॥

తే.గీ. ఎప్పు డెప్పుడు మఱి యుదయించు హాని
ధర్మమున కెప్పు డెప్పు డధర్మమునకు
వృద్ధి యగు నప్పు డప్పుడు పేర్మి భార
తా సృజించు కొందును నన్ను దథ్యముగను 7.

ధర్మమునకు నెప్పుడు హాని కలుగునో యధర్మ మెప్పు డెప్పుడు వృద్ధి జెందునో
యప్పుడు నన్ను నేను సృజియించు కొందును.

పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్ ।
ధర్మసంస్థాపనార్థాయ సమ్భవామి యుగే యుగే ॥

తే.గీ. పరమ సాధు జనులను గాపాడుటకును
బాప కర్ముల సమయింపఁ బంత మూని
తనరి స్థాపింప నింపుగ ధర్మ మింక
నవతరింతు యుగ యుగము లందు నెలమి 8.

సాధువు లైన వారిని౯ గాపాడుటకును, బాపకర్ములను శిక్షించుటకును, ధర్మమును స్థాపించుటకును యుగ యుగము లందు నేను జన్మింతును.

జన్మ కర్మ చ మే దివ్యమేవం యో వేత్తి తత్త్వతః ।
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సోఽర్జున ॥

తే.గీ. దివ్య మైన నాదు జనన భవ్య కర్మ
ము లెఱుఁగు నెవండు నిజముగఁ బుణ్యుఁ డట్టి
పురుషుఁడు విడిచి కాయము వొందఁడు మరు
జన్మ మర్జున నను జేరు సమ్మదమున 9.

దివ్యము లైన నా జన్మ కర్మముల నెవడు నిజముగ నెఱుగునో యట్టి వాడు దేహము విడిచి పునర్జన్మము నొందడు. నన్ను జేరు నర్జున.

వీతరాగభయక్రోధా మన్మయా మాముపాశ్రితాః ।
బహవో జ్ఞానతపసా పూతా మద్భావమాగతాః ॥

తే.గీ. విడిచి తగులము కినుకయు భీతి యుంచి
మనము నాయందు నాశ్రయించి నను జ్ఞాన
పుఁ దపమున శుచులై బహు పుణ్య మతులు
చేరి రంత నా భావముఁ జెలువముగను 10.

రాగము, క్రోధము, భయము విడిచి మనస్సు నా యందు నుంచి నా న్నాశ్రయించి జ్ఞాన మనెడు తపస్సున పవిత్రులై పెక్కు పుణ్యాత్ములు నా భావమునే పొందిరు.

యే యథా మాం ప్రపద్యన్తే తాంస్తథైవ భజామ్యహమ్ ।
మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః ॥

తే.గీ. ఎవ్విధి నెవరు మది నన్ను నెలమి నేర్తు
రు భజియింప నవ్విధి నేను నభయ మిచ్చి
వారి సేవింతు నింక నా వర్తనినె మ
నుజులు వివిధ విధములఁ జనుదురు పార్థ 11.

ఎవ్వ రే విధము నన్ను భజియింతురో వారి కవ్విధి నభయ మిచ్చి
యనుగ్రహింతును. నేను వర్తించి నట్టులే మనుష్యులు వర్తింతురు.

కాఙ్క్షన్తః కర్మణాం సిద్ధిం యజన్త ఇహ దేవతాః ।
క్షిప్రం హి మానుషే లోకే సిద్ధిర్భవతి కర్మజా ॥

తే.గీ. కోరి కర్మపు ఫలములు కూర్మి తోడ
నిచట పూజింతు రమరుల నెల్ల నరులు
కర్మ సంచయ ఫలములు గలుగు శీఘ్ర
ముగను నరలోక మందున ముదము గొల్ప 12.

చేసిన కర్మములకు ఫలము నాశించి నరులు దేవతలను గొల్తురు. వారికి ఫలములు
కూడ వేగముగ నర లోక మందే సిద్ధించు చున్నవి.

చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః ।
తస్య కర్తారమపి మాం విద్ధ్యకర్తారమవ్యయమ్ ॥

తే.గీ. కర్మములు గుణముల భేద మర్మ మరసి
నాల్గు జాతులు గల్పించిన ఘన గర్త
నయినను మఱి దానికి నన్ను నక్రియునిగ
నవ్యయునిగఁ దెలిసికొను మమల మతిని 13.

గుణ కర్మముల భేదమున నాల్గు వర్ణములను నేన సృష్టించితిని. ఈ కార్యమునకు
నేనే కర్త నైనను నన్ను నవ్యయుని నక్రియునిగా నెఱుంగుము.

న మాం కర్మాణి లిమ్పన్తి న మే కర్మఫలే స్పృహా ।
ఇతి మాం యోఽభిజానాతి కర్మభిర్న స బధ్యతే ॥

తే.గీ. అంట వెన్నఁడు పను లవి వెంట నన్ను
గోరఁ గర్మ సిద్ధిని నేను గూడ నెపుడుఁ
దెలియు నన్ను నెవ్వం డిట్లతి వివరముగ 14.

నతనిఁ బట్టఁ గర్మమ్ముల కలవి కాదు

పనులు నన్ను ముట్టవు. కర్మఫలమును నే నాశింపను. ఈ నా తత్త్వమును దెలిసిన వానినిఁ గర్మములు బంధింపవు.

ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వైరపి ముముక్షుభిః ।
కురు కర్మైవ తస్మాత్త్వం పూర్వైః పూర్వతరం కృతమ్ ॥

తే.గీ. దీని నెఱిఁగి పూర్వమ్మునఁ దివిరి చేసి
రి మఱి మోక్ష మరయు వారు సుమతిఁ బనులు
వార లెల్లరు సల్పిన పాత వైన
పనులు సేయు మీవును గానఁ బార్థ తనరి 15.

దీని నెఱిఁగి పూర్వమున మోక్షకాములు కర్మములను జేసిరి. నీవు గూడ వారి వలెనే కర్మము లాచరింపుము.

కిం కర్మ కిమకర్మేతి కవయోఽప్యత్ర మోహితాః ।
తత్తే కర్మ ప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్ ॥

తే.గీ. కర్మము నకర్మ మన నేమి కల్గు మోహ
ము కవులకు నైన మది భేదము నెఱుగంగ
లేక యెఱుక పఱతు నిట నీకుఁ దెలియ
దేని నగు నింక నఘ విముక్తి పదిలముగ 16.

కర్మము నకర్మము నన నేమియో తెలియక పండితులు కూడా భ్రాంతు లగుచున్నారు. ఏ కర్మమును దెలిసి కొనినఁ బాపములు నశించునో యట్టి దానిని వివరింతును వినుము.

కర్మణో హ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యం చ వికర్మణః ।
అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః ॥

తే.గీ. ఎఱుఁగఁ దగుఁ గర్మపు స్వభావ మెల్ల నెమ్మిఁ 17.

దగని కర్మపు భావము దగును దెలియఁ
జేయమిని పని దానిపైఁ జింత వలయుఁ
గష్ట తరము సుమ్ము తెలియఁ గర్మ గుణము

కర్మపు స్వభావము, తగని కర్మపు స్వభావము కూడ తెలియ వలెను. అకర్మమును గూడ నెఱుఁగ వలెను. కర్మముల గుణముల నెఱుఁగుట కష్ట తరము.

కర్మణ్యకర్మ యః పశ్యేదకర్మణి చ కర్మ యః ।
స బుద్ధిమాన్మనుష్యేషు స యుక్తః కృత్స్నకర్మకృత్ ॥

తే.గీ. కర్మ మందున నెవ్వఁ డకర్మముఁ గను
మఱి యకర్మ మందుఁ గనుఁ గర్మ మెవఁ డట్టి
వాఁ డగును గర్మములు సేయు వాఁడు నరుల
బుద్ధిమంతుఁడు యోగి జగద్ధితముగ 18.

కర్మము లందు నకర్మము నకర్మము నందు కర్మము నెవఁడు జూడఁ గలఁడో వాఁడు కర్మము లొనరించు వాఁ డగును. వాఁడు నరులందు యోగి, బుద్ధిమంతుఁడును.

యస్య సర్వే సమారమ్భాః కామసఙ్కల్పవర్జితాః ।
జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం తమాహుః పణ్డితం బుధాః ॥

తే.గీ. బాగుగ మొదలిడిన యేరి పనులఁ గోర్కు
లవి ధృతి విడువఁ బడినవి యట్టివారి
నెఱుక యను నగ్నిచేఁ గర్మ మెల్లఁ గాల్తు
వారి నంద్రు పండితులని చేరి బుధులు 19.

బాగుగఁ బ్రారంభించి పనులు, వానిపై నెవరు ఫలము నాశింపరో మఱియు జ్ఞాన మను నగ్నిచేఁ గర్మములను గాల్చెదరో వారినిఁ బండితు లని బుధులు పల్కుదురు.

త్యక్త్వా కర్మఫలాసఙ్గం నిత్యతృప్తో నిరాశ్రయః ।
కర్మణ్యభిప్రవృత్తోఽపి నైవ కిఞ్చిత్కరోతి సః ॥

తే.గీ. ఫలములఁ దనదు పనుల తగులము లేని
వాఁడు తృప్తుఁ డండయు లేని వాఁడు సతము
కర్మములను మునిఁగినను గాఁడు తల్ప
నెట్టి కర్మము మఱి చేయు నట్టి వాఁడు 20.

ఎవఁడు పనుల యందు ఫలము నాశింపఁడో నిత్య తృప్తుఁడై యుండునో దేని యాశ్రయమును గొనఁడో వాఁడు కర్మములను జేయుచున్నను జేయ నట్టి వాఁడే యగును.

నిరాశీర్యతచిత్తాత్మా త్యక్తసర్వపరిగ్రహః ।
శారీరం కేవలం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్ ॥

తే.గీ. దేహమును మనసును గెల్చి దివ్యముగను
వీడి యాసను ద్యజియించి వివిధ భోగ
ములను జేయ శారీరకంపుఁ బను లెల్లఁ
బొందఁ డెట్టి పాపమ్మును బురుషుఁ డెపుడు 21.

చిత్తము నింద్రియములను నియంత్రించి, యాశలను వీడి, భోగములను ద్యజించి, శారీరకపుఁ బనులను జేయు వాఁడు పాపములను బొందఁడు.

యదృచ్ఛాలాభసన్తుష్టో ద్వన్ద్వాతీతో విమత్సరః ।
సమః సిద్ధావసిద్ధౌ చ కృత్వాపి న నిబధ్యతే ॥

తే.గీ. తనిసి తనయంతఁ గల్గు ప్రాప్తమ్ము వలన
రెంటికి నతీతుఁడై మచ్చరికము వీడి
సముఁడునై ఫలించిన ఫలిత మరయకను
గర్మములు సేయ బద్ధుండు గాఁడు వాఁడు 22.

యాదృచ్ఛికముగా వచ్చిన వాని యందుఁ దృప్తిఁ జెంది, సుఖ దుఃఖాది ద్వంద్వములకు సముఁడై, మాత్సర్యము లేక ఫలించినను ఫలింప కున్న నొక్క రీతి నుండి కర్మములను జేయు వాఁడు వానిచే బంధింపఁ బడఁడు.

గతసఙ్గస్య ముక్తస్య జ్ఞానావస్థితచేతసః ।
యజ్ఞాయాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే ॥

తే.గీ. ఆసను ద్యజించి బంధమ్ము లన్ని వీడి
జ్ఞానమున నుంచి మనసు యజ్ఞముల కొఱకు
నాచరింపఁ బనులు వాని యఖిల కర్మ
సంచయమ్ము లవి ద్రుటి నాశనము లౌను 23.

ఆశను వీడి, మమతానుబంధములు వీడి, మనస్సును జ్ఞానమున నుంచి
యజ్ఞముల కొఱకుఁ బనులను జేయు వాని పను లన్నియు వాని నంటవు.

బ్రహ్మార్పణం బ్రహ్మ హవిర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్ ।
బ్రహ్మైవ తేన గన్తవ్యం బ్రహ్మకర్మసమాధినా ॥

తే.గీ. అర్పణమ్ము లన్నియును బ్రహ్మ యగుఁ జుమ్మి
హవియు బ్రహ్మ బ్రహ్మ యనెడు నగ్ని యందు
బ్రహ్మ నిభుని హుతము బ్రహ్మ బ్రహ్మ కర్మ
రతుఁడు వొందు ఫలము గూడ బ్రహ్మ యగును 24.

యాగమున నర్పించు ద్రవ్యము లన్నియు బ్రహ్మములే, హవియు, బ్రహ్మ యనెడు
నగ్ని యందు బ్రహ్మ సమానుఁ డైన వానిచే చేయఁబడు హోమము కూడ బ్రహ్మమే.
బ్రహ్మకర్మము లందు నిష్ఠ మున్న వాఁడు పొందు ఫలము కూడ బ్రహ్మమే.

దైవమేవాపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే ।
బ్రహ్మాగ్నావపరే యజ్ఞం యజ్ఞేనైవోపజుహ్వతి ॥

తే.గీ. యోగు లందుఁ గొంద ఱిల దైవోపచార
యజ్ఞ మాచరింప నితరు లంత బ్రహ్మ
మనెడు నగ్ని యజ్ఞము చేత యజ్ఞ జీవి
నుత్సహించి వేల్చెదరు యథోచితముగ 25.

యోగు లందుఁ గొందఱు దైవ పూజ యను యజ్ఞమును జేయుదురు. ఇతరులు

బ్రహ్మ మనెడు నగ్ని యందు యజ్ఞము చేత యజ్ఞ జీవిని యథోచితముగ వేల్చెదరు.

శ్రోత్రాదీ నీన్ద్రియాణ్యన్యే సంయ మాగ్నిషు జుహ్వతి ।
శబ్దాదీ న్విషయా నన్య ఇన్ద్రియాగ్నిషు జుహ్వతి ॥

తే.గీ. చెవి మొదలగు నింద్రియములఁ జిత్రముగను
వేల్తు రిల సంయమాగ్నిని విబుధ వరులు
కొంద అన్యులు కాల్తురు ఘోష ణాది
విషయముల నింద్రి యాగ్నిని విస్మయముగ 26.

చెవి మొదలగు నింద్రియముల సంయమ మను నగ్నిలో కొందఱు వేల్తురు. ఇతరులు
శబ్దము మొదలగు నింద్రియ విషయముల నింద్రియము లనెడు నగ్నిలో వేల్చెదరు.

సర్వాణీన్ద్రియకర్మాణి ప్రాణకర్మాణి చాపరే ।
ఆత్మసంయమయోగాగ్నౌ జుహ్వతి జ్ఞానదీపితే ॥

తే.గీ. ఇంద్రియమ్ముల పను లెల్ల నింకయు తమ
జీవపుం బనులను గూడఁ జిత్త సంయ
మంపు యోగ మనెడు నగ్ని నింపొసంగ
వేల్తు రపరులు విత్తి దివ్వి వెలుతురున 27.

కొంద ఱింద్రియముల పనులను, బ్రాణముల పనులను జ్ఞాన దీపమున వెలుఁగు
నాత్మ సంయమ మనెడు నగ్నిలో వేల్చెదరు.

ద్రవ్యయజ్ఞాస్తపోయజ్ఞా యోగయజ్ఞాస్తథాపరే ।
స్వాధ్యాయజ్ఞానయజ్ఞాశ్చ యతయః సంశితవ్రతాః ॥

తే.గీ. ఇంకఁ గొందఱు ద్రవ్యంపు టిద్ధ తపపు
యోగపు మఱియు నింకను యుక్త వేద
సంచయాధ్యయనంపును మించి నట్టి
జ్ఞాన మను యజ్ఞముల ధృతిఁ బూనుకొంద్రు 28.

కొందఱు ద్రవ్య యజ్ఞమును దపోయజ్ఞమును యోగ యజ్ఞమును వేదాధ్యయన
యజ్ఞమును జ్ఞాన యజ్ఞమును దృఢ వ్రతముతోఁ బూనుకొందురు.

అపానే జుహ్వతి ప్రాణం ప్రాణేఽపానం తథాపరే ।
ప్రాణాపానగతీ రుద్ధ్వా ప్రాణాయామపరాయణాః ॥

తే.గీ. ఇతరు లంతఁ బ్రాణాపాన గతుల నాపి
సతత మెలమిఁ బ్రాణాయామ రతులు సుగతిఁ
బ్రాణ మారుతము నపాన వాయువునను
బ్రాణ మందు నపానముఁ బరఁగి వేల్త్రు 29.

ప్రాణాపాన గతుల నాపి ప్రాణాయామమునందు నిష్ఠమున్న వారు ప్రాణ వాయువున
నపాన వాయువు, నపాన వాయువునఁ బ్రాణ వాయువును వేల్చెదరు.

అపరే నియతాహారాః ప్రాణాన్ప్రాణేషు జుహ్వతి ।
సర్వేఽప్యేతే యజ్ఞవిదో యజ్ఞక్షపితకల్మషాః ॥

తే.గీ. మఱియు కొందఱు మితపు టోమటి భుజించు
నట్టి వారు ప్రాణము నంద పెట్టి ప్రాణ
మును హుత మొనర్చెదరు వీరు కన సవన వి
దులును గ్రతు వినాశిత దురితులును జుమ్మి 30.

కొందఱు మితముగ నాహారమును భుజించుచుఁ బ్రాణము నందునే ప్రాణమును
వేల్చెదరు. వీరు వేదము లెఱిఁగిన వారు, యజ్ఞములచేఁ బాపములను పోగొట్టు కొనిన
వారు.

యజ్ఞశిష్టామృతభుజో యాన్తి బ్రహ్మ సనాతనమ్ ।
నాయం లోకోఽస్త్యయజ్ఞస్య కుతోఽన్యః కురుసత్తమ ॥

తే.గీ. జన్న మందున శేషమై యున్న యమృత
ము తిను నట్టి వారొందెద రతి పురాత
నంపు బ్రహ్మము సల్పకున్న సవనము లి 31.

హమ్ము లేదనఁ బర మేది యర్జున యిఁక

యజ్ఞమున మిగిలిన యన్నమును భుజించు వారు పురాతన మైన బ్రహ్మ పదమును బొందెదరు. చేయ కున్న నిహమే లేదనిన పరము మాట చెప్ప నేల యర్జున?

ఏవం బహువిధా యజ్ఞా వితతా బ్రహ్మణో ముఖే ।
కర్మజాన్విద్ధి తాన్సర్వానేవం జ్ఞాత్వా విమోక్ష్యసే ॥

తే.గీ. ఇవ్విధిఁ గలవు పెక్కులు సెల్లఁ గర్మ
జనిత యజ్ఞములు బహు విస్తరములై చె
లంగు బ్రహ్మ ముఖమున నలరి యెఱుంగ
వాని నెల్ల విముక్తినిఁ బడయఁ గలవు 32.

కర్మ జనితము లైన యజ్ఞములు వేదము (బ్రహ్మము) లందుఁ బెక్కు గలవు. వానిని తెలిసికొనిన విముక్తుఁడవు కాఁ గలవు.

శ్రేయాన్ద్రవ్యమయాద్యజ్ఞాజ్జ్ఞానయజ్ఞః పరన్తప ।
సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే ॥

తే.గీ. మిన్న యగు జ్ఞాన యజ్ఞమ యెన్న నింక
ద్రవ్య మయ యజ్ఞమునకుఁ బరంతప పను
లెల్ల సంపూర్ణముగఁ బార్థ యింపొసంగ
ముగియు జ్ఞానమ్ము నంద యద్భుత మనంగ 33.

పరంతపా జ్ఞాన యజ్ఞము ద్రవ్య యజ్ఞము కన్న మిన్న. కర్మము లన్నియు జ్ఞానము నందే ముగియును.

తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా ।
ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానినస్తత్త్వదర్శినః ॥

తే.గీ. దాని నెఱుఁగుమ చక్కఁగఁ దత్త్వ దర్శ
నులు బుధుల వలన వచింత్రు నెలమి నడుగ 34.

బాగుగ భజింపఁ బ్రణమిల్ల భక్తి నీకు
నట్టి జ్ఞానము సర్వము నంచితముగ

ఆ జ్ఞానమును దత్త్వము తెలిసిన బుధుల వలన తెలిసికొనుము. భక్తితో భజియించి నమస్కరించిన జ్ఞానము సర్వమును వారు తెలిపెదరు.

యజ్జ్ఞాత్వా న పునర్మోహమేవం యాస్యసి పాణ్డవ ।
యేన భూతాన్యశేషేణ ద్రక్ష్యస్యాత్మన్యథో మయి ॥

తే.గీ. దేని నెఱిఁగిన నిట్టి రీతి దగు మోహ
మును బడయ వీఁకఁ బాండవ మనసు నందు
దేని వలన నీ లోనను గానఁ గలవు
పిదప నా యందు నీ భూత వితతి నెల్ల 35.

దేని నెఱిఁగిన నీ మోహము మనస్సు నందుఁ బొందవో, దేని వలన నీ లోను, నాలోను భూత సమూహము నెల్లఁ జూడఁ గలవో దాని నెఱుఁగుము.

అపి చేదసి పాపేభ్యః సర్వేభ్యః పాపకృత్తమః ।
సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సన్తరిష్యసి ॥

తే.గీ. పాపు లందఱి కంటెను బాప మతిగఁ
జేసి నట్టి వాఁడ వయిన శ్రేష్ఠ మైన
జ్ఞాన మనెడు నావ వలన సంతరింపఁ
గలవు పాప సంచయ మెల్లఁ గౌరవేంద్ర 36.

పాపు లందఱి కన్న నెక్కువ పాపములు చేసిన వాఁడ వైనను శ్రేష్ఠ మైన యీ జ్ఞాన మను నావ వలనఁ బాపములను కడలిని దాటఁ గలవు.

యథైధాంసి సమిద్ధోఽగ్నిర్భస్మసాత్కురుతేఽర్జున ।
జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా ॥

తే.గీ. ఎట్లు జ్వలితాగ్ని సమిధల నెల్ల భస్మ 37.

ముగ నొనర్చు నభ్భంగిని మూరి నట్టి
జ్ఞాన మనెడు నగ్ని యొనర్చు చక్కగఁ బను
లను భసితముగ నర్జున యనఁగ వినుమ

మండుచున్న యగ్ని కట్టెలను గాల్చు విధము జ్ఞాన మనెడు నగ్ని కర్మములను భస్మము చేయఁ గలదు.

న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే ।
తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విన్దతి ॥

తే.గీ. ఇందుఁ గానము జ్ఞానపుఁ జంద మింపు
గను బవిత్రము నొనరింపఁ గల్గు దాని
నెందు దానిని స్వయముగఁ బొందఁ గలఁడు
యోగ సిద్ధుఁడు దన యంద యేఁగఁగఁ దఙి 38.

జ్ఞానము వలె పవిత్రము నొనరించు దానిని నెచ్చటను జూడలేము. సమయము గడవఁగ యోగమున సిద్ధి పొందిన వాఁడు స్వయముగఁ దనలోనే పొందును.

శ్రద్ధావాఁల్లభతే జ్ఞానం తత్పరః సంయతేన్ద్రియః ।
జ్ఞానం లబ్ధ్వా పరాం శాన్తిమచిరేణాధిగచ్ఛతి ॥

తే.గీ. శ్రద్ధ గలవాఁడు నిష్ఠుఁడు సంయతేంద్రి
యుండు వొందు జ్ఞానము నెల్ల మండితముగఁ
బొంద దాని నచిరమునఁ బొందఁ గలఁడు
పరమ శాంతిని మనుజుండు పార్థ వినుమ 39.

పార్థ శ్రద్ధ నిష్ఠ గలవాఁడు, నింద్రియములను నియంత్రించిన వాఁడు జ్ఞానమును బొందఁ గలఁడు. అది లభించినఁ బరమంపు శాంతిని నరుఁడు శీఘ్రమ పొందఁ గలఁడు.

అజ్ఞశ్చాశ్రద్దధానశ్చ సంశయాత్మా వినశ్యతి ।
నాయం లోకోఽస్తి న పరో న సుఖం సంశయాత్మనః ॥

తే.గీ. నమ్మకము తెలివియు శ్రద్ధ యిమ్ముగ మది
లేని వాఁడు నశించును వాని కుండ
దెంచ నీ లోకము పరము నంచిత సుఖ
మును నిరంతర సంశయాత్మునకు నింక 40.

నమ్మకము, జ్ఞానము, శ్రద్ధలు లేని వాఁడు చెడును. నిత్య శంకితునకు నిహమును బరమును సుఖము లేదు.

యోగసంన్యస్తకర్మాణం జ్ఞానసఞ్ఛిన్నసంశయమ్ ।
ఆత్మవన్తం న కర్మాణి నిబధ్నన్తి ధనఞ్జయ ॥

తే.గీ. తొలఁగఁ గర్మము యోగము వలన మఱియు
విడువ సంశయములు జ్ఞాన వితతి చేత
వాని నాత్మవంతునిఁ బను లేని కట్ట
లేవు సుమ్మి ధనంజయ యే విధముగ 41.

ధనంజయా యోగము వలనఁ గర్మములు తొలఁగఁగ జ్ఞానము చేత సంశయములు వీడ యట్టి యాత్మకలవానిఁ గర్మములు కట్ట లేవు.

తస్మాదజ్ఞానసమ్భూతం హృత్స్థం జ్ఞానాసినాత్మనః ।
ఛిత్త్వైనం సంశయం యోగమాతిష్ఠోత్తిష్ఠ భారత ॥

తే.గీ. హృదయ మందు నున్న, తెలివి యింత లేక
కల్గి నట్టి, నీ శంక వీఁకఁ దునుమాడి
నీదు జ్ఞానంపుఁ గత్తిచే నెమ్మి నింక
యోగమును భారత సలుపు వేగ లెమ్ము 42.

భారతా జ్ఞానము లేనందున మదిలోఁ గల్గిన శంకను నీ జ్ఞాన మను కత్తితో నఱికి వేగముగఁ గర్మ యోగమును జల్పుటకు లెమ్ము .

ఇది శ్రీకృష్ణ సూక్తి సుధాకరమను శ్రీమదాంధ్ర భగవద్గీత యందు జ్ఞాన కర్మ సన్న్యాస  యోగమను నాల్గవ యధ్యాయము.

వోచిరాజు కామేశ్వర రావు నామధేయ  ప్రణీతము.

శ్రీకృష్ణాయ నమః

# శ్రీకృష్ణ సూక్తి సుధాకరము

మూలము శ్రీమద్భగవద్గీత

## అధ్యాయ మైదు – కర్మసన్న్యాస యోగము

అర్జున ఉవాచ ।
సంన్యాసం కర్మణాం కృష్ణ పునర్యోగం చ శంససి ।
యచ్ఛ్రేయ ఏతయోరేకం తన్మే బ్రూహి సునిశ్చితమ్ ॥

అర్జునుని పలుకులు:

తే.గీ. వీడుటయుఁ బనులఁ దిరిగి కూడుటయును
గృష్ణ చెప్పెద వీ వసకృత్తు నాకు
వీని యందు నెయ్యది మేలు విరివి నయ్యె
ది నుడువుమ యొక్కటియ నాకు స్థిరముగ నిఁక 1.

కృష్ణ పనులను వీడుటయు మఱియు కూడుటయును జెప్పెదవు. వీనిలో నేది శ్రేయస్కరమో దానిని నిశ్చయముగ నాకు తెలుపుము.

శ్రీభగవానువాచ ।
సంన్యాసః కర్మయోగశ్చ నిఃశ్రేయసకరావుభౌ ।
తయోస్తుకర్మసంన్యాసాత్కర్మయోగో విశిష్యతే ॥

శ్రీభగవానుని పలుకులు:

తే.గీ. కర్మ సన్న్యాసము మఱియు కర్మయోగ
మును దలంప రెండును మోక్షముఁ గలిగించుఁ
దనరి కర్మయోగము మిన్న పనుల నన్ని
విడుచి యుండుట కన్నను విశదముగను 2.

కర్మములను వీడినను, జేసినను రెండును మోక్షము నీయఁ గలవు. కర్మ సన్న్యాసము కన్న కర్మయోగము శ్రేష్ఠ మైనది.

జ్ఞేయః స నిత్యసంన్యాసీ యో న ద్వేష్టి న కాఙ్క్షతి ।
నిర్ద్వన్ద్వో హి మహాబాహో సుఖం బన్ధాత్ప్రముచ్యతే ॥

తే.గీ. ఎవఁ డెఱుఁగఁ డసూయ నొకింత యెవఁడు కోర
కుండు దేని మహాబాహు గుర్తెఱుఁగుము
వాని నల నిత్య సన్యాసి గాను బంధ
ముక్తుఁ డగు ద్వంద్వ రహితుఁడు మోదముగను 3.

ఎవరు ద్వేషింపఁడో మఱియు దేనినిఁ గోర కుండునో యతఁడే నిత్య సన్న్యాసి. పరస్పర విరుద్ధ ద్వంద్వములను వీడిన వాఁడు సంసారాది బంధముల నుండి విముక్తుఁ డగును.

సాఙ్ఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదన్తి న పణ్డితాః ।
ఏకమప్యాస్థితః సమ్యగుభయోర్విన్దతే ఫలమ్ ॥

తే.గీ. జ్ఞాన కర్మము లవివేకు లానతింతు
రింక వేఱు వేఱని యవి శంక లేక
కాని విభుధు లనరు పొందు దేని నాచ
రించినను వాఁడు చక్కఁగ రెంటి ఫలము 4.

జ్ఞాన యోగము, కర్మయోగములు రెండు వేఱు వేఱని యవివేకు లందురు. అందు దేని నాచరించినను రెంటి ఫలములను బొందఁ గలరు.

యత్సాఙ్ఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే ।
ఏకం సాఙ్ఖ్యం చ యోగం చ యః పశ్యతి స పశ్యతి ॥

తే.గీ. జ్ఞాన యోగులు వొందెడు స్థాన మెంచఁ
గర్మ యోగు లయినఁ బొందఁ గలరు రెంటి
నెవఁడు గాంచు నొక్క టనుచుఁ దివిరి వాఁడ
యగును నిజము నింక నరసి నతఁడు సుమ్మి 5.

జ్ఞాన యోగులు పొందు దానినిఁ గర్మ యోగులును బొందఁ గలరు. రెండును సమ

మని చూచువాఁడు నిజమును జూచు వాఁ డగును.

సంన్యాసస్తుమహాబాహో దుఃఖమాప్తుమయోగతః ।
యోగయుక్తోమునిర్బ్రహ్మ నచిరేణాధిగచ్ఛతి ॥

తే.గీ. కర్మములఁ గూడ కున్నచోఁ గష్ట మగును
సన్యసింప మహాబాహు సలిపి చెయివు
లను మనన శీలుఁ డచిరమ్మునను గదియఁ గ
లండు బ్రహ్మము సంతత ముండ నచట 6.

కర్మములు చేయకుండ యర్జున సన్యాసమును బొందుట దుఃఖకరము. కర్మములు
చేయుచు ముని బ్రహ్మమును ద్వరితము వొందఁ గలఁడు.

యోగయుక్తోవిశుద్ధాత్మా విజితాత్మా జితేన్ద్రియః ।
సర్వభూతాత్మభూతాత్మా కుర్వన్నపి న లిప్యతే ॥

తే.గీ. తనరి యోగమున శుచి చిత్తమున గెలిచి
మనము నింద్రియములఁ గెల్చి యనవరతము
నరసి తన యాత్మ నందున నఖిల భూత
ము లొనరింపఁ గృత్యము లలము కొన వతని 7.

కర్మ యోగమున నుండి శుచియైన మనస్సుతో నింద్రియములను గెలిచి నిత్యము
తన యాత్మ యందు నఖిల భూతముల యాత్మలను జూచుచుఁ గర్మముల
నాచరించిన నవి వాని నంటవు.

నైవ కిఞ్చిత్కరోమీతి యుక్తోమన్యేత తత్త్వవిత్ ।
పశ్యఞ్శృణ్వన్స్పృశఞ్జిఘ్రన్నశ్నన్గచ్ఛన్స్వపఞ్శ్వసన్ ॥

తే.గీ. తత్త్వ మెఱిఁగిన యుక్తుఁడు దలఁచు నించు
కేని పనినిఁ జేయుట లేదు తాన యంచుఁ
జూచుచు వినుచుఁ దా స్పృశించుచు నడచుచుఁ
దినుచుఁ బీల్చుచుఁ బండి మూర్కొనుచు మఱియు 8.

తత్త్వము తెలిసిన యోగి తా నే పనినిఁ జేయుట లేదనియే యెంచును.  చూచుచు, వినుచు, నంటుచు, నడచుచు, దినుచుఁ, బీల్చుచుఁ, బండుకొనుచు వాసన చూచుచు మఱియు

ప్రలపన్విసృజన్గృహ్ణన్నున్మిషన్నిమిషన్నపి ।
ఇన్ద్రియాణీన్ద్రియార్థేషు వర్తన్త ఇతి ధారయన్ ॥

తే.గీ. పలుకుచును విడుచుచును జేపట్టుచును దె
అచుచుఁ గన్ను లు మూసికొనుచును దలఁచు
నింద్రియము లింద్రి యార్థమ యెలమిఁ జేయు
చున్న వంచు ధృతి వహించి చోద్యముగను 9.

పలుకుచు, విడుచుచుఁ, గన్నులు తెఱచుచు మూసికొనుచు నివి యన్నియు నింద్రియములచే నింద్రియముల కొఱకుఁ జేయఁ బడుచున్న వని నమ్మును.

బ్రహ్మణ్యాధాయ కర్మాణి సఙ్గం త్యక్త్వా కరోతి యః ।
లిప్యతే న స పాపేన పద్మపత్రమివామ్భసా ॥

తే.గీ. విడిచి యాసక్తి చెయ్యు లవి మఱి బ్రహ్మ
మందు నుంచి చేయు నెవఁడు వొందఁ డింక
వాఁడు పాపము లుదకము పడ్డఁ దామ
రాకు నందు నంటని భంగి నద్భుతముగ 10.

ఆసక్తిని విడిచి పనులను బరమాత్ముని యందు నుంచి యెవరు కర్మము లాచరించునో వానినిఁ బాపములు తామరాకు పైనఁ బడిన నీరు దాని నంటని రీతి నంటవు.

కాయేన మనసా బుద్ధ్యా కేవలైరిన్ద్రియైరపి ।
యోగినః కర్మ కుర్వన్తి సఙ్గం త్యక్త్వాత్మశుద్ధయే ॥

తే.గీ. తనువు చేతను మనసు చేత నిఁక బుద్ధి 11.

చేత తమ యింద్రియమ్ముల చేత వీడి
రక్తి యాత్మ శుద్ధికయి కర్మముల యోగి
వరులు పన్నుగఁ జేయు చుందు రనిశమ్ము

కర్మయోగులు తమ శరీరము, మనస్సు, బుద్ధి యింద్రియముల చేతఁ గర్మముల నాసక్తి వీడి యాత్మ శుద్ధి కొఱకు నాచరింతురు.

యుక్తః కర్మఫలం త్యక్త్వా శాన్తిమాప్నోతి నైష్ఠికీమ్ ।
అయుక్తః కామకారేణ ఫలే సక్తోనిబధ్యతే ॥

తే.గీ. యోగ యుక్తుఁడు సంతత ముడిగి కర్మ
ఫలములను బొందు శాంతినిఁ బరమ మైన
దానిఁ దగులు తఱుమ ఫలితమ్ముల నిడి
తగులము నయుక్తుఁ డరయు బంధనము లెల్ల 12.

కర్మ ఫలము లందు రక్తిని వీడి కర్మయోగుఁడు పరమమైన శాంతినిఁ బొందును. కోరికలచేఁ దఱుమఁ బడి ఫలములపై నాస నుంచి యోగయుక్తుఁడు కాని వాఁడు కర్మములచేఁ బంధితుఁ డగును.

సర్వకర్మాణి మనసా సంన్యస్యాస్తే సుఖం వశీ ।
నవద్వారే పురే దేహీ నైవ కుర్వన్న కారయన్ ॥

తే.గీ. ఎనిమిది యొకటి వాకిళ్ళ యింటి లోన
దేహి వశి వసించు విడిచి స్థిరపు మనసు
చేతఁ జెయ్వు లన్నియుఁ దాను జేయకయును
మఱియు చేయింపకయును సమ్మదము వెలయ 13.

నవద్వారము లున్న దేహములో దేహి స్థిర మైన మనస్సుచే బనులను సన్యసించి యింద్రియ నిగ్రహుఁడై కర్మములను జేయని, చేయింపని వాఁడై సంతోషముతో నివసించును.

న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః ।
న కర్మఫలసంయోగం స్వభావస్తుప్రవర్తతే ॥

తే.గీ. ప్రభువు సృజియింపఁడు జగపుఁ బనులు పనులు
చేసె నను భావమును బని చేత కలుగు
ఫలముల కలయికయు స్వభావ మగుఁ గార
ణమ్ము వీని కన్నింటికి నమ్మకముగ 14.

భగవంతుఁడు జగము నందుఁ బనులను గాని వాని కర్తృత్వమును గాని కర్మఫలము లందుఁ గూడుకొనుటను గాని సృజింపఁడు. వారి వారి స్వభావములే కారణము లగును.

నాదత్తే కస్యచిత్పాపం న చైవ సుకృతం విభుః ।
అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జన్తవః ॥

తే.గీ. ఎవని పాపము సుకృతము నించుకయు గ్ర
హింపఁ డెన్నఁడు ప్రభు వావహింపఁగ నవి
వేకము మఱుగుపడెఁ దెలివి యవివేక
ము పడవేయును జీవుల మోహ మందు 15.

ఎవ్వరి పాపపుణ్యములను బ్రభువు గ్రహింపఁడు. జంతువుల యజ్ఞానమే జ్ఞానమును మూసివేయును. ఆ యజ్ఞానమే జీవులను మొహమందుఁ బడవేయును.

జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశితమాత్మనః ।
తేషామాదిత్యవజ్జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్ ॥

తే.గీ. ఆత్మ విజ్ఞానము వలన నజ్ఞత లయ
మగు నెవరికి నతిశయించి యట్టి వాని
జ్ఞానము వెలిగించును సూర్య సన్నిభమ్ము
తత్పరాత్పరు నింపుగఁ దథ్యముగను 16.

ఆత్మజ్ఞానము వలన నెవనికి నజ్ఞానము నశించునో వాని జ్ఞానము సూర్యుని వలెఁ బరమాత్మునిఁ బ్రకాశింపఁ జేయును.

తద్బుద్ధయస్తదాత్మానస్తన్నిష్ఠాస్తత్పరాయణాః ।
గచ్ఛన్త్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూతకల్మషాః ॥

తే.గీ. పరమ మందు బుద్ధి కలిగి వఱల నతని
రూపమున నుంచి నిష్ఠ నురుతర మతని
యంద తత్పరాయణుఁడై లయమ్ము గా న
ఘములు జ్ఞానముచే నభవమును బడయు 17.

పరమాత్మ యందు బుద్ధి నుంచి నిత్య మతని రూపమున నిష్ట నుంచి తత్పరుఁ డైన జ్ఞానము చేఁ బాపములు నశింపఁ బునర్జన్మము లేని స్థితినిఁ బొందును.

విద్యావినయసమ్పన్నే బ్రాహ్మణే గవి హస్తిని ।
శుని చైవ శ్వపాకే చ పణ్డితాః సమదర్శినః ॥

తే.గీ. వినయ విద్యాధికుఁ డయిన విప్రు నందు
గోవు కరియు శునకములఁ గూడ మఱియు
పరమ చండాలు నందును భద్ర గతిని
నుండు సమభావ మన్నిటఁ బండితులకు 18.

పండితు లైన వారికి విధ్యాధిక వినయుఁ డైన విప్రుని యందు, నావు, హస్తి, శునకము మొదలగు వాని యందు మఱియు చండాలు నందు సమ భావమే యుండును.

ఇహైవ తైర్జితః సర్గో యేషాం సామ్యే స్థితం మనః ।
నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాద్ బ్రహ్మణి తే స్థితాః ॥

తే.గీ. ఎవరి హృదయము స్థిరముగను వెలయు సమ
భావ మం దీ జగము జయింపఁ బడె వారి
చేత బ్రహ్మ మన్నిట సమమే తలంప
నుందు రందుచే నిర్దోష మందు వారు 19.

ఎవరి హృదయము సమభావము తో స్థిరముగా నుండునో వారిచే నీ జగత్తు జయింపఁ

బడును. అన్నిట బ్రహ్మము సమానమే. కావున వారు నిర్దోషమైన బ్రహ్మ మందే యుందురు.

న ప్రహృష్యేత్ప్రియం ప్రాప్య నోద్విజేత్ప్రాప్య చాప్రియమ్ ।
స్థిరబుద్ధిరసమ్మూఢో బ్రహ్మవిద్ బ్రహ్మణి స్థితః ॥

తే.గీ. బ్రహ్మ విదుఁ డమూఢుం డుండి బ్రహ్మ మందు
స్థిరపు బుద్ధి కలిగి సుంత చింత నొందఁ
డప్రియము నొందఁ బొందఁగ నతఁడు సుఖము
సంతసమ్ము గూడ నరయఁ డింత యైన 20.

బ్రహ్మను దెలిసిన వాఁడు మూఢత్వము లేక స్థిరమైన బుద్ధితో బ్రహ్మ మందే యుండి సుఖ దుఃఖము లందు సమానముగా నుండును.

బాహ్యస్పర్శేష్వసక్తాత్మా విన్దత్యాత్మని యత్సుఖమ్ ।
స బ్రహ్మయోగయుక్తాత్మా సుఖమక్షయమశ్నుతే ॥

తే.గీ. బయటి విషయము లందాస పడక యెట్టి
సుఖము నాత్మ నరయు నట్టి సుఖము నక్ష
యమయి పరఁగంగఁ బొందు బ్రహ్మమును గూడి
నట్టి యాత్మ కల్గిన నిశ్చయ మది యెంచ 21.

బాహ్య విషయములందు నాసక్తి లేక తన యందు నెట్టి సుఖమును బొందునో యట్టి యక్షయ మైన సుఖమును బ్రహ్మముతో నిండి యున్న యాత్మ కలిగినఁ బొందును.

యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే ।
ఆద్యన్తవన్తః కౌన్తేయ న తేషు రమతే బుధః ॥

తే.గీ. ఇంద్రియ జనిత భోగము లెల్ల దుఃఖ
కారకమ్ములు కౌంతేయ కలవు వాని
కరయ నాద్యంతములు వాని యందు బుధులు
పొంద కుండుదు రానందము లవ మైన 22.

ఇంద్రియములచేఁ గల్గిన భోగములు దుఃఖ కారకములు. అవి యనిత్యములు. వాని యందుఁ బండితు లైన వారు కొంచమైన నానందమును బొందరు.

శక్నోతీహైవ యః సోఢుం ప్రాక్శరీరవిమోక్షణాత్ ।
కామక్రోధోద్భవం వేగం స యుక్తః స సుఖీ నరః ॥

తే.గీ. తనువు విడుచుటకును మున్న తమియుఁ గినుక
ల రయము నెవఁడు సహియించు నురుతరముగ
యోగి యగు నా నరుఁడు వొందు నుత్తమంపు
సుఖము చిత్త మందును నింక సురుచిరముగ 23.

కోపమును, రక్తిని దేహము విడుచుటకు ముందు నెవఁడు విడుచునో యతఁడు యోగి యగును. అతఁడు మనస్సు నందు మేలైన సుఖమును బొందును.

యోఽన్తఃసుఖోఽన్తరారామస్తథాన్తర్జ్యోతిరేవ యః ।
స యోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతోఽధిగచ్ఛతి ॥

తే.గీ. ఎవ్వఁ డంతరాత్మ సుఖము నెలమిఁ గొనును
విశ్రమించుఁ దనదు నాత్మ వెలుఁగు నాత్మ
యంద వాడు బ్రహ్మస్థితుఁడై చెలంగి
వొందు బ్రహ్మనిర్వాణము నందముగను 24.

ఎవ్వఁ డంతరాత్మ యందే సుఖించి, విశ్రమించి ప్రకాశించునో వాఁడు బ్రహ్మ మందు నుండి మోక్షమును బొందును.

లభన్తే బ్రహ్మనిర్వాణమృషయః క్షీణకల్మషాః ।
ఛిన్నద్వైధా యతాత్మానః సర్వభూతహితే రతాః ॥

తే.గీ. ఋషులు క్షీణింప సకల కలుష చయమ్ము
సంశయమ్ములు విడనాడ సర్వభూత
ముల హితముఁ గోర నింద్రియములను నిగ్ర 25.

హింప వారికి ముక్తి లభించుఁ జుమ్ము

కలుషము లన్నియు నశింప సంశయమ్ములను వీడఁగ సర్వ భూతముల మేలు కోర నింద్రియములను నిగ్రహింప ఋషులకు ముక్తి లభించును.

కామక్రోధవియుక్తానాం యతీనాం యతచేతసామ్ ।
అభితో బ్రహ్మనిర్వాణం వర్తతే విదితాత్మనామ్ ॥

తే.గీ. అడరి కామము క్రోధము విడిచి నట్టి
వారు నియత మానసులును బరమ యతులు
నాత్మ నెఱిఁగిన వారికి నంతటఁ గని
పించు బ్రహ్మనిర్వాణము నంచితముగ 26.

కామ క్రోధములను విడనాడి, మనస్సును నియంత్రించి, యాత్మ తత్త్వము నెఱిఁగి, చరించు యతులకు నంతటను పరబ్రహ్మమే కనిపించును. .

స్పర్శాన్కృత్వా బహిర్బాహ్యాంశ్చక్షుశ్చైవాన్తరే భ్రువోః ।
ప్రాణాపానౌ సమౌ కృత్వా నాసాభ్యన్తరచారిణౌ ॥

తే.గీ. బాహ్యపు విషయముల నెల్ల బయట నుంచి
నిలిపి చూపును భ్రుకిటిని నిశ్చలముగఁ
బ్రాణము నపానమును రెంటిఁ బరఁగఁ జేసి
సమముగఁ దనదు నస యందు సంచరింప 27.

బయటి విషయముల నెల్ల బయటనే విడిచి భృకుటి పైఁ జూపులు నిశ్చలముగ నిలిపి ప్రాణము నపానములను ముక్కు లోపల సమముగఁ బరఁగఁ జేసి

యతేన్ద్రియమనోబుద్ధిర్మునిర్మోక్షపరాయణః ।
విగతేచ్ఛాభయక్రోధో యః సదా ముక్త ఏవ సః ॥

తే.గీ. మనసు నింద్రియముల బుద్ధి ననువుగ నియ
మించి మోక్షపరాయణుఁ డంచితముగ 28.

వీడి యిచ్చ భయము కిన్క వెలయు నెవఁడు
మునిగ వాఁడ యెల్లప్పుడు ముక్తుఁ డగును

మనస్సును బుద్ధిని నియమించి మోక్షము గోరువాఁడు కోరిక భయము కోపములను
వీడి మునిగ నెవఁడు వర్తించునో యతఁడు ముక్తుఁ డగును.

భోక్తారం యజ్ఞతపసాం సర్వలోకమహేశ్వరమ్ ।
సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాన్తిమృచ్ఛతి ॥

తే.గీ. యజ్ఞము తపములకు భోక్త ననఁగ నెఱిఁగి
సర్వలోకములకు మహేశ్వరునిగ నను
నెఱిఁగి సర్వ భూతములకు నేను సఖుఁడ
నంచు నెఱిఁగి పొందును శాంతి నంచితముగ 29.

యజ్ఞములకుఁ దపములకు నన్ను భోక్తగ నెఱిఁగి సకల లోకములకు నీశ్వరునిగా
నెఱిఁగి సర్వ భూతములకు నన్ను మిత్రునిగ నెఱిఁగిన వాఁడు శాంతినిఁ బడయఁ
గలఁడు.

ఇది శ్రీకృష్ణ సూక్తి సుధాకరమను శ్రీమదాంధ్ర భగవద్గీత యందుఁ గర్మసన్న్యాస యోగమను నైదవ యధ్యాయము.
పోచిరాజు కామేశ్వర రావు నామధేయ ప్రణీతము.

శ్రీకృష్ణాయ నమః

# శ్రీకృష్ణ సూక్తి సుధాకరము

మూలము శ్రీమద్భగవద్గీత

## అధ్యాయ మాఱు – ఆత్మసంయమ యోగము

శ్రీభగవానువాచ ।
అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః ।
స సంన్యాసీ చ యోగీ చ న నిరగ్నిర్న చాక్రియః ॥

శ్రీభగవానుని పలుకులు:

తే.గీ. చేయఁ దగిన పని ఫల మాశింప కుండ
సెవఁడు సేయును వానిని సెంచఁ దగును
యోగి యనఁగ సన్యాసిగ నుచిత రీతి
నక్రియుని నిరగ్నుని యోగి యనఁగఁ దగదు 1.

చేయఁ దగిన పనిని ఫలమును గోరక తగిన రీతి సెవఁడు చేయునో వానిని యోగి మఱియు సన్యాసిగాఁ దలఁప వచ్చును. కర్మములను మానిన నగ్నికార్యములను మానిన వానిని యోగి యన లేము.

యం సంన్యాసమితి ప్రాహుర్యోగం తం విద్ధి పాణ్డవ ।
న హ్యసంన్యస్తసఙ్కల్పో యోగీ భవతి కశ్చన ॥

తే.గీ. యోగ మని తెలియుమ యెయ్య దుక్తమై త
నరును సన్యాస మన దాని స్థిరముగాను
బాండవ విడువకున్న సెవండు నిశ్చ
యముగ సంకల్పమును యోగి యతఁడు కాఁడు 2.

అర్జునా సన్న్యాసమని పిలువఁ బడునదియే యోగ మని తెలిసికొనుము. సంకల్పమును విడువని వాఁడు యోగి కాఁడు.

ఆరురుక్షోర్ముసేర్యోగం కర్మ కారణముచ్యతే ।

యోగారూఢస్య తస్యైవ శమః కారణముచ్యతే ॥

తే.గీ. కర్మ మగుఁ గారణము గాంచ నర్మిలి మఱి
యోగమును గోరు మునులకు యోగ మది య
లవడి నట్టి వారికి శమ మవును గార
ణమ్మ యని నుడువఁ బడును సమ్మతముగ 3.

యోగమును గోరు మునులకు కర్మాచరణమే కారణ మగును మోక్షమునకు.
యోగమును బొందిన వారికి విడుపు కారణ మగును.

యదా హి నేన్ద్రియార్థేషు న కర్మస్వనుషజ్జతే ।
సర్వసఙ్కల్పసంన్యాసీ యోగారూఢస్తదోచ్యతే ॥

తే.గీ. ఎన్నఁ డింద్రియ విషయము లెన్నకయును
గర్మముల నుంచక రతి సంకల్పములను
సన్యసించి సర్వము నుండుఁ జక్కఁగ నపు
డందు రెల్ల రతని యోగ మందె ననుచు 4.

ఇంద్రియ విషయములను గోరక కర్మము లందు నాసక్తి నుంచక సంకల్పములను
విడిచి యున్న నతనిని యోగము నందు నున్న వాఁ డని యందురు.

ఉద్ధరేదాత్మనాత్మానం నాత్మానమవసాదయేత్ ।
ఆత్మైవ హ్యాత్మనో బన్ధురాత్మైవ రిపురాత్మనః ॥

తే.గీ. తన్ను నాత్మచే నింపుగఁ దనరి యింక
నుద్ధరించుకొన వలయు నుద్ధృతిఁ గృశి
యింప నీయఁ దగదు తన కెంచ నాత్మ
యగును జుట్ట మదియ శత్రు వగును జుమ్మి 5.

తమను తామే యుద్ధరించు కొన వలెను. కృశింపఁ జేయ రాదు. ఆత్మయే చుట్టము
శత్రువు నగును.

బన్ధురాత్మాత్మనస్తస్య యేనాత్మైవాత్మనా జితః ।
అనాత్మనస్తుశత్రుత్వే వర్తేతాత్మైవ శత్రువత్ ॥

తే.గీ. ఎవనిచే నాత్మ యాత్మచే నింపుగను జ
యింపఁ బడునొ వానికి నగు నిమ్ముగఁ దన
యాత్మ బంధు వాత్మ యెఱుక నరయ లేని
వాని కదియ విరోధియై పరఁగు నింక 6.

ఎవని యాత్మ యాత్మ చేత జయింపఁ బడునో వాని కాత్మ బంధు వగును. ఆత్మ
జ్ఞానము లేని వానికి నాత్మయే శత్రు వగును.

జితాత్మనః ప్రశాన్తస్య పరమాత్మా సమాహితః ।
శీతోష్ణసుఖదుఃఖేషు తథా మానాపమానయోః ॥

తే.గీ. ఉష్ణ శీతలముల మరియు సుఖ దుఃఖ
ములను గౌర వాగౌరవముల నెవఁడు జ
యించి తన యాత్మ శాంతుఁడై యెలమి నుండు
వాని యందుండుఁ బరమాత్మ భవ్యముగను 7.

ఆత్మను జయించి యుష్ణ శీతలముల సుఖ దుఃఖముల గౌరవాగౌరవములఁ దన
యాత్మ యందు శాంతముగా నుండు నట్టి వాని యందుఁ బరమాత్మ యుండును.

జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా కూటస్థో విజితేన్ద్రియః ।
యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మకాఞ్చనః ॥

తే.గీ. జ్ఞాన విజ్ఞాన సంపత్తిఁ జక్కఁ దనివి
సెంది యవికారుఁడై మఱి జిత నిజేంద్రి
యుండునై యుక్తుఁ డనఁ బడు చుండు మట్టి
రాయి వసువు లా యోగి కరయ సమములు 8.

జ్ఞానము కార్యము లందుఁ దృప్తిఁ జెంది వికారము లేక జితేంద్రియుఁడై యున్న
యుక్తుఁ డనఁ బడును. యోగి మట్టి, ఱాయి, బంగారములను సమానముగాఁ

జూచును.

సుహృన్మిత్రార్యుదాసీనమధ్యస్థద్వేష్యబన్ధుషు ।
సాధుష్వపి చ పాపేషు సమబుద్ధిర్విశిష్యతే ॥

తే.గీ. సుమతు లందు సఖుల యందు సూడుకాఱు
లం దుదాసీన మధ్యస్థు లందు ద్వేషు
లందు బంధువు లందును నమిత పాప
పు మనుజులు సాదువుల యందు సముఁడు మేటి 9.

సుమతు లందు, మిత్రులందు, శత్రువు లందు, నుదాసీను లందుఁ, దటస్థు లందు, ద్వేషు లందు, బంధువు లందుఁ, బాపు లందును సాదువు లందు సమానముగా నున్న వాఁడు శ్రేష్ఠుఁడు.

యోగీ యుఞ్జీత సతతమాత్మానం రహసి స్థితః ।
ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీరపరిగ్రహః ॥

తే.గీ. మఱుగు పాటున నొక్కండ మసలు చుండి
నియతి నుంచి నిజాత్మ నింద్రియములఁ దమి
వీడి యితరుల నేదియు వేఁడక సత
తమ్ము మనవలె యోగి ధ్యానమ్మునందు 10.

యోగి నిత్యము నేకాంతముగా నుండి యాత్మను నియంత్రించి, యింద్రియముల యందాస వీడి, యితరుల నేదియుఁ గోరక ధ్యానమున నుండ వలెను.

శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసనమాత్మనః ।
నాత్యుచ్ఛ్రితం నాతినీచం చైలాజినకుశోత్తరమ్ ॥

తే.గీ. కరము పల్లము నెత్తును గాని స్థలము
నందుఁ దా శుచిగ వసన మజినము మఱి
దర్భ లుత్తర క్రమముగఁ దనరఁ బఱచి
పీఠ మేర్పరుచుకొని సంప్రీతి నంత 11.

ఎత్తును బల్లము కాని ప్రదేశమున శుచియై, దర్భలు, జింకచర్మము, బట్ట నొక దాని పై నొకటి పఱచి సుఖాసీనుఁడై ప్రీతితో

తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేన్ద్రియక్రియః ।
ఉపవిశ్యాసనే యుఞ్జ్యాద్యోగమాత్మవిశుద్ధయే ॥

తే.గీ. నియమితపు మనోవ్యాపార నిపుణుఁ డౌచు
మనము నొక్కటఁ జేర్చి సమ్మదముగఁ దన
యాత్మ నల శుద్ధి చేయఁగ నాసనమున
స్థితుఁడునై యోగ మిఁక నభ్యసింప వలెను 12.

మనస్సు నింద్రియపుఁ బనులను నియంత్రించి, యేకాగ్రత గూడిన మనస్సుతో మనస్సును శుద్ధి చేయుటకు నాసనమునఁ గూర్చుండి యోగాభ్యాసము చేయ వలెను.

సమం కాయశిరోగ్రీవం ధారయన్నచలం స్థిరః ।
సమ్ప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశశ్చానవలోకయన్ ॥

తే.గీ. సమముగఁ దనువు శిరము కంఠముల నునిచి
యచలుఁడై స్థిరముగ నుండి యరయక దిశ
లు నిజ నాసికాగ్రమునఁ జలుపుచుఁ దనదు
దృష్టి నెల్లయుఁ జక్కటి తీరు తనర 13.

శరీరము, కంఠము, శిరము సమముగ నుంచి చలింపక స్థిరముగ నుండి, దిక్కులను జూడక, తన ముక్కు పైఁ జూపు నుంచి

ప్రశాన్తాత్మా విగతభీర్బ్రహ్మచారివ్రతే స్థితః ।
మనః సంయమ్య మచ్చిత్తోయుక్త ఆసీత మత్పరః ॥

తే.గీ. తనరి శాంత చిత్తమున వదలి భయమును
బ్రహ్మ చర్య మూని మనసుఁ బన్నుగ మఱి 14.

నిగ్రహించి మత్పరుఁడై యనిశము నుండ
వలయుఁ జిత్తము నాయంద కలుగఁ జేసి

శాంతము వహించి, భయమును వీడి, బ్రహ్మచర్యమున మనస్సును నిగ్రహించి, నాయందుఁ జిత్తముంచి నన్ను దలఁచుచు నిత్యము మెలఁగ వలెను.

యుఞ్జన్నేవం సదాత్మానం యోగీ నియతమానసః ।
శాన్తిం నిర్వాణపరమాం మత్సంస్థామధిగచ్ఛతి ॥

తే.గీ. యోగి యీరీతి నిత్యము యోగ మందు
నిల్పి తన్ను దనరి మనో నిగ్రహమున
నా యునికి నున్న శాంతిని నయముగఁ బర
మంపు మోక్షమును బడయుఁ బెంపు మీఱి 15.

యోగి యీ విధముగా యోగ మందు నిల్చి మనస్సు నిగ్రహించి నా లోనున్న శాంతిని మోక్షమును బొందఁ గలడు.

నాత్యశ్నతస్తుయోగోఽస్తి న చైకాన్తమనశ్నతః ।
న చాతిస్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున ॥

తే.గీ. అతిగ భుజియించు వానికి మిత మధికమ
యి మఱి తిననట్టి వానికి నెల్ల వేళ
లందు నిద్రించు వానికి నెందు నిద్ర
వోని వాని కర్జున యోగ మూన రాదు 16.

ఎక్కువగా భుజించు వానికిఁ, దినని వానికి మిక్కిలి నిద్ర వోవు వానికి, నిద్ర వోని వానికి యోగ మలవడదు.

యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు ।
యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా ॥

తే.గీ. ఓదనమ్మున విహరింప యుక్త రీతి 17.

నుండఁ జేయుచుఁ బనులను యుక్త సరణి
నుండ నిదుర మెలఁకువల యుక్తముగను
దుఃఖమును బాపు యోగము తోరముగను

తగిన రీతిని భోజనము చేయుచు నుండఁ, బనులు దగిన రీతిఁ జేయుచుండఁ, దగి
నంత నిద్ర మెలకువల నుండ యోగము దుఃఖములను బో గొట్టును.

యదా వినియతం చిత్తమాత్మన్యేవావతిష్ఠతే ।
నిఃస్పృహః సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా ॥

ఁ

తే.గీ. నిగ్రహింపఁ బడిన మది నిలుచు నెన్నఁ
డు తన యాత్మ లోపల నప్పుడు సకలమ్ము
లైన కోరికలం దించుకైన నాస
పడని వాఁడ యుక్తుం డనఁ బడుచు నుండు 18.

చిత్తమును నిగ్రహించి యాత్మ యందే నిల్పిన వాఁడు సకలమ్ము లైన కోరికలను
దృజించిన వాఁడు యుక్తుఁ డనఁ బడును.

యథా దీపో నివాతస్థో నేఙ్గతే సోపమా స్మృతా ।
యోగినో యతచిత్తస్య యుఞ్జతో యోగమాత్మనః ॥

తే.గీ. ఆత్మయోగ సాధన చేయు నట్టి యోగి
నియమితంపు చిత్తము వోలు నయముగ నని
లమ్ము వీవని చోటున నిమ్ముగ వెలు
గు దివియ నని చెప్పంబడుఁ బదిలముగను 19.

గాలి వీవని చోట దీపము కదలక యెట్లు వెలుఁగునో యట్లు నాత్మ యోగ సాధన
చేయు యోగి చిత్తము కదలక స్థిరముగా నుండును.

యత్రోప రమతే చిత్తం నిరుద్ధం యోగ సేవయా ।
యత్ర చైవాత్మ నాత్మానం పశ్య న్నాత్మని తుష్యతి ॥

తే.గీ. యోగ సేవచే లోఁబడి యున్న మనము
శాంతిఁ బొందు నెచ్చట మఱి సంతసించు
నెట్టి స్థితి నాత్మ లోపల నెలమి యాత్మ
నాత్మ చేత నిరంతర మరయు చుండి 20.

ఆత్మ నాత్మచేత చూచుచు నే స్థితి లో నాత్మలో సంతసించు చుండునో యోగ సేవ లో యున్న మనము శాంతి నెచ్చట బొందునో

సుఖమాత్యన్తికం యత్తద్ బుద్ధిగ్రాహ్యమతీన్ద్రియమ్ ।
వేత్తి యత్ర న చైవాయం స్థితశ్చలతి తత్త్వతః ॥

తే.గీ. ఇంద్రియముల కతీతము నింక బుద్ధి
మాత్రము గ్రహించు నే స్థితిం బరఁగి పరమ
సుఖము నట్టి స్థితిని నుండి సుంతయును జ
లింపఁ డెపుడు తత్త్వము నుండి యింపుగ యతి 21.

ఇంద్రియముల కతీతము బుద్ధి మాత్రము గ్రహించు నట్టి పరమ సుఖము నే స్థితిలో గ్రహించునో యా స్థితి యందుండి యోగి తత్త్వము నుండి చలింపఁడు.

యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః ।
యస్మిన్స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే ॥

తే.గీ. దేనిఁ బొంది యితరము లధికముగ మదిఁ
దల్పఁ డెట్టి లాభములను దాని కన్న
నెందు నిల్చి గొప్ప వయిన యెట్టి దుఃఖ
ములకును జలింపఁడొ హృదయమున లవమ్ము 22.

దేనినిఁ బొందిన నెట్టి యధికమైన లాభమును గొప్ప యని మదిఁ దలఁపఁడో యే స్థితి నుండి పెద్ద దుఃఖములకును జలింపఁడో

తం విద్యాద్ దుఃఖసంయోగవియోగం యోగసంజ్ఞితమ్ ।
స నిశ్చయేన యోక్తవ్యో యోగోఽనిర్విణ్ణచేతసా ॥

తే.గీ. ఎఱుఁగ వలె దాని నింపుగఁ దఱుగు నంచు
దుఃఖ బంధము లెల్లను దొంగలింప
యోగ నామమున గఱవ నొప్పు దాని
విసు గెఱుంగని ధ్రువపు మనసున ధృతిని 23.

దానిని (భగవత్సాక్షాత్కార రూప స్థితి) దుఃఖముల నెల్ల ఖండించునది యని యోగ మను పేరున నతిశయించు దానిని నెఱుఁగ వలెను. దృఢ చిత్తముతో విసుగుఁ జెందక దానిని నేర్వ వలెను.

సఙ్కల్పప్రభవాన్కామాంస్త్యక్త్వా సర్వానశేషతః ।
మనసైవేన్ద్రియగ్రామం వినియమ్య సమన్తతః ॥

తే.గీ. తనదు సంకల్పము వలనఁ దనరి నట్టి
యన్ని కోరికల నశేష మడరి విడిచి
మనసు చేతను నియమించి యనిశ మింద్రి
య చయముల నంతటను ధృతి నుచిత రీతి 24.

తన సంకల్పమునఁ బుట్టిన కోరికల నన్నింటి నశేషము విడిచి, యింద్రియములను మనస్సు చేత నన్ని విషయముల ధైర్యము తో నియమించి

శనైః శనై రుపరమే ద్బుద్ధ్యా ధృతి గృహీతయా ।
ఆత్మసంస్థం మనః కృత్వా న కిఞ్చిదపి చిన్తయేత్ ॥

తే.గీ. ధైర్య మూనిన బుద్ధి చేత నెలమి మన
సును నిజాత్మ యందున నిల్పి సురుచిరముగ
మెల్ల మెల్లన మఱి విరమింప వలయు
నింపు గాను నన్యములు యోచింప రాదు 25.

ధైర్యము నూని బుద్ధి చేతఁ దన మనస్సును దన యాత్మ యందు నిలిపి మెల్ల మెల్లన బాహ్య విషయములను విరమింప వలెను. ఇతరము లైన వేమియు నాలోచింప రాదు.

యతో యతో నిశ్చరతి మనశ్చఞ్చలమస్థిరమ్ ।
తతస్తతో నియమ్యైతదాత్మన్యేవ వశం నయేత్ ॥

తే.గీ. అస్థిరమ్మును జంచల మైన చిత్త
మెక్క డెక్కడ చరియించు నక్క డక్క
డింపుగ మరలించి మదిని నింక నాత్మ
యంద యుంచ వలయు వశ మందు నెమ్మి 26.

అస్థిరము చంచలము నైన మన స్సెక్క డెక్కడ సంచరించునో యక్క డక్కడ నుండి
మఱలించి దానిని నాత్మ యందే సుస్థిరముగ వశమున నుంచుకొని యుంచ వలెను.

ప్రశాన్తమనసం హ్యేనం యోగినం సుఖముత్తమమ్ ।
ఉపైతి శాన్తరజసం బ్రహ్మభూతమకల్మషమ్ ॥

తే.గీ. అమిత శాంత చిత్తము గల యట్టి వాని
రాజస మ్మణగిన వాని నోజఁ గల్మ
షము లుడిగిన వానిని యోగిని మఱి బ్రహ్మ
భూతు నుత్తమంపు సుఖమ్ము మూరి చేరు 27.

శాంత మున్న వానిని, రాజస గుణ మణగిన వానిని, కల్మషములు లేని వానిని,
యోగిని, బ్రహ్మ సమానుని నుత్తమ మైన సుఖము చేరి యుండును.

యుఞ్జన్నేవం సదాత్మానం యోగీ విగతకల్మషః ।
సుఖేన బ్రహ్మసంస్పర్శమత్యన్తం సుఖమశ్నుతే ॥

తే.గీ. ఇట్లు సంతత మాత్మయం దెలమి నిల్పి
తనను యోగి విగత దురిత హృదయుండు
సులభముగ నొందు నత్యంత సుఖము బ్రహ్మ
సంగమంపు టానంద మభంగముగను 28.

ఇట్లు నిత్యము యోగి యాత్మ యందు తనను నిల్పికొని పాపములను బోగొట్టుకున్న

వాఁడు బ్రహ్మ సంగమపు టానందమును పొందును.

సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని ।
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః ॥

తే.గీ. అంతట సమబుద్ధి కలిగి నట్టి యోగ
యుక్తుఁ డరయు నిత్యమ్ము దా నున్న యట్లు
సర్వ భూతము లందున సర్వ భూత
ములును దన యందు నున్నట్లు చెలువముగను 29.

అంతట సమబుద్ధి కలిగిన యోగి తా నన్ని భూతము లందు నున్నట్లు నన్ని భూతములు తనలోన నున్నట్లు చూచును.

యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి ।
తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి ॥

తే.గీ. ఎవ్వఁ డీక్షించు నన్నిట నెలమి నన్ను
జూచు నన్నిటి నాయంద సుందరముగ
నట్టి వాని కెన్నండు కా నరయ మఱుగు
నాకు వాఁడు నుండండు కనఁబడకయును 30.

ఎవ్వఁడు నన్ను నన్నిటి యందుఁ జూచి యన్నిటిని నా యందుఁ జూచునో వానికి నేను చాటు కాను. నాకును వాఁడు కనిపింప కుండ నుండఁడు.

సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః ।
సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే ॥

తే.గీ. అన్ని భూతము లందున్న నన్ను నెవ్వఁ
డొక్క భావ మంది భజించు మిక్కుటముగ
నట్టి యోగి వర్తింపఁగ నన్ని గతుల
నుండు నాయంద వర్తించు చుండి నెమ్మి 31.

ఎవ్వఁడు సకల భూతము లందు నున్న నన్ను సేవించు నొక్క భావమును గూడి
యెక్కువగ నట్టి యోగి యెన్ని విధముల ప్రవర్తించినను నా యందే వర్తించును.

ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున ।
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః

తే.గీ. జూచి యన్యులఁ దన వలె సుఖమును మఱి
దుఃఖమును నైన సమముగఁ దుష్టుఁ డౌచుఁ
గాంచు నట్టి యోగి వరుని నెంచ వలయు
నర్జునా పరమశ్రేష్టుఁ డంచు మదిని 32.

ఇతరులను దన వలెనే జూచుచు సుఖ దుఃఖములందు సమముగా సంతోషమున
నుండు యోగిని నర్జున మిక్కిలి శ్రేష్ఠునిగాఁ దెలియ వలెను.

అర్జున ఉవాచ ।
యోఽయం యోగస్త్వయా ప్రోక్తః సామ్యేన మధుసూదన ।
ఏతస్యాహం న పశ్యామి చఞ్చలత్వాత్స్థితిం స్థిరామ్

అర్జునుని పలుకులు:

తే.గీ. చంచలస్వభావమ్మున సామ్య భావ
ము గల నీ నుడివిన యోగము నరయంగ
నైతి మధుసూదన మనమ్ము నందు సుంత
యెన్నఁడు చలింపని స్థితిని నున్న దాని 33.

మధుసూదనా సామ్యభావము కల యీ నిశ్చల మైన యోగమును కొంచె మైనను
జంచల స్వభావము వలనఁ దెలియ కున్నాను.

చఞ్చలం హి మనః కృష్ణ ప్రమాథి బలవద్ దృఢమ్ ।
తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్ ॥

తే.గీ. మన సది యతి చంచలము సంభ్రమముఁ గూర్చు
బలము నందు మిన్న దృఢమై పరఁగుఁ గృష్ణ 34.

గాన దాని నిగ్రహము దుష్కర మగు నని
మారుతమ్ము వోలెఁ దలంతు మనము నందు

కృష్ణా మన స్సతి చంచలము. మోహమును గూర్చును. బలమున చాల గట్టిది.
వాయువు వలె దానిని నిగ్రహించుట కష్ట మని యెంచుదును.

శ్రీభగవానువాచ ।
అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలమ్ ।
అభ్యాసేన తు కౌన్తేయ వైరాగ్యేణ చ గృహ్యతే ॥

శ్రీభగవానుని పలుకులు:

తే.గీ. చంచలము నిశ్చయమ్ముగ సందియమ్ము
లే దట మహాభుజ మనసు రాదు నిగ్ర
హింప నింపుగఁ గౌంతేయ యేరి కేని
శిక్ష వలన మఱి విరక్తిఁ జేయ నగును 35.

అర్జునా నిశ్చయముగ నది చంచలమే. ఎవ్వరి కైనను నిగ్రహింప కష్టము.
వైరాగ్యమున మఱియు నభ్యాసము వలన సాధ్య మగును.

అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః ।
వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తుముపాయతః ॥

తే.గీ. మనము నిగ్రహింపని వానికి నగు కష్ట
తరము సాధింప యోగము తలఁతు నిట్లు
నేను వశ మందు నుండిన మానసమ్ము
యత్నమున నుపాయమ్మున నందఁ గలఁడు 36.

మనస్సును నిగ్రహింపని వానికి యోగమును సాధింపఁ గష్ట మనియే తలఁతును.
కాని మనస్సు వశ మందున్న వానికి ప్రయత్నమున నుపాయముననను సాధ్యమే.

అర్జున ఉవాచ ।
అయతిః శ్రద్ధయోపేతో యోగాచ్చలితమానసః ।

అప్రాప్య యోగసంసిద్ధిం కాం గతిం కృష్ణ గచ్ఛతి ॥

అర్జునుని పలుకులు:

తే.గీ. శ్రద్ధ కలిగియు యత్నము సలుప కుండ
యోగమున నుండి చలియింప వేగ మనము
పొందకుండ సిద్ధిని కృష్ణ పొందు నెట్టి
గతిని వాడింకఁ జెప్పుమ కరుణ తోడ 37.

కృష్ణా శ్రద్ధను గలిగి యుండియు యత్న లోపమున సిద్ధినిఁ బొంద కుండ యోగము నుండి భ్రష్టుఁ డయిన వాని కెట్టి గతి కల్గునో దయతోఁ జెప్పుమ.

కచ్చిన్నోభయవిభ్రష్టశ్ఛిన్నాభ్రమివ నశ్యతి ।
అప్రతిష్ఠో మహాబాహో విమూఢో బ్రహ్మణః పథి ॥

తే.గీ. బ్రహ్మపథ మందు మూఢుఁడు బడలి సడల
రెంటికినిఁ జెడి వడి చెదరిన పయోధ
రమ్ము పగిది నశింప నేరఁడు కద గతి
లేక కృష్ణ మహాభుజ యీ కతమున 38.

కృష్ణా యలసి బ్రహ్మ పథము నుండి సడలిన వాఁడు చెదరిన మేఘము వలె రెంటికిఁ జెడఁడు కదా.

ఏతన్మే సంశయం కృష్ణ ఛేత్తుమర్హస్యశేషతః ।
త్వదన్యః సంశయస్యాస్య ఛేత్తా న హ్యుపపద్యతే ॥

తే.గీ. నా మతిఁ జెలంగి నట్టి ఘన మగు సంశ
యమ్మశేషము తీర్పఁగ నర్హుఁడ వీఁక
నీవ కృష్ణ యరయ నన్యుని నిను గాక
సంశయము తీర్చు వాని నిశ్శంక నేను 39.

నా మతి లోఁ జెలరేఁగిన యీ యనుమానమును సమూలముగాఁ దీర్ప నీవ సమర్థుఁడవు కృష్ణా. దీనిని తీర్పఁ గల నితరుని నెవ్వనిఁ గాంచ లేను.

శ్రీభగవానువాచ ।
పార్థ నైవేహ నాముత్ర వినాశస్తస్య విద్యతే ।
న హి కల్యాణకృత్కశ్చిద్ దుర్గతిం తాత గచ్ఛతి ॥

శ్రీభగవానుని పలుకులు:

తే.గీ. ఆతని కిహమునఁ బరము నందునను వి
నాశ ముండదు పార్థ పుణ్యంపుఁ జరితుఁ
డెవ్వఁడు చనఁడు దుర్గతి కెవ్విధమున
నైన విను మయ్య యిది సత్య మంచు నెమ్మి 40.

అర్జునా యట్టి పుణ్యాత్మునకు నిహమున నైనను బరమున నైన వినాశ ముండదు.
వాడు నిక్కముగ దుర్గతికి జనఁడు.

ప్రాప్య పుణ్యకృతాం లోకానుషిత్వా శాశ్వతీః సమాః ।
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే ॥

తే.గీ. పుణ్య కర్ము లేఁగెడు లోకము లరిగి యట
నుండి పెక్కు వత్సరములు యోగ పతితుఁ
డంత శుచులు శ్రీమంతుల యవసథముల
యందు నుద్భవిల్లును లేదు సందియమ్ము 41.

పుణ్యకర్ము లేఁగు లోకములకు నతఁ డరిగి యోగ పతితుఁడు పెక్కేం డ్లుండి, పిదప
శుద్ధులు శ్రీమంతులు నైన వారి గృహము లందు జన్మించును.

అథవా యోగినామేవ కులే భవతి ధీమతామ్ ।
ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశమ్ ॥

తే.గీ. లేని యెడల యోగి వరుల జ్ఞానవంతు
ల కుల మందునఁ బుట్టఁ గలం డతండు
దుర్ల భమరయ లోక మందుఁ గలుగంగ
నివ్విధంబైన పుట్టుక నివ్వటిల్లి 42.

లేని యెడల (పుణ్యలోకముల కేఁగకయే) యోగీశ్వరుల గృహము లందుఁ బుట్టును. ఇట్టి పుట్టుక చాల దుర్లభము.

తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదేహికమ్ ।
యతతే చ తతో భూయః సంసిద్ధౌ కురునన్దన ॥

తే.గీ. అచట జన్మింపఁగ గ్రహించు నతఁడు పూర్వ
జన్మ బుద్ధి సంయోగము చక్క గాను
దిరిగి యత్నించు సంసిద్ధి నరయఁ గురు కు
ల తనయ యధికమ్ముగ మఱల మఱల ధృతి 43.

కురుకుల నందనా యర్జునా యక్కడ వానికిఁ బూర్వ జన్మ బుద్ధి సంయోగము కలిగి తిరిగి సంసిద్ధి కొఱకు మఱల మఱల యత్నించును.

పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి సః ।
జిజ్ఞాసురపి యోగస్య శబ్దబ్రహ్మాతివర్తతే ॥

తే.గీ. తొల్లిఁటి పరిశ్రమమ్మునఁ దోరముగ న
వశుఁ డయినను ముక్తికి లాగఁ బడు నతండు
యోగ మెఱుఁగఁ దలఁచు వాఁడు నుచిత రీతి
దాఁటు నింక శబ్దబ్రహ్మ మాట వలెను 44.

మునుపటి ప్రయత్నమున నతఁడు ముక్తి వైపునకు పరాధీనుఁ డైన నాకర్షింపఁ బడును. యోగమును గోరువాఁడు వేదములలోఁ దెలుపఁ బడిన కర్మములను (సకామములను) దాఁటఁ గలఁడు.

ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః ।
అనేకజన్మసంసిద్ధస్తతో యాతి పరాం గతిమ్ ॥

తే.గీ. తివిరి యత్నించు యోగి పుంగవుఁడు దురిత
దూరుఁడు బహు జన్మల లోన మూరి పొంది 45.

నట్టి సంస్కారముల సిద్ధి నరసి చనును
బరమ గతికి సుఖమ్ముగఁ గరము ప్రీతి

కుతూహలమునఁ బ్రయత్నించి బహు జన్మలలోఁ బడసిన సంస్కారముల సిద్ధినిఁ బొంది పాపముల నుండి విముక్తుఁ డయి పరమమైన గతికి బోవును.

తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః ।
కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున ॥

తే.గీ. యోగి యధికుం డగును దాప సోత్తములకు
మిన్న యనఁబడు జ్ఞానుల కన్న నెంచఁ
గర్మచయమునఁ జనువారి కన్న గొప్ప
కాన నర్జున యోగివి కమ్ము నీవు 46.

అర్జునా యోగి తాపసుల కన్న మిన్న. జ్ఞానుల కన్నను, కర్మము లొనరించు వారి కన్నను గొప్ప. కనుక నీవు యోగివి కమ్ము.

యోగినామపి సర్వేషాం మద్గతేనాన్తరాత్మనా ।
శ్రద్ధావాన్భజతే యో మాం స మే యుక్తతమో మతః ॥

తే.గీ. సకల యోగు లందును మానసమ్ము నందు
నన్ను నిల్పి భక్తిని శ్రద్ధ యున్న వాఁడు
దల్పఁ బడును నా చేత యుక్తతముఁ డంచు
నెమ్మి భజియింప సతతమ్ము నిష్ఠ తోడ 47.

మనస్సులో నన్ను నిల్పి భక్తి శ్రద్ధలతో నిత్యము సేవించు వాఁడు యోగు లందటి కన్న నుత్తముఁ డని నా యభిప్రాయము.

ఇది శ్రీకృష్ణ సూక్తి సుధాకరమను శ్రీమదాంధ్ర భగవద్గీత యందు నాత్మసంయమ యోగమను నాఱవ యధ్యాయము.

పోచిరాజు కామేశ్వర రావు నామధేయ ప్రణీతము.

శ్రీకృష్ణాయ నమః

# శ్రీకృష్ణ సూక్తి సుధాకరము

మూలము శ్రీమద్భగవద్గీత

## అధ్యాయ మాఱునొకటి – జ్ఞాన విజ్ఞాన యోగము

శ్రీభగవానువాచ ।
మయ్యాసక్తమనాః పార్థ యోగం యుఞ్జన్మదాశ్రయః ।
అసంశయం సమగ్రం మాం యథా జ్ఞాస్యసి తచ్ఛృణు ॥

శ్రీభగవానుని పలుకులు:

తే.గీ. యోగ మందుండి నా పయి నుంచి చిత్త
మందు నాసక్తి నన్నిట నాశ్రయించి
యణఁగ మన మందు నీ సంశయమ్ము వినుము
నన్ను నెఱుఁగు విధమ్ము పూర్ణముగఁ బార్థ 1.

యోగ మాచరించుచుఁ జిత్తములో నాయందు నాసక్తి నుంచి నన్నాశ్రయించి యసంశయముగ నర్జున నన్ను సంపూర్ణముగ నెఱుఁగు విధమును జెప్పద వినుము.

జ్ఞానం తేఽహం సవిజ్ఞానమిదం వక్ష్యామ్యశేషతః ।
యజ్జ్ఞాత్వా నేహ భూయోఽన్యజ్జ్ఞాతవ్యమవశిష్యతే ॥

తే.గీ. దేని నెఱిఁగిన నన్యము తిరిగి తెలిసి
కొనఁ దగిన దేది జగతి మిగులదొ యట్టి
జ్ఞానమును సవిజ్ఞానము నేన నీకుఁ
దెల్పు వాఁడ నశేషము తెల్లముగను 2.

దేని నెఱిఁగినఁ దిరిగి మఱి తెలుసుకొన వలసిన దేదియు నుండదో యా తత్త్వ జ్ఞానమును విజ్ఞాముతో సహా పూర్తిగాఁ దెలిపెదను.

మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే ।
యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః ॥

తే.గీ. మనుజు లందు వేయికి నొక్కఁ డనవరతము
యత్న మొనరించు సిద్ధిని నందుటకును
సిద్ధు లందుఁ గూడ నొకండు బుద్ధి నరయ
గలఁడు తివిరి యథార్థముగ నిఁక నన్ను 3.

మనుష్యులలో వెయ్యికి నొక్కఁడు సిద్ధినిఁ బొందుటకు యత్నించును. సిద్ధు లందుఁ
గూడ నే యొకండొ నన్ను యథార్థముగ నెఱుఁగఁ గలఁడు.

భూమిరాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధిరేవ చ ।
అహఙ్కార ఇతీయం మే భిన్నా ప్రకృతిరష్టధా ॥

తే.గీ. భూమి జల మగ్ని వాయువు భువనము మన
ము మఱి బుద్ధి యహంకారము నన నివ్వి
ధిఁ దనరుచు నుండు నా ప్రకృతి యెనిమిది వి
భిన్న విధముల నర్జున చెన్ను మీఱ 4.

భూమి, నీరు, నగ్ని, వాయువు, నాకాశము, మనస్సు మఱియు బుద్ధియు
నహంకారము లన నెనిమిది విభిన్న విధముల నా యీ ప్రకృతి యలరు చుండును.

అపరేయమితస్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్ ।
జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతే జగత్ ॥

తే.గీ. ఈ ప్రకృతి యధమము సుమ్మీ యింక దీని
కంటె నుత్కృష్ట మైనది కల దెఱుంగు
నాదు ప్రకృతి మహాబాహు వేది జగతి
ని ధరియించును గతి జీవ నిచయమునకు 5.

అర్జునా యీ ప్రకృతి కన్నను శ్రేష్ఠ మైన మఱి యొకటి యైన నా ప్రకృతియు గలదు.
ఆ ప్రకృతి యీ జగత్తును ధరియించుచు జీవుల గతియై యుండును.

ఏతద్యోనీని భూతాని సర్వాణీత్యుపధారయ ।
అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రలయస్తథా ॥

తే.గీ. ప్రాణు లన్నియుఁ బుట్టు నీ ప్రకృతుల వల
న ననుచు నెఱుంగు మయ్య నేన సకలంపు
జగతి భవమునకును దగు సమయమందు
క్షయమునకును నిశ్చయముగఁ గారకుఁడను 6.

ఈ ప్రకృతుల నుండియే ప్రాణు లన్నియుఁ బుట్టును. విశ్వ సృష్టికి క్షయమునకును
నీనే కారకుఁడ నని యెఱుంగుము.

మత్తః పరతరం నాన్యత్కిఞ్చిదస్తి ధనఞ్జయ ।
మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ ॥

తే.గీ. శ్రేష్ఠ మైనది నా కంటె లేదు లేశ
మైన నితరమ్ము దారమ్ము నందు మణుల
నుంచి నట్లు ధనంజయ నంచితముగ
నీ జగతి యెల్ల నాయంద యెలమి నుండు 7.

నా కంటె మిన్న యైన దేదియు నణుపైన లేదు. దారములో మణులను గూర్చి నట్లు
ధనంజయ యీ జగతి యంతయు నా యందే కూర్పఁ బడినది.

రసోఽహమప్సు కౌన్తేయ ప్రభాస్మి శశిసూర్యయోః ।
ప్రణవః సర్వవేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు ॥

తే.గీ. జలము నందు రసము సూర్య చంద్రులందుఁ
గాంతి సకల వేదముల నోంకార మగుదు
నేను గౌంతేయ యిమ్ముగ నింగి నందు
శబ్దము నరు లందునఁ బౌరుషమ్ము నౌదు 8.

అర్జునా నేను జలము లోని ద్రవమును, సూర్య చంద్రుల యందుఁ గాంతిని,
వేదములందు నోంకారమును, నింగిని శబ్దమును, నరు లందుఁ బౌరుషమును.

పుణ్యో గన్ధః పృథివ్యాం చ తేజశ్చాస్మి విభావసౌ ।
జీవనం సర్వభూతేషు తపశ్చాస్మి తపస్విషు ॥

తే.గీ. పుడమి నందుఁ బున్నెపు గంధము నగు దింక
నిప్పు నందునఁ దేజమై నెగడి యుందు
సర్వ భూతము లందున సంచరించు
ప్రాణ మేను దాపసులఁ దపస్సు నౌదు 9.

నేలలో గంధమును, నిప్పులోఁ దేజమును, సకల భూతము లందుఁ బ్రాణమును,
దాపసు లందుఁ దపస్సు నౌదును.

బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ సనాతనమ్ ।
బుద్ధిర్బుద్ధిమతామస్మి తేజస్తేజస్వినామహమ్ ॥

తే.గీ. మూల మేను సకల భూతములకు నంచు
నెఱుఁగుమ సనాతనుఁడ నన్ను నెలమిఁ బార్థ
బుద్ధిమంతు లందున్నట్టి బుద్ధి నేను
ధీరవరు లందు నున్నట్టి తేజ మేను 10.

భరత శ్రేష్ఠ నన్ను సనాతనుఁడను సకల భూతములకు మూల మని యెఱుఁగుము.
నేను బుద్ధిమంతు లందున్న బుద్ధిని, ధీరు లందున్న పరాక్రమమును.

బలం బలవతాం చాహం కామరాగవివర్జితమ్ ।
ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ ॥

తే.గీ. బలము గల వారి యందున వెలయు తగుల
మిచ్చ లేని బలము నేన యిలను బ్రాణు
లందు నున్న యట్టి యధర్మ మనని కోర్కి
నే నగుదు భరతర్షభ నిశ్చయముగ 11.

బలశాలు రందున్న యాస, రక్తి లేని యట్టి బలమును, బ్రాణులం దున్న ధర్మయుత

మైన కోర్కిని.

యే చైవ సాత్త్వికా భావా రాజసాస్తామసాశ్చ యే ।
మత్త ఏవేతి తాన్విద్ధి న త్వహం తేషు తే మయి ॥

తే.గీ. స్సాత్త్వికము రాజసము తామసంపు భావ
ములు కలుగు నా వలన నని తెలిసి కొనుమ
యయిన యవి యుండ వెపుడు నా యందు నేను
నుండ వాని యందెన్నఁడు నూహ నైన 12.

నా వలననే సాత్త్వికము, రాజసము మఱియుఁ దామస మను మూడు గుణములు
కల్గె నని యెఱుఁగుము. కాని యవి నాయందు నుండవు. మఱియు నేను వాని
యందు నుండను.

త్రిభిర్గుణమయైర్భావైరేభిః సర్వమిదం జగత్ ।
మోహితం నాభిజానాతి మామేభ్యః పరమవ్యయమ్ ॥

తే.గీ. జగతి మోహ మందున్నది సర్వ మీ గు
ణముల భావముల వలన నన్ను బరుని
నీ గుణమ్ముల కవ్యయు నెఱుఁగ కున్న
దింక మోహ పరవశత్వ మేర్పడఁగను 13.

ఈ జగ మంతయు నీ మూడు గుణముల ప్రభావమున మోహము చెందు చున్నది.
ఈ గుణముల కతీతుఁడ నవ్యయుఁడను నన్ను మోహ పరవశత్వమున నీ జగ
త్తెఱుఁగ కున్నది.

దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా ।
మామేవ యే ప్రపద్యన్తే మాయామేతాం తరన్తి తే ॥

తే.గీ. దైవతమ్మును ద్రిగుణ యుతంపు నాదు
మాయ దాఁట శక్యము కాదు మనుజులకును
నన్ను శర ణందు రెవ్వరు పన్నుగ నిఁక 14.

వార యీ మాయఁ దరియించు వారు పార్థ

మనుష్యుల కెవ్వరికిఁ ద్రిగుణాత్మక మైన నా మాయను దాఁట శక్యము కాదు. భక్తితో
నెవ్వరు నన్ను శరణు వేఁడుదురో వారు నా మాయను దరింతురు.

న మాం దుష్కృతినో మూఢాః ప్రపద్యన్తే నరాధమాః ।
మాయయాపహృతజ్ఞానా ఆసురం భావమాశ్రితాః ॥

తే.గీ. మాయఁ జిక్కిన జ్ఞానులు మనుజులం ద
ధములు దుష్టులు మూఢులు దనుజ భావ
మంది నట్టి వా రెల్లరుఁ బొంద నొల్ల
రెన్నఁడును నాదు శరణమ్ము నించు కైన 15.

మాయచే నపహరింపబడిన జ్ఞానము కలవారు దుష్టులు, మూఢులు రాక్షస భావము
నొంది నన్ను శరణు వొంద నొల్లరు.

చతుర్విధా భజన్తే మాం జనాః సుకృతినోఽర్జున ।
ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ ॥

తే.గీ. నాల్గు విధముల సుకృతులు నన్ భజింతు
రర్జున తెలియఁ గోరు వా రార్తు లర్థ
కాము లింక జ్ఞానులును బ్రాకటముగ మను
జోత్తములు భరతర్షభ యుచిత రీతి 16.

అర్జున నాల్గు విధము లైన జనులు నన్ను భజింతురు. నన్ను దెలియఁ గోరు వారు,
భాధ లందుఁ జిక్కిన వారు, విత్తమును గోరు వారు మఱియు జ్ఞానులు. వీరు
సుకృతులు.

తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తిర్విశిష్యతే ।
ప్రియో హి జ్ఞానినోఽత్యర్థమహం స చ మమ ప్రియః ॥

తే.గీ. వారి యందు సతత యోగి పరముఁ డగును 17.

జ్ఞాని యేకాంత భక్తుఁడు జ్ఞాని కెపుడు
నే నతిప్రియుండ నగుదుఁ దాను గరముఁ
బ్రియుఁడు నగు నాకు నరయంగ వింత కాదు

వారిలో జ్ఞాని నిత్యము యోగ మందున్న వాఁడు, యేకాంతముగా స్మరించు భక్తుఁడు శ్రేష్ఠుఁడు. ఆ జ్ఞానికి నే నెప్పుడు నిష్టుఁడను. నాకు నతఁడు ప్రియుఁడు.

ఉదారాః సర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్ ।
ఆస్థితః స హి యుక్తాత్మా మామేవానుత్తమాం గతిమ్ ॥

తే.గీ. వీర లంద ఉుదారులు వీరి లోన
జ్ఞానియును నేను నొక్క టనంగఁ దలఁతు
నేన యాత్మఁ గూడి సతము దాను బొందు
నన్ను నుత్తమంపు గతిని సన్నుతముగ 18.

వీ రందఱు కూడ నుదారులే. వారిలో జ్ఞానియు నేను నొక్కటిగా భావింతును. అతఁడు నిత్యము మనస్సులో నన్నుంచి యుత్తమ మైన గతిని బొందును.

బహూనాం జన్మనామన్తే జ్ఞానవాన్మాం ప్రపద్యతే ।
వాసుదేవః సర్వమితి స మహాత్మా సుదుర్లభః ॥

తే.గీ. పెక్కు జన్మల చివరను బేర్మి వాసు
దేవుఁడే సర్వమని నన్ను దెలిసి యుపచ
రించు జ్ఞాని యట్టి మహాత్ముఁ డెంచ దుర్ల
భమ్ము సుమ్ము మనుజు లందు వసుధ నెల్ల 19.

పెక్కు జన్మముల పిదప వాసుదేవుఁడే యన్నియు నని యెంచి సేవించును జ్ఞాని. అట్టి మహాత్ముఁడు మనుష్యు లందు దుర్లభుఁడు.

కామైః స్తైస్తై ర్హృతజ్ఞానాః ప్రపద్యన్తేఽన్య దేవతాః ।
తం తం నియమ మాస్థాయ ప్రకృత్యా నియతాః స్వయా ॥

తే.గీ. వివిధ కామము లరయ వివేక హీను
లనుగుణ మగు నియమములఁ దనరి వారి
వారి వగు స్వభావములచేఁ దోరముగ ని
యతు లయి తమిని భజియింతు రన్య సురుల 20.

తమయొక్క కోరికలను బొందుటకు వివేక హీనులు తమ కనుగుణ మైన నియమములను బాటించుచు వారి స్వభావముల ననుసరించి యితర దేవతలను బూజింతురు.

యో యో యాం యాం తనుం భక్తః శ్రద్ధయార్చితుమిచ్ఛతి ।
తస్య తస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధామ్యహమ్ ॥

తే.గీ. సురల సెవఁ డెవఁ డేయే పదురగు రూప
ముల భజింపఁగఁ గోరు నచలపు శ్రద్ధ
వాని వాని కిడుదు నేన వాని దేవు
నందు నట్టిదౌ శ్రద్ధను డెంద మలర 21.

దేవతల సెవ రెవ రేయే విధము లగు రూపముల మిక్కిలి శ్రద్ధతో భజింతురో వారి వారి కాయా దేవతల యందు నట్టి శ్రద్ధను నేనే కలుగఁ జేయుచున్నాను.

స తయా శ్రద్ధయా యుక్తస్తస్యారాధనమీహతే ।
లభతే చ తతః కామాన్మయైవ విహితాన్హి తాన్ ॥

తే.గీ. వాడు నట్టి శ్రద్ధ వహించి వేఁడుఁ బూజ
చేసి యా దేవునకు నంత వాసిగ నర
య గలఁ డా కోర్కులను నాదు నాజ్ఞ వడసి
యీయ నా దేవతయ వాని కెలమి మీఱ 22.

అట్టి శ్రద్ధతోఁ బూజ చేసి వాఁడు తన కోర్కిలను వేఁడుకొనును. అంత నా యాజ్ఞఁ బడసి యా దేవత యీయఁగా నతఁడు కోర్కిలను బడయఁ గలఁడు.

అన్తవత్తు ఫలం తేషాం తద్భవత్యల్పమేధసామ్ ।

దేవాన్దేవయజో యాన్తి మద్భక్తాయాన్తి మామపి ॥

ి‹

తే.గీ. దేవతల యజించెడి వారు దేవతలను
జేరెదరు మంద బుద్ధులు వారి ఫలము
తలఁప నంత వంత మగు సతతము నన్ను
దల్చు భక్తులు నన్న పొందఁ గల రెలమి 23.

దేవతలను బూజించెడు వారు దేవతలను జేరఁ గలరు. మంద మతులు వారి ఫలములు మితము గలవి. నన్ను సేవించు భక్తులు నన్ను జేరఁ గలరు.

అవ్యక్తం వ్యక్తిమాపన్నం మన్యన్తే మామబుద్ధయః ।
పరం భావమజానన్తోమమావ్యయమనుత్తమమ్ ॥

తే.గీ. నాశ మన లేక తనరెడు నాదు భావ
ముత్తమమ్ము నెఱుఁగక యత్యుత్తమమ్ము
దాని నవివేకు లనుకొండ్రు మానసమున
నన్ను నవ్యక్తు నాపన్న నరుఁడ నంచు 24.

నా యుత్తమ మైనది యవినాశమైనదియు నైన స్వభావమును దెలియక యవివేకులు నన్ను నక్షయుని నాపన్నునిగా సామాన్య నరునిగాఁ దలంతురు.

నాహం ప్రకాశః సర్వస్య యోగమాయాసమావృతః ।
మూఢోఽయం నాభిజానాతి లోకో మామజమవ్యయమ్ ॥

తే.గీ. గోచరింప నందఱికినిఁ గూడి యోగ
మాయ చేత నేను వివేకమే యనంగ
నెఱుఁగ నట్టి యీ లోకము మఱి యెఱుంగ
దు నను నజుని నవ్యయునిగ మనము నందు 25.

యోగ మాయచే నే నందఱికిఁ గన్పింపను. వివేక మెఱుఁగని యీ లోకము నన్ను పుట్టుకయే లేని వాని నవ్యయుని మనస్సులో నెఱుఁగఁ జాలదు.

వేదాహం సమతీతాని వర్తమానాని చార్జున ।
భవిష్యాణి చ భూతాని మాం తు వేద న కశ్చన ॥

తే.గీ. కడచినవి కలవియును రాగలవియు నగు
భూతముల నన్ని యింపుగ భూతలమున
నెఱుఁగు వాఁడ నర్జున నేను మఱి మదిని నె
ఱుంగఁ డొక్కండు గూడ చక్కంగ నన్ను 26.

అర్జున నేను పూర్వమున్నవి, యిప్పు డున్నవియు మఱియు నిఁక మీదట నుండు భూతముల నెల్ల నెఱుఁగుదును. కాని నన్ను జక్కఁగ నెవ్వరు నెఱుంగరు.

ఇచ్ఛాద్వేషసముత్థేన ద్వన్ద్వమోహేన భారత ।
సర్వభూతాని సమ్మోహం సర్గే యాన్తి పరన్తప ॥

తే.గీ. ఇష్టము ననిష్టముల జనియించి నట్టి
ద్వంద్వ భావముల వలన భవము నందు
మోహమును సర్వ జీవులు వొందు చున్న
విలఁ బరంతప భారత తెలియు మిట్లు 27.

ఇష్టానిష్టములఁ బుట్టిన సుఖ దుఃఖాది ద్వంద్వ భావముల వలన సకల ప్రాణులు మోహము చెందు చున్న వని యర్జున యెఱుఁగుము.

యేషాం త్వన్తగతం పాపం జనానాం పుణ్యకర్మణామ్ ।
తే ద్వన్ద్వమోహనిర్ముక్తా భజన్తే మాం దృఢవ్రతాః ॥

తే.గీ. పుణ్య కృతుల నెవరి పాపము లవి తొలఁగి
పోవు వారెల్ల ద్వివిధంపు మోహములను
బాసి నను భజింతురు దృఢవ్రతులునై య
నిశము సద్భక్తి మన మందు నెగడ నింక 28.

పుణ్య కార్యములు సేయ నెవరి పాపములు నాశన మౌనో వారు మోహమును బాసి దృఢ చిత్తమున నన్ను నిత్యము భక్తితో భజింతురు.

జరామరణమోక్షాయ మామాశ్రిత్య యతన్తి యే ।
తే బ్రహ్మ తద్విదుః కృత్స్నమధ్యాత్మం కర్మ చాఖిలమ్ ॥

తే.గీ. చావు పుట్టుక లింపుగఁ బోవఁ గోరి
యాశ్రయించి నన్ను బ్రయత్న మలరి చేసి
వారు తెలిసి కొందురు పరబ్రహ్మమును ప
రమపు టాత్మ సర్వమ్ముఁ గర్మము సకలము 29.

చావు పుట్టుకల నుండి విముక్తినిఁ గోరు వారు ప్రయత్నముతో నన్ను నాశ్రయించి పర బ్రహ్మమును బరమంపు టాత్మను సకల కర్మములను దెలిసికొందురు.

సాధిభూతాధిదైవం మాం సాధియజ్ఞం చ యే విదుః ।
ప్రయాణకాలేఽపి చ మాం తే విదుర్యుక్తచేతసః ॥

తే.గీ. ఎవ రెఱుఁగుదు రింపుగ నన్ను నిట్లు కలసి
యుందు నధిభూత మధిదైవ ముత్త మాధి
యజ్ఞములఁ గూడి యని వార లడర యుక్త
మనసు నన్నెఱుఁగ గలరు మరణపుఁ దఱి 30.

అధి భూతము, నధి దైవము, నధియజ్ఞములతో గలసి యుందు నని నన్నెవ రెఱుఁగుదురో వారు మరణంపు సమయమున యోగముతోఁ గూడిన మనస్సుతో నన్ను తెలియఁ గలరు.

ఇది శ్రీకృష్ణ సూక్తి సుధాకరమను శ్రీమదాంధ్ర భగవద్గీత యందు జ్ఞాన విజ్ఞాన యోగమను నాఱునొకటవ యధ్యాయము.
పోచిరాజు కామేశ్వర రావు నామధేయ ప్రణీతము.

శ్రీకృష్ణాయ నమః

# శ్రీకృష్ణ సూక్తి సుధాకరము

మూలము శ్రీమద్భగవద్గీత

## అధ్యాయ మెనిమిది – అక్షరపరబ్రహ్మ యోగము

అర్జున ఉవాచ ।
కిం తద్ బ్రహ్మ కిమధ్యాత్మం కిం కర్మ పురుషోత్తమ ।
అధిభూతం చ కిం ప్రోక్తమధిదైవం కిముచ్యతే ॥

అర్జునుని పలుకులు:

తే.గీ. బ్రహ్మ మన నేది పనియును బరమ పురుష
యెయ్య దౌను యధ్యాత్మము సెట్టి దౌను
దేని నధిభూత మందురు దేనిని నధి
దైవ మంచు వచింతురు తథ్యముగను 1.

కృష్ణా బ్రహ్మ మన నెయ్యది, కర్మమన నెయ్యది, యధ్యాత్మము, నధిభూతము, నధి
దైవము లెయ్యవి?

అధియజ్ఞః కథం కోఽత్ర దేహేఽస్మిన్మధుసూదన ।
ప్రయాణకాలే చ కథం జ్ఞేయోఽసి నియతాత్మభిః ॥

తే.గీ. ఇత్తనువు నందు నధియజ్ఞు డెవ్వఁడు మధు
సూదన నియమితపు మానసుండు తనదు
మరణ సమయమం దతఁ డెట్లు మదిని నిన్ను
దెలియ నేర్చును సమ్మతిఁ దెల్లముగను 2.

మధుసూదనా యీ శరీరమున నధియజ్ఞుఁ డెవ్వఁడు? నియంత్రించిన మనస్సు
గలవాఁడు నిన్ను దన మరణసమయ మందు నెట్లు నెఱుఁగఁ గలడు?

శ్రీభగవానువాచ ।

అక్షరం బ్రహ్మ పరమం స్వభావోఽధ్యాత్మముచ్యతే ।
భూతభావోద్భవకరో విసర్గః కర్మసంజ్ఞితః ॥

శ్రీభగవానుని పలుకులు:

తే.గీ. పరమము లయము లేనిది బ్రహ్మ మగును
గన స్వభావమ యధ్యాత్మ మనఁ బడు నిట
భూత భవము విసర్గయుఁ బుడమి నందుఁ
గల్గుటయ నుడువఁ బడును గర్మ మనఁగ 3.

పరమ మగు నదియు, నాశము లేనిది బ్రహ్మ మనఁ బడును. స్వభావ మధ్యాత్మ మనఁబడును (జీవాత్మ). భూతములు పుట్టుటయు లయమగుటయుఁ గర్మ మనఁ బడును.

అధిభూతం క్షరో భావః పురుషశ్చాధిదైవతమ్ ।
అధియజ్ఞోఽహమేవాత్ర దేహే దేహభృతాం వర ॥

తే.గీ. పురుషుఁ డధిదైవ మధిభూతము క్షయ భావ
మున్నది యగును దేహము లూను వారి
యందు నధికుఁడ యధియజ్ఞుఁ డనఁగ నేన
దేహ మందుండు వాఁడన స్థిరముగాను 4.

పురుషుఁ (దేహి) డధి దైవము. లయ మగు భావ మున్న పదార్థము (దేహము) యధిభూతము. దేహము ధరించు వారిలో యధికుఁడే యధియజ్ఞుఁ డనఁగ నేనే. మేనులో స్థిరముగా నుండు వాఁడను.

అన్తకాలే చ మామేవ స్మరన్ముక్త్వా కలేవరమ్ ।
యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః ॥

తే.గీ. నన్ను స్మరియించుచు నవసాన సమయమ్ము
నందు నెవ్వఁడు వీఁడి కాయమ్ముఁ జనును
వాఁడు వొందును నాదు భావమ్ము లేదు
సందియం బించు కైనను నిందుఁ దలఁప 5.

మరణ సమయమున నన్ను దలంచుచు నెవఁడు శరీరమును వీఁడునో వాఁడు
నిస్సంశయముగ నా స్వరూపమును బొందును.

యం యం వాపి స్మరన్భావం త్యజత్యన్తే కలేవరమ్ ।
తం తమేవైతి కౌన్తేయ సదా తద్భావభావితః ॥

తే.గీ. గిట్టెడు తఱి మదిని నెవం డెట్టి యెట్టి
భావములఁ దల్చి కౌంతేయ పాయు మేను
వాఁ డవశ్య మా రూపమ్మ పడయు సతము
తలపు లందట్టి భావమ తలఁచు చుండ 6.

అర్జునా యవసాన సమయమున మనస్సులో నే యే భావముల నూహించి దేహము
వీడునో ఆయా రూపములతోనే మరల పుట్టును.

తస్మాత్సర్వేషు కాలేషు మామనుస్మర యుధ్య చ ।
మయ్యర్పితమనోబుద్ధిర్మామేవైష్యస్యసంశయః ॥

తే.గీ. కాన సర్వ వేళల నన్ను గరము తల్చు
చుండి చేయుము యుద్ధము నుద్యమించి
బుద్ధి నర్పింప నాకీవు శుద్ధ హృదినిఁ
జేరుదువు నన్ను నిశ్శంక గౌరవముగ 7.

కావున నర్జున యన్ని వేళల నన్ను స్మరించుచు యుద్ధమును జేయుము. నీ
బుద్ధిని శుద్ధ మైన హృదయమును నా కర్పించిన నన్ను శంక లేక చేరుదువు.

అభ్యాస యోగ యుక్తేన చేతసా నాన్యగామినా ।
పరమం పురుషం దివ్యం యాతి పార్థానుచిన్తయన్ ॥

తే.గీ. కూడ నభ్యాస యోగము చూడ కుండ
నన్య మెయ్యది చిత్తమ్ము నందుఁ బరమ
పురుషు దివ్యుఁ జింతింపఁగ ముదము మీఱఁ 8.

బార్థ యప్పురుషునిఁ బొందు భవ్యముగను

అర్జునా యభ్యాస మను యోగమును గూడి మనస్సునందు నితరము లేవియుఁ జూడ కుండ దివ్యుఁ డైన పరమ పురుషునే చింతింపఁగ నతఁ డా పురుషునిఁ బొందును.

కవిం పురాణ మనుశాసితార మణో రణీయాంస మనుస్మరేద్యః ।
సర్వస్య ధాతార మచిన్త్య రూప మాదిత్య వర్ణం తమసః పరస్తాత్ ॥

తే.గీ. చీకటి కితరు సూర్య రుచిని వెలుంగు
వానిని ననూహ్యా రూపు సర్వ జన రక్ష
క వరు నణువు కన్నను సూక్ష్ముఁ గవిని నతి పు
రాణుని నియంత నెవ్వఁడు రక్తిఁ దల్చు 9.

చీకటికి నితరమైన వాని, సూర్యుని వలె వెల్గు వాని, నూహింప శక్యము కాని వాని నందఱిని రక్షించు వాని నణువు కన్నను జిన్న యైన వాని నతి పురాతనుని నెవ్వఁడు రక్తితోఁ దల్చునో

ప్రయాణకాలే మనసాఽచలేన
భక్త్యా యుక్తోయోగబలేన చైవ ।
భ్రువోర్మధ్యే ప్రాణమావేశ్య సమ్యక్
స తం పరం పురుషముపైతి దివ్యమ్ ॥

తే.గీ. వాఁడు పురుషోత్తముని దివ్యుఁ బడయు నింక
యోగ బలమున సద్భక్తి యుక్తముగను
భృకుటి నడుమ ప్రాణము నుంచి వెలయ స్థిరపు
మదినిఁ జక్కఁగ స్మరియింప మరణ వేళ 10.

యోగ బలమున భక్తితో నంత్య కాలమున భృకుటి మధ్య ప్రాణములను స్థిరముగా నిల్పి నిశ్చల మైన మనస్సుతోఁ బురుషోత్తముని స్మరించునో వాఁ డా పురుషోత్తమునే చేరును.

యదక్షరం వేదవిదో వదన్తి

విశన్తి యద్యతయో వీతరాగాః ।
యదిచ్ఛన్తోబ్రహ్మచర్యం చరన్తి
తత్తే పదం సఙ్గ్రహేణ ప్రవక్ష్యే ॥

తే.గీ. అక్షరం బని యెద్దాని నందురు శ్రుతి
వేదులు యతు లెద్దానిని విడిచి రతినిఁ
జేరు చుందురు దేని నాశింత్రు బ్రహ్మ
చర్యు లా పద ముడివెద సంగ్రహముగ 11.

వేద విదులు దేని నవినాశ మందురో, యతులు దేనినిఁ దగులమును వీడి చేరుదురో,
బ్రహ్మచర్యులు దేని నాశ్రయింతురో యా పదమును దెలిపెద సంగ్రహముగ వినుము.

సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్య చ ।
మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణమాస్థితో యోగధారణామ్ ॥

తే.గీ. మదిని నిల్పి చక్కంగను హృదయ మంద
ద్వారముల నెల్ల నియమించి ప్రాణము శిర
మందు నుంచి యోగాభ్యాస మందు నిలిచి
తాను సుస్థిరముగ సంతతమ్ము నుండి 12.

మనస్సును హృదయము నందు నిల్పి యింద్రియ ద్వారముల నన్నింటిని
నియంత్రించి శిరస్సు నందుఁ బ్రాణము నుంచి యోగము నందు నిల్చి స్థిరముగ

ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్మామనుస్మరన్ ।
యః ప్రయాతి త్యజన్దేహం స యాతి పరమాం గతిమ్ ॥

తే.గీ. ఓమ్మనెడు నొక్క యక్షర ముచ్చరించి
బ్రహ్మ మది నన్ను స్మరియించి పయన మగు నె
వండు విడిచి దేహము వాఁడు పరమ మైన
యట్టి గతినిఁ బడయు సందియమ్ము లేదు 13.

ఓ మ్మను బ్రహ్మము నేకాక్షరము నుచ్చరించి నన్ను స్మరించుచు దేహమును వీఁడి

యెవఁడు పయనించునో వాఁడు పరమ మైనట్టి గతిని బొందును.

అనన్యచేతాః సతతం యో మాం స్మరతి నిత్యశః ।
తస్యాహం సులభః పార్థ నిత్యయుక్తస్య యోగినః ॥

తే.గీ. అనితరంపు మనసున నన్ను నవరతము
ప్రతి దినమ్ముఁ స్మరించు నెవండు పార్థ
నిత్య యుక్త యోగికి నతనికి నతి సుల
భుండ నగుదు నే నింక ప్రస్ఫుటముగఁ దమి 14.

పార్థా యెవ్వఁ డన్యము నందు లేని మనస్సున నెల్లప్పుడు నన్ను
స్మరించుచుండునో, నిత్యము యోగము నందుండునో యట్టి వానికి నేను
సులభముగా లభింతును.

మాముపేత్య పునర్జన్మ దుఃఖాలయమశాశ్వతమ్ ।
నాప్నువన్తి మహాత్మానః సంసిద్ధిం పరమాం గతాః ॥

తే.గీ. గొప్ప ముక్తి నరసి నట్టి గొప్ప చిత్తు
లింక వెతలకు నెలవునై యెంచ మఱి య
శాశ్వతపుఁ బునర్జన్మము విశ్వ మందు
నొంద కుండ నుందురు నన్నుఁ బొంది నంత 15.

ముక్తినిఁ బొందిన మహాత్ము లింక బాధలకు నిలయము లైన యశాశ్వతము లైన
పునర్జన్మములను బొందరు.

ఆబ్రహ్మభువనాల్లోకాః పునరావర్తినోఽర్జున ।
మాముపేత్య తు కౌన్తేయ పునర్జన్మ న విద్యతే ॥

తే.గీ. బ్రహ్మ లోకము వఱకు నున్న వర జగమ్ము
లన్ని యిచ్చుఁ దిరిగి జన్మ మర్జున మఱి
నన్నుఁ బొందినఁ గౌంతేయ నరున కింకఁ
గలుగ దీ పునర్జన్మము కరము ప్రీతి 16.

బ్రహ్మ లోకము మొదలగు నన్ని లోకములు తిరిగి పునర్జనముల నొసఁగును. అర్జున నన్ను బొందిన వారికి పునర్జన్మ ముండదు.

సహస్ర యుగ పర్యన్త మహ ర్యద్బ్రహ్మణో విదుః ।
రాత్రిం యుగ సహస్రాన్తాం తేఽహోరాత్రవిదో జనాః ॥

తే.గీ. రాత్రి పగల నిడివుల నరసిన జనులు
బ్రహ్మకు సహస్ర యుగములు పగ లగు నని
యట్ల వేయి యుగమ్ములు నగును రాత్రి
యంచు నెఱుఁగుదురు మదిని నంచితముగ 17.

రేయింబవళుల పరిమాణ మెఱిఁగిన వారు బ్రహ్మకు వేయి మహాయుగము లొక పగ లనియు, నట్లే వేయి మహాయుగము లొక రాత్రి యగు ననియు నెఱుఁగుదురు.

అవ్యక్తా ద్వ్యక్తయః సర్వాః ప్రభవన్త్యహరాగమే ।
రాత్ర్యాగమే ప్రలీయన్తే తత్రైవావ్యక్తసంజ్ఞకే ॥

తే.గీ. వచ్చినఁ బగ లవ్యక్తపు భావ మందు
నుండి వ్యక్తంపు రూపము లుద్భవిల్లుఁ
బరఁగ రాత్రి లీన మగును దిరిగి యట్టి
వ్యక్త రహిత రూపమున నవారితముగ 18.

ఆ బ్రహ్మకుఁ బగ లయిన వ్యక్తము కాని భావము నుండి వ్యక్తము లగు జీవులు పుట్టును. రాత్రి యైన నవి యన్నియుఁ దిరిగి యవ్యక్తపు రూప మందు లీన మగును.

భూతగ్రామః స ఏవాయం భూత్వా భూత్వా ప్రలీయతే ।
రాత్ర్యాగమేఽవశః పార్థ ప్రభవత్యహరాగమే ॥

తే.గీ. జీవ సంచయ మవశమై చేరి కరగు
మఱల మఱల నిక నిశాగమమునఁ బార్థ
యంత దిన మది ప్రారంభ మైన నింకఁ 19.

బుట్టు చుండును జక్కగఁ బుడమి లోన

అవశమై జీవ రాశి పగటి కాలమును పుట్టును మఱియు రాత్రి యందు లయ మగు
చుండును. మఱల మఱల యీ చావు పుట్టుకలు జరుగుచుండును.

పరస్తస్మాత్తు భావోఽన్యోఽవ్యక్తోఽవ్యక్తాత్సనాతనః ।
యః స సర్వేషు భూతేషు నశ్యత్సు న వినశ్యతి ॥

తే.గీ. సర్వ భూతము లంత నాశమ్మయినను
నితర మవ్యక్తమునకును నతి పురాత
నమును బరమ మవ్యక్తమై యమరు నట్టి
భావ మది నాశనమ్మును బడయ దెపుడు 20.

భూతము లన్నియు నాశన మైన నవ్యక్తమైన దాని కితర మైనదియి, నుత్తమ
మైనదియు నతి పురాతన మైనదియు, వ్యక్తము కానిదియు, నైన భావము
నాశనము కాదు.

అవ్యక్తోఽక్షర ఇత్యుక్తస్తమాహుః పరమాం గతిమ్ ।
యం ప్రాప్య న నివర్తన్తే తద్ధామ పరమం మమ ॥

తే.గీ. అక్షరుండు నవ్యక్తుఁడు ననఁగఁ దనరు
వాని బరమంపు గతి యంద్రు దేనిఁ బడయ
దిరిగి రాకుండుదురొ మఱి దివ్య మైన
యట్టి నాధామ ముత్తమ మయిన దెల్ల 21.

అక్షరుఁడు, నవ్యక్తుఁ డనఁగఁ జెప్పు నట్టి పరమాత్ముని యొక్క గతిగ జెప్పు చుందురో
దేనినిఁ బొందిన మఱి తిరిగి రారో యట్టి నా ధామ ముత్తమ మైనది.

పురుషః స పరః పార్థ భక్త్యా లభ్యస్త్వనన్యయా ।
యస్యాన్తఃస్థాని భూతాని యేన సర్వమిదం తతమ్ ॥

తే.గీ. ఎవని లోపల నుండునో యెల్ల భూత 22.

జాల మెవనిచే వ్యాప్త మీ జగము సర్వ
మట్టి పరమంపుఁ బురుషుం డనన్య భక్తి
వలన మాత్రమ పార్థ లభ్య మగును జుమి

అర్జునా యెవ్వని లోపల భూతము లన్నియు నుండునో యెవ్వనిచే నీ జగత్తు వ్యాప్త
మయ్యెనో యట్టి పరమ పురుషుఁ డనన్య భక్తి వలన మాత్రమే లబ్ధుఁ డగును.

యత్ర కాలే త్వనావృత్తిమావృత్తిం చైవ యోగినః ।
ప్రయాతా యాన్తి తం కాలం వక్ష్యామి భరతర్షభ ॥

తే.గీ. అంత్య యానమ్ము నెక్కాల మందు సేయ
యోగి వరు లింక జన్మంబు నొందరు మఱి
పొందుదురు జన్మ తిరిగి యప్పొద్దుఁ జెప్పు
చుంటిని భరతర్షభ విను చోద్య మలర 23.

ఏ కాలమందు మరణించిన యోగులు తిరిగి పుట్టరో, యే కాల మందుఁ బోయినఁ
బునర్జన్మ మొందుదురో యట్టి కాలమును జెప్పెద నర్జునా వినుము.

అగ్నిర్జ్యోతిరహః శుక్లః షణ్మాసా ఉత్తరాయణమ్ ।
తత్ర ప్రయాతా గచ్ఛన్తి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః ॥

తే.గీ. బ్రహ్మ మెఱిఁగిన జనులెల్లఁ బయన మగుచు
నగ్ని కాంతి దివసమందు నలర శుక్ల
పక్ష ముత్తరాయణ మది పరఁగు నాఱు
నెలలు బ్రహ్మము నీఁకఁ బొందఁ గలరు వారు 24.

బ్రహ్మ జ్ఞాన మున్న జను లగ్ని, తేజము (ఈ మార్గమున) పగలు శుక్లపక్షము
నాఱుమాసము లుండు నుత్తరాయణమున  బోయిన బ్రహ్మ పదము బొందుదురు.

ధూమో రాత్రిస్తథా కృష్ణః షణ్మాసా దక్షిణాయనమ్ ।
తత్ర చాన్ద్రమసం జ్యోతిర్యోగీ ప్రాప్య నివర్తతే ॥

తే.గీ. ధూమ గతి రాత్రి యోగులు తొలఁక కృష్ణ
పక్ష మాఱు మాసమ్ములు పరఁగు దక్షి
ణాయనమ్మలరం బయన మయి చంద్ర
కాంతిఁ జేరియుఁ దిరిగి రాఁ గలరు వారు 25.

ధూమ గతి రాత్రి, కృష్ణ పక్షము నాఱు మాసము లుము లుండు దక్షిణాయనమున
యోగులు పోయినఁ జంద్ర కాంతి పదము సేరి తిరిగి జన్మము లొందుదురు.

శుక్ల కృష్ణే గతీ హ్యేతే జగతః శాశ్వతే మతే ।
ఏకయా యాత్యనావృత్తి మన్య యావర్తతే పునః ॥

తే.గీ. శుక్ల కృష్ణ గతులు రెండుఁ జొప్పడును స
తమ్ము శాశ్వతము లనుచుఁ దలఁపఁ బడును
జన్మ ముండదు నొక్కటఁ జక్కఁ గాను
మరలి వత్తు రన్యమ్మునఁ దిరిగి తిరిగి 26.

శుక్ల గతి కృష్ణ గతు లని రెండు విధములు జగతికి శాశ్వతము లని తలఁపఁ బడును.
మొదటి గతిఁ జనిన తిరిగి పుట్టరు. రెండవ గతి నరిగిన తిరిగి పుట్టుదురు.

నైతే సృతీ పార్థ జానన్యోగీ ముహ్యతి కశ్చన ।
తస్మాత్సర్వేషు కాలేషు యోగయుక్తోభవార్జున ॥

తే.గీ. తెలియ నీ మార్గములు రెండుఁ దెల్లముగను
మోహ మొందఁ డే యోగియుఁ బుడమిఁ బార్థ
కాన యోగ యుక్తుండవు కమ్ము సర్వ
కాలముల యందు నర్జున మేలు గాను 27.

ఈ రెండు మార్గముల నెఱిఁగిన యోగు లెవ్వరు మోహ మందరు. కావున పార్థా యోగ
యుక్తుడఁవు కమ్ము.

వేదేషు యజ్ఞేషు తపస్సు చైవ
దానేషు యత్పుణ్యఫలం ప్రదిష్టమ్ ।

అత్యేతి తత్సర్వమిదం విదిత్వా
యోగీ పరం స్థాన ముపైతి చాద్యమ్ ॥

తే.గీ. దీని నెఱిఁగి యోగి వరుఁడు తెల్లముగను
వేదముల యజ్ఞముల యందు విదిత మెట్టి
పుణ్య ఫలము తపో దానములను దాని
మీఱి యాద్యోత్తమ పదము మీఱి పొందు 28.

దీని నెఱిఁగిన యోగి పుంగవుఁడు వేదాధ్యయనము, యజ్ఞములు, దానములు, తపముల వలన కలుగు ఫలములను మించి నట్టి మొదటిదియు నుత్తమ మైన పదమును బొందును.

ఇది శ్రీకృష్ణ సూక్తి సుధాకరమను శ్రీమదాంధ్ర భగవద్గీత యందు నక్షరపరబ్రహ్మ యోగమను నెనిమిదవ యధ్యాయము.
పోచిరాజు కామేశ్వర రావు నామధేయ ప్రణీతము.

శ్రీకృష్ణాయ నమః

# శ్రీకృష్ణ సూక్తి సుధాకరము

మూలము శ్రీమద్భగవద్గీత

## అధ్యాయము తొమ్మిది – రాజవిద్యా రాజగుహ్య యోగము

శ్రీభగవానువాచ ।
ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యామ్యనసూయవే ।
జ్ఞానం విజ్ఞానసహితం యజ్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్ ॥

శ్రీభగవానుని పలుకులు:

తే.గీ. అతి రహస్య మియ్యది యసూయ యన లేని
నీకుఁ జెప్పెద దేని వినిన నశుభము
లెల్ల నీఁక వీఁడఁ గల వట్టి యింపొసఁగెడి
జ్ఞానము సమగ్రముగను విజ్ఞాన యుతము 1.

అర్జునా రహస్య మైన దీనిని నసూయ నెఱుఁగని నీకు చెప్పెదను దేనిని వినిన నశుభము లన్నియు తొలఁగునో యట్టి జ్ఞానమును విజ్ఞాన సహితముగ.

రాజవిద్యా రాజగుహ్యం పవిత్రమిదముత్తమమ్ ।
ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తుమవ్యయమ్ ॥

తే.గీ. విద్య లందుత్తమమ్మును వెలయు నతి ర
హస్యమై రహస్యమ్ముల నతి పవిత్ర
ముత్తమము ధర్మ్య మవ్యయ మురుతరముగ
ననుభవ విదితము సులభ మగును జేయ 2.

ఇది విద్యలం దుత్తమ మైనది, రహస్యములం దెల్ల గొప్పరహస్యము, పవిత్రము, శ్రేష్ఠము, ధర్మయుతము, అవినాశము ననుభవముచేఁ దెలియఁ దగినది, చేయుటకు సులభ మైనదియును.

అశ్రద్దధానాః పురుషా ధర్మస్యాస్య పరన్తప ।
అప్రాప్య మాం నివర్తన్తే మృత్యుసంసారవర్త్మని ॥

తే.గీ. శ్రద్ధ లేని పురుషులు దర్మమ్ము నందు
మదిఁ బరంతప చేరక పదిలముగ న
ను మఱి మృత్యు సంసార మార్గమునె యనుస
రించి మరలి వచ్చుట యది యెంచ నిజము 3.

మనస్సులో ధర్మ మందు శ్రద్ధలేని మనుష్యులు నన్ను జేరక మృత్యువుతోఁ గూడు
కొనిన సంసార మార్గము ననుసరించుచు మఱల మఱల పుట్టుదురు.

మయా తతమిదం సర్వం జగదవ్యక్తమూర్తినా ।
మత్స్థాని సర్వభూతాని న చాహం తేష్వవస్థితః ॥

తే.గీ. ఈ జగం బంత నా చేత నింద్రియమ్ము
లకు నగోచర మూర్తి వలనన వ్యాప్త
మయ్యెఁ గలవు నా యందును నఖిల భూత
ము లరయఁగ లేను నే నట్టి భూత రాశి 4.

ఇంద్రియములకు గోచరము కాని నా చేతనె యీ జగ మంతయు వ్యాపింపఁ బడి
యున్నది. నా లో సమస్త జీవరాసు లున్నవి. కాని వాస్తవముగ నేను వానిలో లేను.

న చ మత్స్థాని భూతాని పశ్య మే యోగమైశ్వరమ్ ।
భూతభృన్న చ భూతస్థో మమాత్మా భూతభావనః ॥

తే.గీ. కనుము నాదు దైవత యోగము నిట లేవు
భూతము లవి నా యందును భూత ధారి
భూత భావపు నా యాత్మ భూత చయము
నందు నిశ్శంక లే దరయంగ నెందు 5.

ఈశ్వర సంబంధ మైన నా యోగమును గనుము. భూతములు నా లోన లేవు.
భూతములను ధరించు వాఁడను, రక్షించు వాఁడను నే నైనను నిజమునకు నా

యాత్మ భూతము లందు లేదు.

యథాకాశస్థితో నిత్యం వాయుః సర్వత్రగో మహాన్ ।
తథా సర్వాణి భూతాని మత్స్థానీత్యుపధారయ ॥

తే.గీ. ఎల్ల వ్యాపించు ఘన వాయు వల్ల నింగి
నిత్య మే రీతి నుండును సత్యముగను
దలఁపు మట్టి విధమ్మునఁ గలవు పార్థ
సకల జీవులు నాయంద సంతతమ్ము 6.

సర్వ వ్యాప్త మైన గాలి (ఆకాశము లోనే పుట్టి) యే విధముగా నిత్య ముండునో యట్టి విధమున జీవు లన్నియు (నా వలనఁ బుట్టినవే) నా లో నున్న వని గ్రహింపుము.

సర్వభూతాని కౌన్తేయ ప్రకృతిం యాన్తి మామికామ్ ।
కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజామ్యహమ్ ॥

తే.గీ. నాదు మాయను జేరును నలిన జాహ
ము ముగియంగ భూతము లన్నియు మఱలఁ బ్రళ
యాంతమున సృజింతును వాని నన్నిటి నీఁక
నేను గౌంతేయ మఱి యనుమాన మేల 7.

అర్జునా బ్రహ్మకు పగలు పూర్తి యయిన పిదప భూతము లన్నియు నా మాయను జేరును. తిరిగి ప్రళయ మంత మైన పిదప వానిని సృజించెదను.

ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పునః పునః ।
భూతగ్రామమిమం కృత్స్న మవశం ప్రకృతేర్వశాత్ ॥

తే.గీ. నేన నాదైన ప్రకృతినిఁ బూని యవశ
భూత జాలము నెల్లను బుడమి యందుఁ
దిరిగి తిరిగి పుట్టింతు నడరఁగ వాని
వాని ప్రకృతి వశమ్మటఁ బాటవముగ 8.

నా ప్రకృతి నవలంబించి యవశ మైన యీ జీవ జాలమును వాని వాని స్వభావముల ననుసరించి మఱల మఱలఁ బుట్టింతును.

న చ మాం తాని కర్మాణి నిబధ్నన్తి ధనఞ్జయ ।
ఉదాసీనవదాసీనమసక్తం తేషు కర్మసు ॥

తే.గీ. అప్పనుల రక్తి లేకయు నతి తటస్థ
ముగ స్థితుండ నయిన నాకుఁ దగెడు నట్టి
కర్మము లవి ధనంజయ కట్ట లేవు
నన్ను నెవ్విధి నైనను నెన్నఁడేని 9.

అర్జున యా పనులు రక్తి లేక తటస్థముగా నున్న నన్ను బంధింప లేవు.

మయాధ్యక్షేణ ప్రకృతిః సూయతే సచరాచరమ్ ।
హేతునానేన కౌన్తేయ జగద్విపరివర్తతే ॥

తే.గీ. నా యెఱుకన నా చేతన యీ యఖిల చ
రాచరమ్ములఁ బ్రకృతి రయమ్ముగఁ గను
చున్నది తనరి కౌంతేయ మిన్నగ భ్రమి
యించు చున్నది జగమెల్ల నిక్కతనను 10.

ఈ చరా చర ప్రాణులను బ్రకృతి నా ప్రాభవముననే కను చున్నది. ఈ కారణముననే జగత్తు తిరుగు చున్నది.

అవజానన్తి మాం మూఢా మానుషీం తనుమాశ్రితమ్ ।
పరం భావమజానన్తోమమ భూతమహేశ్వరమ్ ॥

తే.గీ. ఉత్తమ మయిన నాభావ ముర్వి భూత
ములకు విభుఁడ నయిన నన్ను లలిత మాను
షంపు రూపుని నెఱుఁగని జగతి నున్న 11.

మూఢు లొనరింతు రవమానము నిట నాకు

నా పరమతత్త్వము నెఱుఁగని వారు, మానుష రూపమును ధరించిన నన్ను సకల భూతములకుఁ బ్రభువు నైన నన్నెఱుఁగని వారు న న్నవమానింతురు.

మోఘాశా మోఘకర్మాణో మోఘజ్ఞానా విచేతసః ।
రాక్షసీమాసురీం చైవ ప్రకృతిం మోహినీం శ్రితాః ॥

తే.గీ. వ్యర్థ కర్ములు నజ్ఞులు వ్యర్థ కాము
లు విగతజ్ఞానులు మఱి తెలివి యొకింత
లేమి యసుర రాక్షస భావమే మనమునఁ
బరఁగ నాశ్రయించుచు నున్న వారు దాని 12.

అజ్ఞానులు, వ్యర్థమైన యాశలు కర్మములు గలవారు మోహముచేత రాక్షస భావము మనస్సులో మెదలు చుండ దానినే యాశ్రయించుచున్నారు.

మహాత్మానస్తుమాం పార్థ దైవీం ప్రకృతిమాశ్రితాః ।
భజన్త్యనన్యమనసో జ్ఞాత్వా భూతాదిమవ్యయమ్ ॥

తే.గీ. ఆశ్రయించి యమర భావ మాత్మ యందు
సుమహితాత్ము లవ్యయుఁ జేతనముల కాది
యైన నన్ను నెఱింగి యేకాగ్ర చిత్త
మున భజింతురు పార్థ సముచితముగను 13.

అర్జునా దైవ భావముతో మహాత్ము లైన వా రవ్యయునిఁ, జేతనముల కన్నింటికి నాద్యుఁడ నైన నన్ను నెఱిఁగి యేకాగ్ర చిత్తమున భజింతురు.

సతతం కీర్తయన్తో మాం యతన్తశ్చ దృఢవ్రతాః ।
నమస్యన్తశ్చ మాం భక్త్యా నిత్యయుక్తాఉపాసతే ॥

తే.గీ. సంతతమ్ము కీర్తించుచుఁ జల్పుచు దృఢ
తరపు వ్రతములు తివిరి యనురతి నన్ను 14.

భక్తిని నమస్కరించుచుఁ బరమ యోగి
వరులు సేవించు చున్నా రవిరళముగను

నిత్యము కీర్తించుచు, యత్నించుచు, దృఢ వ్రతములు సలుపుచుఁ, బ్రీతితో భక్తితో నమస్కరించుచుఁ బరమ యోగులు నన్ను సేవించు చున్నారు.

జ్ఞానయజ్ఞేన చాప్యన్యే యజన్తోమాముపాసతే ।
ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతోముఖమ్ ॥

తే.గీ. మఱియు కొందఱు నన్ను బ్రమదముగ నఖి
లావనీ వీక్షణుని జ్ఞాన యజ్ఞ గమన
మునను నేకత్వమున భిన్నముగను బహు వి
ధములఁ బూజించి సేవింత్రు విమల మతులు 15.

మఱి కొందఱు జ్ఞాన యజ్ఞమున నన్ను గొల్తురు. ఏకత్వముగ, వేఱు వేఱుగ, బహు విధముల సంతోషముతోఁ బూజించి సేవించెదరు.

అహం క్రతురహం యజ్ఞః స్వధాహమహమౌషధమ్ ।
మన్త్రోఽహమహమేవాజ్యమహమగ్నిరహం హుతమ్ ॥

తే.గీ. నేన క్రతువును యజ్ఞము నేన పిండ
మేన నేన మందును మంత్ర మేన యాజ్య
మేన నేన యగ్ని హుతము నేన సర్వ
మేన యై యుందు సంశయ మేల యిందు 16.

క్రతువును నేనే, యజ్ఞమును నేనే, పిండమును, మందును, మంత్రమును, నెయ్యి, యగ్ని, హవిస్సు, సర్వమును నేనే.

పితాహమస్య జగతో మాతా ధాతా పితామహః ।
వేద్యం పవిత్రమోఙ్కార ఋక్సామ యజురేవ చ ॥

తే.గీ. నేను దల్లిని తండ్రిని నెమ్మి ధాత 17.

ను మఱి తాత నిజ్జగతికి విమల మరయ
దగెడు నోంకారమును నేన తథ్యముగను
ఋగ్యజుస్సామములును సౌభాగ్యముగను

నేనే యీ జగతికిఁ దల్లి, తండ్రి తాతను. ధరించు వాడు, నోంకారము, ఋగ్యజుసామ వేదములును నేనే.

గతిర్భర్తా ప్రభుః సాక్షీ నివాసః శరణం సుహృత్ ।
ప్రభవః ప్రలయః స్థానం నిధానం బీజమవ్యయమ్ ॥

తే.గీ. గతిని భర్తను బ్రభువును సతము సాక్షి
యును నివాసము నాశ్రయమును సఖుండఁ
బుట్టుకకు వినాశమునకు మూరి స్థితికిఁ
గారకుఁడ నిధి నవ్యయ కారణమును 18.

పరమ గతి, భర్త, రాజు, సాక్షి, యావాసము, నాశ్రయము, మిత్రుఁడు, నుత్పత్తి స్థితి లయములకు కారణము, నిధి, నశింపని మూలమును నేనే.

తపామ్యహమహం వర్షం నిగృహ్ణామ్యుత్సృజామి చ ।
అమృతం చైవ మృత్యుశ్చ సదసచ్చాహమర్జున ॥

తే.గీ. తాప మిచ్చు వాఁడను వానఁ దగఁ గ్రహించి
యిచ్చు వాఁడఁ జావక యుంటఁ జచ్చుటయును
నేన సత్తు నసత్తును నేన యగుదు
నర్జున సకలమ్ముॖ జగతి నరసి చూడ 19.

అర్జున తాపము నిచ్చువాఁడను నేనే. వానను గ్రహించి తిరిగి యిచ్చువాఁడను నేనే. చావు పుట్టుకలు నేనే. సత్తు నసత్తు, సకలమ్ములు నేనే.

త్రైవిద్యా మాం సోమపాః పూతపాపా యజ్ఞైరిష్ట్వా స్వర్గతిం ప్రార్థయన్తే ।
తే పుణ్య మాసాద్య సురేన్ద్ర లోక మశ్నన్తి దివ్యాన్దివి దేవభోగాన్ ॥

తే.గీ. మూడు విద్యల వారు స ముదము ద్రాగి
సోమ మిష్టుల నను దన్పి సుర జగమ్ముఁ
గోరి వీఁడి యఘుమ్ములు సేరి పుణ్య
దివ మనుభవింత్రు దివ్యంపు దివి సుఖములు 20.

మూడు వేద విద్యలు నేర్చిన వారు సోమరసము త్రాగి యజ్ఞములు చేసి స్వర్గ ప్రాప్తినిఁ గోరుదురు. పాపములు తొలఁగ స్వర్గమును బొంది దివ్యములైన స్వర్గ సుఖము లనుభవింతురు

తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం
క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి ।
ఏవం త్రయీధర్మమనుప్రపన్నా
గతాగతం కామకామా లభన్తే ॥

తే.గీ. అనుభవించి పే భోగము లంత దివినిఁ
బుణ్యము నశింప నరలోకము వడయుదురు
వారు కొని త్రయీధర్మము కోరు వారు
కోరికలు రాకపోకల మూరు చుంద్రు 21.

దివిలో భోగము లనుభవించి పుణ్యము క్షీణింపఁగనే తిరిగి భూలోకమున జనింతురు. ఈ మూడు వేదములను బాటించి కోరికలు కోరు వారు దివి భువి లోకములకు రాకపోకలు సలుపుచుందురు.

అనన్యాశ్చిన్తయన్తో మాం యే జనాః పర్యుపాసతే ।
తేషాం నిత్యాభియుక్తానాం యోగ క్షేమం వహామ్యహమ్ ॥

తే.గీ. అన్య చింతలు దలఁపక యనవరతము
నన్ను స్మరియించి యెవ్వరు పన్నుగ మఱి
భక్తి సేవించెదరొ యట్టి ప్రజకు నిత్య
యుక్తుల కరయుదు శుభము యోగ మేను 22.

అన్య చింతలు లేక నన్ను నిత్యము భక్తితో స్మరించి సేవింతురో యట్టి యోగు లైన

వారి  యోగ క్షేమములను నేను చూచెదను.

యేఽప్యన్యదేవతా భక్తాయజన్తే శ్రద్ధయాన్వితాః ।
తేఽపి మామేవ కౌన్తేయ యజన్త్యవిధిపూర్వకమ్ ॥

తే.గీ. భక్తియును శ్రద్ధయుఁ దనర భక్తు లన్యు
లెలమిఁ బూజింతు రన్యామరులను వారు
గూడ కౌంతేయ గణియింపఁ గొల్చు వార
గుదురు నన్ను నక్రమ రీతిఁ బదిలముగను 23.

ఇతర దేవతలను భక్తి శ్రద్ధలతో నెవరు పూజింతురో వారు కూడ యన్య విధమున
నన్ను బూజించిన వారే యగుదురు.

అహం హి సర్వయజ్ఞానాం భోక్తాచ ప్రభురేవ చ ।
న తు మామభిజానన్తి తత్త్వేనాతశ్చ్యవన్తి తే ॥

తే.గీ. భోక్త నేన సకల యజ్ఞములకు విభుఁడుఁ
గూడ నగుదును వానికి గురుతరముగ
నాదు తత్త్వ మెఱుంగరు నన్ను వారు
కానఁ బతన మగుదురు జగతిని సతము 24.

సకల యజ్ఞములకు భోక్తను బ్రభువును నేనే. నా తత్త్వము నేరక వారు పతన మొందు
రనఁగా జన్మలందు చిక్కుదురు.

యాన్తి దేవవ్రతా దేవాన్పితౄన్యాన్తి పితృవ్రతాః ।
భూతాని యాన్తి భూతేజ్యా యాన్తి మద్యాజినోఽపి మామ్ ॥

తే.గీ. అమరుల యజింపఁ బొందుదు రమరులఁ దమిఁ
బితరుల నెలమిఁ బూజింపఁ బితృ వరులను
భూత రాశి నర్చింపఁగ భూతములను
నన్ను గొలువఁ బొందుదు రిఁక నన్ను ధృతిని 25.

దేవతలను బూజించిన దేవతలను, పితరులను బూజించినఁ బితృదేవతలను,
భూతముల నర్చించిన భూతములను, నన్ను గొల్చిన నన్ను  బొందుదురు,

పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి ।
తదహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః ॥

తే.గీ. ఎవ్వఁ డతి భక్తి నిచ్చును బువ్వు ఫలమొ
పత్రమొ జలమొ యవ్వాని ప్రయత హృదయు
భక్తి పూర్వ కార్పణమును బన్నుగ భుజి
యింతు నిస్సంశయమ్ముగ సంతసమున 26.

భక్తితో నెవ్వడు పుష్పమొ, ఫలమొ, జలమొ యిచ్చినను బవిత్ర హృదయముతో నేది
యొసఁగినను జక్కఁగ స్వీకరింతును.

యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్ ।
యత్తపస్యసి కౌన్తేయ తత్కురుష్వ మదర్పణమ్ ॥

తే.గీ. చేయు దానినిఁ దిను దానిఁ జేయు యజ్ఞ
దాన తతులను గౌంతేయ తపము జపము
లన్నియు నిరంతరమ్మును నడరి యవి మ
దర్పణమ్ముగఁ జేయుమ తలఁచి నన్ను 27.

అర్జున నన్ను స్మరించుచుఁ బనులను, దానములను, భుక్తములను, జపములను,
తపములను, నా కర్పించి చేయుము.

శుభాశుభఫలైరేవం మోక్ష్యసే కర్మబన్ధనైః ।
సంన్యాసయోగయుక్తాత్మా విముక్తోమాముపైష్యసి ॥

తే.గీ. ఇవ్విధము శుభాశుభముల నిచ్చు కర్మ
బంధముల నుండి విడివడి పదిలముగను
లలిత సన్న్యాస యోగము వెలయు చిత్త
మున విముక్తుఁడవై నన్ను బొందఁ గలవు 28.

ఈ విధముగాఁ జేసిన శుభాశుభముల నిచ్చు కర్మముల నుండి విముక్తుఁడ వౌదువు.
అర్జున సన్యాస యోగము చిత్తమున నుండ ముక్తుఁడవై నన్ను జేరెదవు.

సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః ।
యే భజన్తి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్ ॥

తే.గీ. సముఁడ సర్వభూతమ్ముల శత్రు మిత్రు
లనఁగ లేరు నాకు నరయఁ దనర భక్తి
మదిని నెవరు భజింతురు సదయ నుందు
వారి యందున నాయందు వారు నుంద్రు 29.

నేను సర్వ భూతములకు సముఁడను. శత్రువు మిత్రుఁ డనఁగ లేరు నాకు. భక్తితో న
న్నెవరు సేవింతురో వారి యందు నేను నా యందు వారు నుందురు.

అపి చేత్సుదురాచారో భజతే మామనన్యభాక్ ।
సాధురేవ స మన్తవ్యః సమ్యగ్వ్యవసితో హి సః ॥

తే.గీ. అతి దురాచారుఁ డైనను నతఁ డనన్య
భావమున నన్ను గొల్చిన వానిఁ బరమ
నిశ్చయాత్ముని సాధు వనియ తలంప
వలయు నెల్లరు నింక సంభావ్యముగను 30.

దురాచారుఁ డైన నితరుల నాశ్రయింపక నన్ను భక్తి భావమున నిశ్చయ బుద్ధితోఁ
బూజించునో వానిని సాధువుగనే పరిగణింప వలయును.

క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాన్తిం నిగచ్ఛతి ।
కౌన్తేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి ॥

తే.గీ. శీఘ్ర మగును ధర్మాత్ముఁడు స్థిరపు శాంతిఁ
బొందు నాతఁడు కౌంతేయ యెందు నెపుడు
నాదు భక్తుఁడు పొందఁడు నాశనమ్ము 31.

ని తెలియంగ వలయుఁ జుమ్మి నిశ్చయముగ

శీఘ్రముగా నతఁడు ధర్మాత్ముఁ డగును. సుస్థిరమైన శాంతినిఁ బొందును. అర్జున నా భక్తుఁ డెన్నఁడు నాశనము కాఁడు.

మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః ।
స్త్రియో వైశ్యాస్తథా శూద్రాస్తేఽపి యాన్తి పరాం గతిమ్ ॥

తే.గీ. పొంది నా యాశ్రయ మ్మెవ రుందు రట్టి
వారు పాప జన్ములు నైన వారిజాక్షు
లైన వైశ్యులు శూద్రులు నైన నేమి
పొందఁ గల రతి యుత్తమంపు గతు లెలమి 32.

నా యాశ్రయమును బొందిన వారు పాపు లైన, స్త్రీ లైన, వైశ్యు లైన, శూద్రు లైనను సద్గతులు పొంద గలరు.

కిం పునర్బ్రాహ్మణాః పుణ్యా భక్తారాజర్షయస్తథా ।
అనిత్యమసుఖం లోకమిమం ప్రాప్య భజస్వ మామ్ ॥

తే.గీ. పుణ్యులును భక్తు లైన విప్రులను మఱియు
నెంచ రాజర్షులను జెప్ప నేల సుఖము
లేనిదియు మఱి నిత్యము కాని యీ జ
గమును బొంది భజింపు ముదముగ నన్ను 33.

ఇంక పుణ్యులు భక్తు లైన  విప్రులు రాజుల సంగతి చెప్ప నేల? అనిత్యమును సుఖములు లేని యీ జగత్తులో (దుర్లభమైన మానవ జన్మమున) జనించి సంతసమున నన్ను భజింపు మర్జున.

మన్మనా భవ మద్భక్తోమద్యాజీ మాం నమస్కురు ।
మామేవైష్యసి యుక్త్వైవమాత్మానం మత్పరాయణః ॥

తే.గీ. మనసు నుంచు నాయంద నమస్కరింపు 34.

నాక సద్భక్తుఁడ వగుమ నాకుఁ బూజ
సేయుము మది నియోగము చేసి మత్ప
రాయణుఁడ వైన నన్నుఁ జేరఁ గల వెలమి

అర్జున నా యందు మనస్సు నుంచి నమస్కరించు, నాకు భక్తుఁడవై, మది నా
కర్పించి నా తలపు లంద యున్న నన్నుఁ జేరఁ గలవు.

ఇది శ్రీకృష్ణ సూక్తి సుధాకరమను శ్రీమదాంధ్ర భగవద్గీత యందు రాజవిద్యా రాజగుహ్య యోగమను తొమ్మిదవ యధ్యాయము.

పోచిరాజు కామేశ్వర రావు నామధేయ ప్రణీతము.

శ్రీకృష్ణాయ నమః

# శ్రీకృష్ణ సూక్తి సుధాకరము

మూలము శ్రీమద్భగవద్గీత

## అధ్యాయము పది – విభూతి యోగము

శ్రీభగవానువాచ ।
భూయ ఏవ మహాబాహో శృణు మే పరమం వచః ।
యత్తేఽహం ప్రీయమాణాయ వక్ష్యామి హితకామ్యయా ॥

శ్రీభగవానుని పలుకులు:

తే.గీ. ప్రీతి నొందు నీకు మఱి చెప్పెదను దిరిగి
మేలు గోరి యర్జున కడు మేటి వచన
ములను వాని నెల్లను వినుము కురువంశ
వర్ధన మహాభుజ మదాస్య భాషితములు 1.

అర్జున మేటి వచనములు నీ హితము గోరి చెప్పెదను వినుము.

న మే విదుః సురగణాః ప్రభవం న మహర్షయః ।
అహమాదిర్హి దేవానాం మహర్షీణాం చ సర్వశః ॥

తే.గీ. సుర గణములు మహర్షు లెవరును దెలియ
లేరు నాదు భవమ్మును వారి కెల్ల
రకును దేవతలకు మునులకును నన్ని
విధములఁ దలంప నాదియై వెలయు వాఁడ 2.

దేవతలు మహర్షులు వీ రెవ్వరు నా పుట్టుక నెఱుఁగరు. వీ రెల్లరకు నన్ని విధముల
నేను మూల కారకుఁడను.

యో మా మజ మనాదిం చ వేత్తి లోకమహేశ్వరమ్ ।

అసమ్మూఢః స మర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే ॥

తే.గీ పుట్టుకయు నింక నాది లేనట్టి వాని
లోక విభుని నన్నెవ్వండు ప్రాకటముగ
నెఱుఁగు వాఁ డసమ్మూఢుఁడు నెల్ల మర్త్యు
లందు దురితముల విముక్తుఁ డగును నెమ్మి 3.

నన్ను బుట్టుకలు లేని వానిగ, నాది యన్నది లేని వానిగ లోకముల కీశ్వరునిగ నెవఁడు స్పష్టముగ నెఱుఁగునో వాఁడు మనుష్యు లందు నెల్ల జ్ఞాని. పాపముల నుండి ముక్తుఁ డౌను.

బుద్ధిర్జ్ఞాన మసమ్మోహః క్షమా సత్యం దమః శమః ।
సుఖం దుఃఖం భవోఽభావో భయం చాభయమేవ చ ॥

తే.గీ. మతియు నెఱుకయు మోహము మఱియు నోర్మి
సత్యమును దమము శమము సౌఖ్యము మఱి
దుఃఖము భవము నభవము దుస్సహ భయ
ము నభయమును సకల భావములు మఱియును 4.

బుద్ధి, జ్ఞానము, మోహరాహిత్యము, నోర్మి, సత్యము, శమ దమములు, సుఖ దుఃఖములు, చావు పుట్టుకలు, భయము ధైర్యము మున్నగు సకల గుణముల

అహింసా సమతా తుష్టిస్తపో దానం యశోఽయశః ।
భవన్తి భావా భూతానాం మత్త ఏవ పృథగ్విధాః ॥

తే.గీ. తగ నహింసయు సమతయుఁ దపము తృప్తి
దాన మపకీర్తి కీర్తియుఁ గా నలరెడు
వివిధ భావము లన్నియు భువిని భూత
ములకుఁ గల్గుచు నుండు నా వలన నరయ 5.

అహింస, సమత్వము, తృప్తి, తపము, దాన మపకీర్తి, కీర్తు లను వివిధ భావములు భూమి పై జీవులకు నా వలననే కలుగు చుండును.

మహర్షయః సప్త పూర్వే చత్వారో మనవస్తథా ।
మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః ॥

తే.గీ. ఎవ్వరికి నుద్భవించిరి యీ జగమున
లోకు లట్టి సప్త మహర్షులు మఱి వారి
పూర్వులు నలుగురు మఱియు పూజనీయ
మనువులు నుదయించిరి నాదు మనము వలన 6.

ఈ పుడమిని లోకు లెల్ల రెవ్వరికి జన్మించిరో యట్టి సప్తర్షులు, వారి పూర్వులు నల్గురును, మనువులు నా భావము కల వారై నా సంకల్పమున నా మానస పుత్రు లైరి.

ఏతాం విభూతిం యోగం చ మమ యో వేత్తి తత్త్వతః ।
సోఽవికమ్పేన యోగేన యుజ్యతే నాత్ర సంశయః ॥

తే.గీ. ఎవ్వఁ డెఱుఁగు నిజముగ నా యివ్విభూతి
నింక యోగమ్ము నట్టి వాఁ డెలమి సుస్థి
రంపు యోగము నిఁకఁ గూడు నింపుగ నన
నిందు లే దించు కైనను సందియమ్ము 7.

నా యీ విభూతిని యోగ మహిమను సెవఁడు నిజముగ సెఱుఁగునో వాఁడు స్థిరమైన యోగమునఁ గూడుకొనును. ఇందు సందేహము లేదు.

అహం సర్వస్య ప్రభవో మత్తః సర్వం ప్రవర్తతే ।
ఇతి మత్వా భజన్తే మాం బుధా భావసమన్వితాః ॥

తే.గీ. అన్నిటిని నేన పుట్టించు నట్టి వాఁడ
వర్తిలు సమస్త మెంచ నా వలనఁ జుమ్మి
తలఁచి యిట్లు భావ యుతులు గొలుతు రెలమి
నన్ను బుధ వరులు సతము సన్నుతులను 8.

నా వలననే యన్నియుఁ బుట్టునని, నా యందే యివి యన్నియు వర్తించు నని
తలఁచి పరమార్థ భావ మెఱిఁగిన వారై జ్ఞానులు నన్ను నిత్యము గొల్తురు

మచ్చిత్తాః మద్గతప్రాణాః బోధయన్తః పరస్పరమ్ ।
కథయన్తశ్చ మాం నిత్యం తుష్యన్తి చ రమన్తి చ ॥

తే.గీ. ఉంచి చిత్తము నా యందు నంచితముగఁ
బ్రాణములును బోధించుచుఁ బలుకుచు నిర
తమ్ము నా కథలను మదిఁ దనివి నొందు
చుండి రంజిల్లు చున్నారు సురుచిరముగ 9.

మనస్సును బ్రాణములను నా యందు నుంచిన వారు , నా కథలను జదువుచు,
బోధించుచు నిత్యము సంతసించుచుఁ దృప్తి నొందు చున్నారు.

తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్ ।
దదామి బుద్ధియోగం తం యేన మాముపయాన్తి తే ॥

తే.గీ. మూరి బుద్ధి యోగము నిత్తు వారి కింకఁ
గారణ మగు నెయ్యది నన్ను జేరుటకును
సతముఁ బ్రీతి నన్నిడి మానసమ్ము నందు
మించి యర్చించు వారికి నంచితముగ 10.

నిత్యము నన్ను మనస్సు లందు నుంచి యర్చించు వారికి నన్ను జేరు కొనుటకు
కారణమైన బుద్ధి యోగమును బ్రసాదింతును.

తేషా మే వానుకమ్పార్థ మహ మజ్ఞానజం తమః ।
నాశయా మ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా ॥

తే.గీ. వారి నింపుగఁ గరుణింపఁ గోరి నేను
జ్ఞాన మది లేమి పుట్టిన శర్వరమ్ము
నాశనం బొనరింతు జ్ఞానంపు దివ్వె 11.

వెలుఁగులను వారి యాత్మలో వెలసి నెమ్మి

అట్టి వారినిఁ గరుణింప నెంచి యజ్ఞానము వలన కల్గిన యంధకారమును జ్ఞాన మను దీపపు వెలుగులచే నిల్చి వారి మనస్సులలో నాశన మొనరింతును.

అర్జున ఉవాచ ।
పరం బ్రహ్మ పరం ధామ పవిత్రం పరమం భవాన్ ।
పురుషం శాశ్వతం దివ్యమాదిదేవమజం విభుమ్ ॥

అర్జునుని పలుకులు:

తే.గీ. తద్దయుఁ బవిత్రుఁడవు పరంధాముఁడవు వి
నుత పరబ్రహ్మ మీవు శాశ్వతునిగ నజు
నిగ విభునిగ దివ్య పురుషునిగను దేవ
గణములకు నాది దైవముగను నిరతము 12.

కృష్ణా నీవు పవిత్రుఁడవు, వైకుంఠ ధాముఁడవు, పరబ్రహ్మవు. శాశ్వతునిగ, నభవునిగ, దివ్య పురుషునిగ, నాది దేవునిగ

ఆహుస్త్వామృషయః సర్వే దేవర్షిర్నారదస్తథా ।
అసితో దేవలో వ్యాసః స్వయం చైవ బ్రవీషి మే ॥

తే.గీ. ఎల్ల ఋషులు నారద సన్మునీంద్రుఁడు మఱి
యసితుఁడును దేవలుండును వ్యాస ముని వ
రేణ్యుఁడును జెప్పిరి నిను నగణ్యునిగను
జెప్పు చుంటివి స్వయముగ నిప్పు డీవు 13.

నిన్ను నారదాది ఋషులు నసితుఁడు, దేవలుఁడు, వ్యాస మునీంద్రుఁడు మున్నగు వారెల్లరు మున్ను జెప్పగా నిప్పుడు నీవు స్వయముగఁ జెప్పు చున్నావు.

సర్వమేతదృతం మన్యే యన్మాం వదసి కేశవ ।
న హి తే భగవన్వ్యక్తిం విదుర్దేవా న దానవాః ॥

తే.గీ. సత్య మని యెంతు నీదు భాషణ చయమ్ము
కేశవ మదిని మఱి తావకీన రూప
మెఱుఁగఁ గలరె దేవ యమరు లేని దాన
వేంద్రు లేని జగతి నందు నెందు నైన 14.

కేశవా నీ వచనము లెల్ల సత్యములని తలఁచెదను. నీ రూపమును సురాసురు
లెవ్వరును దెలియ లేరు.

స్వయమేవాత్మనాత్మానం వేత్థ త్వం పురుషోత్తమ ।
భూతభావన భూతేశ దేవదేవ జగత్పతే ॥

తే.గీ. నిన్ను నీవ నీ చేతనె పన్నుగ మఱి
యెఱుఁగు చుంటివి సకల భూతేశ దేవ
దేవ పురుషోత్తమ జగత్పతి యదు వంశ
తిలక భూత చయ భవ సలలిత కర్త 15.

సకల భూతములకు నీశ్వరా దేవ దేవా పురుషోత్తమా విశ్వపతీ యదు వంశనాథా
భూతకారకా నిన్ను నీవ నీ చేతనే యెఱుఁగు చుంటివి.

వక్తుమర్హస్యశేషేణ దివ్యా హ్యాత్మవిభూతయః ।
యాభిర్విభూతిభిర్లోకానిమాంస్త్వం వ్యాప్య తిష్ఠసి ॥

తే.గీ. ఏ విభూతుల నింపుగ నిజ్జగముల
నీవు నెక్కొని యుంటివి యా విభూతు
ల నతి దివ్యముల నశేషమున మన మల
రంగ నుడువఁ దగుదు వీ వభంగముగను 16.

ఈ జగము లందు నే విభూతితో నెలకొని యుంటివో యా విభూతులను నీవ
యశేషముగ నవిరళముగఁ జెప్పఁ దగుదువు.

కథం విద్యామహం యోగింస్త్వాం సదా పరిచిన్తయన్ ।
కేషు కేషు చ భావేషు చిన్త్యోఽసి భగవన్మయా ॥

తే.గీ. యోగి పుంగవ చింతించు చుండుచు నిను
నిత్య మేను దెలియు టెట్లు సత్య రీతి
నెట్టి యెట్టి భావమ్ముల నెలమిఁ దలఁప
వలయు భగవంతుఁడవు నిన్ను బరమ పురుష 17.

యోగి పుంగవ! పరము పురుష! నిత్యము స్మరించుచు నిన్ను నే నెట్లు తెలియఁ గలను? భగవంతుఁడ వైన నిన్ను నే భావములఁ దలఁప వలెను?

విస్తరేణాత్మనో యోగం విభూతిం చ జనార్దన ।
భూయః కథయ తృప్తిర్హి శృణ్వతో నాస్తి మేఽమృతమ్ ॥

తే.గీ. విస్తరముగ నీ యోగము విమల తర వి
భూతియు జనార్దన వచియింపు మఱి యొక్క
తూరి తృప్తి కలుగ నేరదు వినఁగ నమ్ృ
తంపు వచనమ్ములను నిరతమ్ము నాకు 18.

నీ యమృత మయ మైన పల్కు లెన్ని వినినఁ దనివి తీరదు. నీ యోగమును బవిత్రమైన నీ విభూతియు మఱియొక్క సారి నుడువుము.

శ్రీభగవానువాచ ।
హన్త తే కథయిష్యామి దివ్యా హ్యాత్మవిభూతయః ।
ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ నాస్త్యన్తో విస్తరస్య మే ॥

శ్రీభగవానుని పలుకులు:

తే.గీ. దివ్యము లహో తలంప మదీయ విస్త
రామల విభూతు లంతము లరయ లేము
ముఖ్యము లవి కురుశ్రేష్ఠ మూరి నీ కొ
అకు వచించు చున్నాను దఱచుగ నడుగ 19.

అర్జున నా విభూతులు విమలములు, విస్తారము లంతము లేనివియును. నీ కొఱకు ముఖ్యము లైనవి కొన్ని చెప్పుదును.

అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః ।
అహమాదిశ్చ మధ్యం చ భూతానామన్త ఏవ చ ॥

తే.గీ. భూత రాశి హృదయ మందుఁ బొలసి నట్టి
యాత్మ నేను గుడాకేశ యరయ నేన
యాదిమధ్యాంత కారకుఁ డగుదు సకల
భూతములకు జగతి నందుఁ బూర్ణముగను 20.

అర్జునా నేను భూతముల యందున్న యాత్మను. ప్రాణుల కన్నింటికి నాది
మధ్యము నంతము నేన యగుదును.

ఆదిత్యానామహం విష్ణుర్జ్యోతిషాం రవిరంశుమాన్ ।
మరీచిర్మరుతామస్మి నక్షత్రాణామహం శశీ ॥

తే.గీ. ఆదితేయుల విష్ణుండ నంశుమంతు
లందు సూర్యుండను మరుత్తులం దడరి య
గుదు మరీచిని చంద్రుం డగుదును దార
లందు నెఱుఁగ వలయు నిట్లు నంచితముగ 21.

అర్జునా నే నాదిత్యులలో విష్ణుఁడను, కాంతిమంతులలో సూర్యుఁడను, మరుత్తు
లందు మరీచిని, నక్షత్రము లందుఁ జంద్రుఁడను,

వేదానాం సామవేదోఽస్మి దేవానామస్మి వాసవః ।
ఇన్ద్రియాణాం మనశ్చాస్మి భూతానామస్మి చేతనా ॥

తే.గీ. వేద చయ మందు నే సామ వేద మౌదు
వాసవుండను సర్వ దేవతల యందు
మనసు నౌదు నింద్రియముల మానితముగఁ
జేతనుండ భూతమ్ముల శ్రేష్ఠముగను 22.

వేదములందు సామ వేదమును, దేవత లందు నింద్రుఁడ, నింద్రియము లందు

మనస్సును, జీవు లందు చేతనమును.

రుద్రాణాం శఙ్కరశ్చాస్మి విత్తేశో యక్షరక్షసామ్ ।
వసూనాం పావకశ్చాస్మి మేరుః శిఖరిణామహమ్ ॥

తే.గీ. రుద్రు లందు శంకరుఁడ నే నద్రు లందు
మేరు పర్వత మౌదుఁ గుబేరుఁడ ఘన
యక్ష రాక్షస యూథమ్ము నందు వసువు
లందు నింపుగ ననలమ్ము నౌదు నరయ 23.

రుద్రులలో శంకరుఁడను, గిరు లందు మేరువును, యక్ష రాక్షసు లందుఁ
గుబేరుఁడను, వసువులలో నగ్నిని.

పురోధసాం చ ముఖ్యం మాం విద్ధి పార్థ బృహస్పతిమ్ ।
సేనానీనామహం స్కన్దః సరసామస్మి సాగరః ॥

తే.గీ. నన్నె ఱుఁగు బృహస్పతిగను మిన్న యైన
వాఁ డతఁడు పురోహితు లందుఁ బరమ సైన్య
పతుల యందు స్కందుండను బార్థ సరసు
లందు సాగర మౌదు నే నందముగను 24.

పురోహితులందు బృహస్పతిని, సేనా నాయకు లందుఁ గుమారస్వామిని, సరస్సు
లందుఁ గడలిని.

మహర్షీణాం భృగురహం గిరామస్మ్యేకమక్షరమ్ ।
యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి స్థావరాణాం హిమాలయః ॥

తే.గీ. భృగు మహర్షిని నే నౌదు పెను మహర్షు
లందు గిర లందు నగుదు నే కాక్షరమ్ము
యజ్ఞముల యందు నే జప యజ్ఞ మౌదు
స్థావరమ్ము లందు హిమాద్రిఁ దథ్య మేను 25.

మును లందు భృగువు, నక్షరము లందు నోంకారమును, యజ్ఞము లందు జప యజ్ఞమును, స్థావరము లందు హిమాలయమును.

అశ్వత్థః సర్వవృక్షాణాం దేవర్షీణాం చ నారదః ।
గన్ధర్వాణాం చిత్రరథః సిద్ధానాం కపిలో మునిః ॥

తే.గీ. ఎల్ల చెట్ల యందున రావి వృక్ష మేను
నారదుండ దేవర్షుల గారవముగఁ
జిత్రరథుఁడ గంధర్వుల సిద్ధు లందు
నింకఁ గపిల మునీంద్రుఁడ శంక లేక 26.

వృక్షము లందు రావిచెట్టును, దేవర్షులలో నారదుఁడను, గంధర్వులలోఁ జిత్ర రథుఁడను, సిద్ధులలోఁ గపిల మునిని.

ఉచ్చైఃశ్రవస మశ్వానాం విద్ధి మామమృతోద్భవమ్ ।
ఐరావతం గజేన్ద్రాణాం నరాణాం చ నరాధిపమ్ ॥

తే.గీ. అశ్వముల నమృతమ్ముతో విశ్వ మందుఁ
బుట్టి నట్టి యుచ్చైశ్రవము నరయంగ
నేను గరుల నైరావత మేను నరుల
యందు నెఱుఁగుము నన్ను నరాధిపునిగ 27.

గుఱ్ఱములలో నమృతముతోఁ బుట్టిన యుచ్చైశ్రవమును, గజము లందు నైరావతమును, నరులందు రాజును.

ఆయుధానామహం వజ్రం ధేనూనామస్మి కామధుక్ ।
ప్రజనశ్చాస్మి కన్దర్పః సర్పాణామస్మి వాసుకిః ॥

తే.గీ. ఆయుధము లందు వజ్రమ్ము నౌదు గోవు
లం దగుదుఁ గామధేనువు నరయ మన్మ
థుండ జనకు లందున సర్ప దండ మందు
నగుదు నే వాసుకిని నిశ్చయమ్ముగ మఱి 28.

ఆయుధములలో వజ్రాయుధమును, గోవు లందుఁ గామ ధేనువును, దండ్రు లందు (పుట్టించు వారు) మన్మథుఁడను సర్పజాలము లందు వాసుకిని.

అనన్తశ్చాస్మి నాగానాం వరుణో యాదసామహమ్ ।
పితౄణామర్యమా చాస్మి యమః సంయమతామహమ్ ॥

తే.గీ. నాగులం దనంతుఁడను వనచర గణము
లందు వరుణుండను బితరు లందు నర్య
ముండ నగుదు సంయమనుల మండితముగ
నౌదు యమ ధర్మరాజని నక్కజముగ 29.

పాము లందు ననంతుఁడను, నీటిలోఁ జరించు వానిలో వరుణుఁడను, బితృ దేవత లందు నర్యముఁడను, సంయమను లందు యముఁడను.

ప్రహ్లాదశ్చాస్మి దైత్యానాం కాలః కలయతామహమ్ ।
మృగాణాం చ మృగేన్ద్రోఽహం వైనతేయశ్చ పక్షిణామ్ ॥

తే.గీ. దైత్యు లందుఁ బ్రహ్లాదుఁడఁ దగ సమయము
నగుదును గణితజ్ఞుల యందు మృగము లందు
నేను మృగరాజు నౌదును నింగి నెగురు
పక్షు లందు గరుడుఁడను బార్థ వినుమ 30.

రాక్షసు లందుఁ బ్రహ్లాదుఁడను, గణకులలోఁ గాలమును, మృగముల యందు సింహమును, బక్షు లందు గరుత్మంతుఁడను.

పవనః పవతామస్మి రామః శస్త్రభృతామహమ్ ।
ఝషాణాం మకరశ్చాస్మి స్రోతసామస్మి జాహ్నవీ ॥

తే.గీ. వాయువును శుభ్ర పఱచెడి వారి యందు
రఘు వరుఁ డగు రాముఁడను శస్త్ర ధరు లందు
మకర మేను మత్స్యము లందు సకల నదుల 31.

యందు గంగా నదిని నౌదు నంచితముగ

శుభ్ర పఱచు వారి యందు గాలిని, ధానుష్కులందు రఘురాముఁడను, జేప లందు మొసలిని, నదు లందు గంగా నదిని.

సర్గాణామాదిరన్తశ్చ మధ్యం చైవాహమర్జున ।
అధ్యాత్మవిద్యా విద్యానాం వాదః ప్రవదతామహమ్ ॥

తే.గీ. సృష్టుల మొదలు నడుమయుఁ జివరయు నది
నేన యౌదు నర్జున యెన్నఁ డేని నరయ
విద్యల నగుదు నధ్యాత్మ విద్య నేను
వాద మొనరించు వారల వాద మేను 32.

సృష్టి యందు నాదిమధ్యాంతములు నేన, విద్యలలో నధ్యాత్మ విద్యను, వాదులలో వాదమును.

అక్షరాణామకారోఽస్మి ద్వన్ద్వః సామాసికస్య చ ।
అహమేవాక్షయః కాలో ధాతాహం విశ్వతోముఖః ॥

తే.గీ. అక్షరముల న కారము నగుదు నేను
ద్వంద్వ మయి సమాసములను బరఁగు వాఁడ
నక్షయం బగు కాలము నౌదు నేను
విశ్వ మెల్ల నరయు ధాత శాశ్వతముగ 33.

అక్షరములం ద కారమును, సమాసము లందు ద్వంద్వ సమాసమును, క్షయము లేని కాలమును. విశ్వ మంతను జూచు ధాతను నేను.

మృత్యుః సర్వహరశ్చాహముద్భవశ్చ భవిష్యతామ్ ।
కీర్తిః శ్రీర్వాక్చ నారీణాం స్మృతిర్మేధా ధృతిః క్షమా ॥

తే.గీ. అన్నిటినిఁ జంపు మృత్యువు నౌదు నేను
బుట్ట నున్నట్టి వారల పుట్టుకయును 34.

నేన స్త్రీలలోఁ గీర్తి వాణియు సిరి స్మృతి
ధృతియు నోర్పును మఱియు బుద్ధియును నేన

అన్నిటినిఁ జంపు మృత్యువును, బుట్టఁ బోవు వారి పుట్టుకను, స్త్రీ లందు గీర్తి, వాణి, లక్ష్మి , స్మృతి, ధృతి, యోర్పు మఱియు మేధను నేను.

బృహత్సామ తథా సామ్నాం గాయత్రీ ఛన్దసామహమ్ ।
మాసానాం మార్గశీర్షోఽహమృతూనాం కుసుమాకరః ॥

తే.గీ. సామ వేదాదులను బృహత్సామ మేను
ఛందములను గాయత్రిని వందితుఁడను
మాసములలోన నేనౌదు మార్గశిరము
ఋతువు లందు నేను వసంత ఋతువు నౌదు 35.

వేదములందు సామ వేదమును ఛందము లందు గాయిత్రిని, మాసము లందు మార్గశీర్షమును, ఋతువులలో వసంత ఋతువును.

ద్యూతం ఛలయతామస్మి తేజస్తేజస్వినామహమ్ ।
జయోఽస్మి వ్యవసాయోఽస్మి సత్త్వం సత్త్వవతామహమ్ ॥

తే.గీ. మోసకారు లందలి జూదమే సుమి యర
యంగ నేను దేజస్వంతు లందుఁ దేజ
మును జయమ్ము మఱియు యత్నము లవి నేన
సాత్త్వికుల లోనఁ గనిపించు సత్త్వ మేను 36.

మోసకారులందు జూదమును, దేజస్కు లందుఁ దేజమును, జయము, యత్నమును నేను, సాత్త్వికులలో సత్త్వగుణమును.

వృష్ణీనాం వాసుదేవోఽస్మి పాణ్డవానాం ధనఞ్జయః ।
మునీనామప్యహం వ్యాసః కవీనా ముశనా కవిః ॥

తే.గీ. వృష్ణి వంశజు లందునఁ గృష్ణుఁడ నిటఁ 37.

బాండవుల ధనంజయుఁడను బరమ మునుల
యందు వ్యాస మహర్షిని నంచితముగఁ
గవుల యందున భార్గవ కవిని నేను

వృష్ణివంశ మందుఁ గృష్ణుఁడను, బాండవు లందు ధనంజయుఁడను, మహర్షు లందు
వ్యాసుఁడను, గవు లందు శుక్రుఁడను.

దణ్డో దమయతామస్మి నీతిరస్మి జిగీషతామ్ ।
మౌనం చైవాస్మి గుహ్యానాం జ్ఞానం జ్ఞానవతామహమ్ ॥

తే.గీ. తల్ప దండించు వారల దండ మేను
జయముఁ గోరెడి వారల నయము నేను
మంతనమ్ముల యందున మౌన మేను
జ్ఞానవంతు లందున మఱి జ్ఞాన మేను 38.

దండించు వారిలోని దండమును, జయము గోరు వారిలో నీతిని, రహస్యము లందు
మౌనమును, జ్ఞానుల లోని జ్ఞానమును.

యచ్చాపి సర్వభూతానాం బీజం తదహమర్జున ।
న తదస్తి వినా యత్స్యాన్మయా భూతం చరాచరమ్ ॥

తే.గీ. ఏది బీజమొ ప్రాణుల కెలమి నింక
నయ్యది గన నే నర్జున యెయ్యది సక
లాచర చర భూతములకు నగునొ నేను
లేక యయ్యది యేదియు లేదు జగతి 39.

ప్రాణులకు మూల మైనది యేదో యది నేను, సకల చరాచర భూతములకు నేను లేక
యగునో యయ్యది యేదియు నీ జగతిని లేదు.

నాన్తోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరన్తప ।
ఏష తూద్దేశతః ప్రోక్తో విభూతేర్విస్తరో మయా ॥

తే.గీ. నా విభూతుల కంత మనంగఁ గనము
దివ్యము లవి పరంతప తెలిపితి నిట
వీని వివరణములు గొన్ని పాటవమునఁ
గృష్తముగను నీకు నిపుడు గుప్త మైన 40.

అర్జున నా విభూతులకు నంతము లేదు. అవి దేవతా సంబంధములు. వీని వివరములు కొన్ని రహస్యము లైనను గృష్తముగ నీకు నిచట తెల్పితిని.

యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జితమేవ వా ।
తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోంఽశసమ్భవమ్ ॥

తే.గీ. ఏవి యేవి యైశ్వర్య సహితములును బ్ర
భా యుతమ్ములు నిఁక శక్తివంతములు న
గు నవి యన్నియును దెలిసి కొనుము పార్థ
సంభవించెను నాదు నంశము వలననె 41.

ఐశ్వర్యముతోఁ గూడుకున్నవి, కాంతి యుక్తములు, శక్తియుక్తము లన్నియును నా యంశముతోనే జనించిన వని యర్జున! తెలిసికొనుము.

అథవా బహునైతేన కిం జ్ఞాతేన తవార్జున ।
విష్టభ్యాహమిదం కృత్స్నమేకాంశేన స్థితో జగత్ ॥

తే.గీ. ఇంత కన్నను నధిక మ్మదేల నీకుఁ
దెలియ వలయు నర్జున నేన తివిరి స్థిరము
గ మఱి యొక్క యంశముతోనె కవిసి యుంటి
నిజ్జగం బెల్ల యందున నెమ్మి తోడ 42.

అర్జునా యింత కంటె యెక్కువ తెలిసి కొనుట యేల నీకు. నేను స్థిరముగా నొక్క యంశముతోనే సమస్త విశ్వ మందువ్యాపించి యుంటిని.

ఇది శ్రీకృష్ణ సూక్తి సుధాకరమను శ్రీమదాంధ్ర భగవద్గీత యందు విభూతి యోగమను పదియవ యధ్యాయము.
పోచిరాజు కామేశ్వర రావు నామధేయ ప్రణీతము.

శ్రీకృష్ణాయ నమః

# శ్రీకృష్ణ సూక్తి సుధాకరము

మూలము శ్రీమద్భగవద్గీత

## అధ్యాయము పదునొకండు – విశ్వ రూప సందర్శన యోగము

అర్జున ఉవాచ ।
మదనుగ్రహాయ పరమం గుహ్యమధ్యాత్మసంజ్ఞితమ్ ।
యత్త్వయోక్తం వచస్తేన మోహోఽయం విగతో మమ ॥

అర్జునుని పలుకులు:

తే.గీ. నన్ను నుగ్రహింపఁగఁ గోరి పన్నుగ నతి
గుప్త మైన యధ్యాత్మ మగు విషయమ్ము
నెల్లఁ బలుకఁగ నా మోహ మెల్లఁ ద్రుటి న
శించె నీదు వచనముల నంచితముగ 1.

కృష్ణా నా పై దయతో నతి రహస్య మైన యధ్యాత్మక విషయములను వివరింపఁగ నా మోహ మెల్ల నశించినది.

భవాప్యయౌ హి భూతానాం శ్రుతౌ విస్తరశో మయా ।
త్వత్తః కమలపత్రాక్ష మాహాత్మ్యమపి చావ్యయమ్ ॥

తే.గీ. భూతముల భవ నాశము లాతతముగ
నీ వలన వింటి నిప్పుడు నీరజాక్ష
యవ్యయం బైన నీదు మాహాత్మ్య మెల్ల
విస్తరమ్ముగ నెమ్మిని విస్మయముగ 2.

ప్రాణుల యొక్క యుత్పత్తి లయములను నీ వలన వింటిని. అవ్యయమైన నీ మాహాత్మ్యమును వింటిని.

ఏవమేతద్యథాత్థ త్వమాత్మానం పరమేశ్వర ।

ద్రష్టుమిచ్ఛామి తే రూపమైశ్వరం పురుషోత్తమ ॥

తే.గీ. ఎవ్విధి నుడివితివి పరమేశ్వర మఱి
నీ గుఱించి యా రూపము నిత్య మీశ్వ
రాను రూపముఁ జూడఁగ నాశ కలిగె
నిపుడు ప్రత్యక్షముగ నిన్ను నింక నాకు 3.

పరమేశ్వరా నీ గుఱించి యే రూపమునఁ జెప్పితివో యట్టి యీశ్వర సంబంధమైన
రూపమున నిన్ను బ్రత్యక్షముగఁ జూడఁ గోరిక కల్గుచున్నది నాకు.

మన్యసే యది తచ్ఛక్యం మయా ద్రష్టుమితి ప్రభో ।
యోగేశ్వర తతో మే త్వం దర్శయాత్మానమవ్యయమ్ ॥

తే.గీ. కాంచ శక్య మగు నది నా కంచు నెంచి
తేని యోగీశ్వరా ప్రభు దాని నవ్య
యంపు నీదు రూపమ్మును బెంపు మీఱఁ
జూపు మయ్య కరుణ తోడ సురుచిరముగ 4.

యోగీశ్వరా కృష్ణా నాకుఁ జూడ శక్య మగు నని నీ వెంచి తేని యవ్యయమైన నీ దివ్య
రూపమును దయతోఁ జూపు మయ్య.

శ్రీభగవానువాచ ।
పశ్య మే పార్థ రూపాణి శతశోఽథ సహస్రశః ।
నానా విధాని దివ్యాని నానా వర్ణాకృతీని చ ॥ ౧౧

శ్రీభగవానుని పలుకులు:

తే.గీ. చూడు పార్థ రూపమ్ములు చోద్యముగను
వందలును వేలు నాదు దివ్యమ్ము లైన
యట్టి నానా విధమ్ములు నాకృతులును
నెలమి నింక నానా వర్ణములును ధృతిని 5.

నానా విధములు నానా రూపములు దివ్యములు శత సహస్రాధికములు నైన నా

రూపములను బార్థా ధైర్యముతోఁ జూడుము.

పశ్యాదిత్యాన్వసూన్రుద్రానశ్వినౌ మరుతస్తథా ।
బహూన్యదృష్టపూర్వాణి పశ్యాశ్చర్యాణి భారత ॥

తే.గీ. చూడు మాదిత్యుల మఱి వసువుల రుద్రు
లశ్వినుల మరుత్తుల నెల్ల నక్కజములు
పెక్కు గనుమ భారత మున్ను నెక్క డైనఁ
గాన నట్టి వాని నిపుడు కన్నులార 6.

ఆదిత్యులను, వసువులను, రుద్రుల నశ్వినులను, మరుత్తులను, మఱియు
నాశ్చర్యములైనవి పెక్కు మున్ను జూడనవి చూడు మర్జున.

ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్య సచరాచరమ్ ।
మమ దేహే గుడాకేశ యచ్చాన్యద్ ద్రష్టుమిచ్ఛసి ॥

తే.గీ. ఇతరముల నిఁక వేనిని నిచ్ఛగించి
తీ వవి చరాచరంబైన యీ జగము స
మస్తమును నా తనువు నంద మసలి యుండ
నిపుడు చూడు గుడాకేశ యెసక మెసఁగ 7.

నా దేహము నందునే సమస్తమైన చరాచర ప్రపంచమును మఱియునీవు జూడఁ
గోరినవి జూడుము.

న తు మాం శక్యసే ద్రష్టుమనేనైవ స్వచక్షుషా ।
దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగమైశ్వరమ్ ॥

తే.గీ. చూడఁ జాల వీ కన్నుల తోడ నీవు
నన్ను నర్జున దివ్యంపుఁ గన్ను లే నొ
సంగు చుంటి నీకు నిపుడు సక్కఁగ నిఁకఁ
జూడు నా దివ్య యోగముఁ జోద్యముగను 8.

అర్జునా నీ వీ కన్నులతో నన్ను జూడఁ జాలవు, దివ్య చక్షువుల నిచ్చు
చుంటిని నీకు వానితో యీశ్వర సంబంధ మైన నా యోగమును జూడుము.

సఞ్జయ ఉవాచ ।
ఏవముక్త్వా తతో రాజన్మహాయోగేశ్వరో హరిః ।
దర్శయామాస పార్థాయ పరమం రూపమైశ్వరమ్ ॥

సంజయుని పలుకులు:

తే.గీ. పల్కి యిట్లు మహాయోగి వరుఁడు మధ్వ
రి హరి రాజ పార్థు కొఱకు రహిని తనదు
పరమ మైశ్వర రూపమ్ము భాసురముగఁ
దనరి చూపించె నత్యద్భుతమ్ము నంత 9.

ఈ విధముగా నర్జుననితోఁ బలికి రాజా యోగీశ్వరుఁ డైన హరి దివ్యము
నద్భుతమును బ్రకాశవంతము నైన తన రూపమును జూపెను.

అనేక వక్త్ర నయన మనేకాద్భుత దర్శనమ్ ।
అనేక దివ్యాభరణం దివ్యానేకోద్యతాయుధమ్ ॥

తే.గీ. పెక్కు వక్త్ర నేత్రమ్ములు పెక్కు నక్క
జంపు దర్శనములు ననేకంపు దివ్య
భూషణమ్ము లనేక సముద్య తాయు
ధమ్ము లాదిగ నచ్చటఁ బమ్ముకొనఁగ 10.

అనేకములైన నోళ్లు, కన్నులు, విచిత్రంపు దర్శనములు, దివ్య భూషణము లెత్తి
యుంచిన యాయుధములు గల

దివ్యమాల్యామ్బరధరం దివ్యగన్ధానులేపనమ్ ।
సర్వాశ్చర్యమయం దేవమనన్తం విశ్వతోముఖమ్ ॥

తే.గీ. ఒప్పగు వలువలును దండ లున్న వాని
నింపు కంపు మేఁ బూఁతల పెంపు వాని 11.

వెలుఁగు లన్నియుఁ దగ నిండి వెలయు వాని
నంతఁ జూచు వానిఁ దుది లేనట్టి వాని

యుచితము లైన వస్త్రములు ధరించిన వాని, హారములు, మంచి వాసనల
మైపూతలు గల వాని, నచ్చెరుపైన వాని ననంతుని విశ్వమునంతఁ జూచు వానిని

దివి సూర్యసహస్రస్య భవేద్యుగపదుత్థితా ।
యది భాః సదృశీ సా స్యాద్భాసస్తస్య మహాత్మనః ॥

తే.గీ. ఆకసమున నొక్కుమ్మడి యవతరింప
వేల సూర్యులు ప్రసరించు వెలుగున కగు
నమ్మహాత్ముని దివ్య దేహప్రభాస
పటలము సమాన మెన్నఁగ భవ్యముగను 12.

ఆకాశమున నొక్క పరి వేల సూర్యు లుదయించినఁ గల్గు కాంతికి సమానమైన దేహ
కాంతి కలవానిని

తత్రైకస్థం జగత్కృత్స్నం ప్రవిభక్తమనేకధా ।
అపశ్యద్దేవదేవస్య శరీరే పాణ్డవస్తదా ॥

తే.గీ. బహు విధమ్ముల సమ్యగ్విభక్త మయిన
జగతి నెల్ల నొక్కెటఁ జూచె సవ్యసాచి
దేవ దేవుని పావన దేహ మందుఁ
బాండు నందనుండు వెఱఁగు పడుచు నపుడు 13.

అర్జునుఁడు వివిధ విధములైన వేఱువేఱుగా నున్న జగములు నన్నింటిని దేవ
దేవుని దేహ మందు నొక్క చోట నుండ నాశ్చర్యపడుచుఁ జూచెను.

తతః స విస్మయావిష్టో హృష్టరోమా ధనఞ్జయః ।
ప్రణమ్య శిరసా దేవం కృతాఞ్జలి రభాషత ॥

తే.గీ. అంత విస్మ యావృత హృదయమ్మునఁ బుల 14.

కాంకితుఁడు ధనంజయుఁడు కృతాంజలుఁ డయి
శిరసు వంచి నమస్కరించి పలికెఁ గడు
వినయముగ దేవదేవుని కని ముదమున

అంత నర్జునుఁ డాశ్చర్యముతో నొడలున గగుర్పాటు కలుగఁగ నంజలి ఘటించి శిరస్సు వంచి నమస్కరించి వినయముతో దేవ దేవునిఁ జూచి సంతోషముగ నిట్లు పలికెను.

అర్జున ఉవాచ ।
పశ్యామి దేవాంస్తవ దేవ దేహే సర్వాంస్తథా భూతవిశేషసఙ్ఘాన్ ।
బ్రహ్మాణమీశం కమలాసనస్థమృషీంశ్చ సర్వానురగాంశ్చ దివ్యాన్ ॥

అర్జునుని పలుకులు:

తే.గీ. దేవ చూచు చుంటి నిట నీ దేహమందు
దేవతల నెల్ల భూత తతిని సమస్త
మును ద్రుహిణుఁ గమలాసను మునుల నురగ
ములను దివ్యములను నీశు నలరి యుండ 15.

దేవా నీ దేహమునఁ దనరుచుండ నెల్ల దేవతలను, భూత రాశినిఁ, గమలాసనఁ డైన బ్రహ్మను, మునులను, దివ్యము లైన పన్నగములను, శంకరునిఁ జూచు చున్నాను.

అనేకబాహూదరవక్త్రనేత్రం
పశ్యామి త్వాం సర్వతోఽనన్తరూపమ్ ।
నాన్తం న మధ్యం న పునస్తవాదిం
పశ్యామి విశ్వేశ్వర విశ్వరూప ॥

తే.గీ. పెక్కు కన్నులఁ బొట్టలఁ బెక్కు ముఖము
లను ననంత రూపమ్ములఁ దనరఁ జూచు
చుంటి నాది మధ్యాంతము లంట లేక
విశ్వరూప విశ్వేశ్వర వింత నిన్ను 16.

అనేకము లైన కన్నులు, పొట్టలు, ముఖములు, నంతము లేని రూపముల నాది మధ్యాంతములు లేనివి విశ్వరూపా విశ్వేశ్వరా చూచు చుంటిని.

కిరీటినం గదినం చక్రిణం చ
తేజోరాశిం సర్వతో దీప్తిమన్తమ్ ।
పశ్యామి త్వాం దుర్నిరీక్ష్యం సమన్తాద్
దీప్తానలార్కద్యుతిమప్రమేయమ్ ॥

తే.గీ. మకుట ధరునినిఁ జక్రము నిఁక గదయుఁ గ
రములఁ దనరు తేజోమయ రాశిఁ గాంతి
మంతు జన దుర్నిరీక్షు సమంత తాన
లార్క రుచు నప్రమేయు ని న్నరయు చుంటి 17.

కిరీటము, చక్రము, గదాదులను ధరించి నట్టి నిన్ను తేజపురాశినిఁ, గాంతి మంతునిఁ, జూడ శక్యము కాని వాని, రవి యగ్నుల కాంతి గల వాని మేరలేని వానినిఁ జూచు చుంటిని

త్వమక్షరం పరమం వేదితవ్యం
త్వమస్య విశ్వస్య పరం నిధానమ్ ।
త్వమవ్యయః శాశ్వతధర్మగోప్తా
సనాతనస్త్వం పురుషో మతో మే ॥

తే.గీ. నీవు పరమాత్మ వవినాశి వీ వెఱుంగఁ
దగిన వాఁడ వీ జగతి కాధార మైన
వాఁడవు పురాణ పురుషుఁ డవ్యయుఁడ వింక
నిత్య ధర్మ రక్షకుఁడ వని తలఁతు మది 18.

నీవు పరమాత్మవు. అవినాశివి. తెలిసికొనఁ దగిన వాఁడవు. జగత్తున కాధార మైన వాఁడవు. పురాణ పురుషుఁడవు, నిత్యము ధర్మ రక్షకుఁడ వవ్యయుఁడ వని నేను దలఁచెదను.

అనాది మధ్యాన్త మనన్త వీర్య మనన్త బాహుం శశి సూర్య నేత్రమ్ ।
పశ్యామి త్వాం దీప్తహుతాశవక్త్రం స్వతేజసా విశ్వమిదం తపన్తమ్ ॥

తే.గీ. ఆది మధ్యము నంతము నరయ రాని
యంత మెఱుఁగని బలమును హస్తములును
జంద్ర సూర్యు లక్షులుగను జ్వలిత వహ్ని
ముఖము భువి తపించెడి తేజము నిను గంటి 19.

ఆదియు మధ్యము నంతము లేని వాఁడవు, ననంతమైన బలము, బాహువులు,
చంద్రసూర్యులే కన్నులుగాఁ గల, జ్వలించు ముఖము, భూమి మండు తేజమున
నున్న నిన్ను జూచుచుంటిని.

ద్యావాపృథివ్యోరిదమన్తరం హి
వ్యాప్తం త్వయైకేన దిశశ్చ సర్వాః ।
దృష్ట్వాద్భుతం రూపముగ్రం తవేదం
లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్ ॥

తే.గీ. దివి భువుల మధ్య మంతయు దిక్కు లెల్ల
వ్యాప్త మయ్యె నీ చేత మహాత్మ యొక్క
ని వలనను గని భీకరము వెఱఁగు నగు
రూపు జడిసె ముజ్జగములు వేపనమున 20.

మహాత్మా భూమియు నాశము మధ్య నున్న జగ మెల్ల వ్యాపించి యున్నావు.
మిక్కిలి భయంకరము నద్భుత మైన నీ రూపు జూచి ముజ్జగములు భీతితో బాధ
నొందు చున్నవి.

అమీ హి త్వాం సురసఙ్ఘా విశన్తి
కేచిద్భీతాః ప్రాఞ్జలయో గృణన్తి ।
స్వస్తీత్యుక్త్వా మహర్షిసిద్ధసఙ్ఘాః
స్తువన్తి త్వాం స్తుతిభిః పుష్కలాభిః ॥

తే.గీ. సుర గణము సేరు చున్నది విరిసి నిన్ను
భీతిఁ గొంద అంజలు లిడి వేఁడు చుండ
సిద్ధులు మహర్షు లెల్ల స్వస్తి వచనమ్ము
ల స్తుతియించు చున్నారు దళముగ నిన్ను 21.

దేవతలు నిన్ను జేరు చున్నారు. కొందఱు చేతులు ముకుళించి వేఁడు చున్నారు. సిద్ధులు, మహర్షు లెల్ల స్వస్తి వచనములు పలుకు చున్నారు.

రుద్రాదిత్యా వసవో యే చ సాధ్యా
విశ్వేఽశ్వినౌ మరుతశ్చోష్మపాశ్చ ।
గన్ధర్వయక్షాసురసిద్ధసఙ్ఘా
వీక్షన్తే త్వాం విస్మితాశ్చైవ సర్వే ॥

తే.గీ. రుద్రు లాదిత్యులు వసువులు మఱి సాధ్యు
లశ్వినులు విశ్వులు పితరు లసురులును మ
రుత్తు లింకను గంధర్వులు మఱి సిద్ధ
యక్షు లరయు చుండిరి వెఱఁ గంది నిన్ను 22.

ఆశ్చర్యముతో నిన్ను రుద్రులు నాదిత్యులు, వసువులు, సాధ్యులు నశ్వినులు, విశ్వ దేవతలు, పితృదేవతలు, రాక్షసులు, మరుత్తులు, గంధర్వులు, సిద్ధులు మఱియు యక్షులు చూచు చున్నారు.

రూపం మహత్తే బహువక్త్రనేత్రం
మహాబాహో బహుబాహూరుపాదమ్ ।
బహూదరం బహుదంష్ట్రాకరాలం
దృష్ట్వా లోకాః ప్రవ్యథితాస్తథాహమ్ ॥

తే.గీ. నీ మహా రూపము ననేక నేత్ర వక్త్ర
ములు మహాబాహు బహు కరములు బహూరు
పదము లతి భీమ దంష్ట్రలు నుదరముఁ గని
భీతిలితిమి లోకము లేను నీ తఱి నిట 23.

మహాభుజా యీ నీ మహా రూపమును పెక్కు నేత్రములు, తొడలు, పాదములు భయంకరపు దంష్ట్రలు, పొట్ట, మున్నగునవి జూచి లోకములు నేనును భీతిల్లు చున్నాము.

నభఃస్పృశం దీప్తమనేకవర్ణం

వ్యాత్తాననం దీప్తవిశాలనేత్రమ్ ।
దృష్ట్వా హి త్వాం ప్రవ్యథితాన్తరాత్మా
ధృతిం న విన్దామి శమం చ విష్ణో ॥

తే.గీ. తాఁకు చుంటివి యత్యున్నతంపు నభము
వెలుఁగ బహు దీప్త వర్ణము లలరఁ దెఱచి
నట్టి నోళ్లు మండు విశాల మైన కనులుఁ
జూడఁ గృష్ణ ధృతి శమముఁ జూర్ణ మయ్యె 24.

ఆకాశమును దాఁకుచుంటివి. మిక్కిలికాంతితో వెలుగు రంగులు, తెఱచిన నోళ్లు, మండుచున్న కళ్లు సూచుచుండ ధైర్యము శాంతి నశించుచున్నది.

దంష్ట్రాకరాలాని చ తే ముఖాని
దృష్ట్వైవ కాలానలసన్నిభాని ।
దిశో న జానే న లభే చ శర్మ
ప్రసీద దేవేశ జగన్నివాస ॥

తే.గీ. అతి భయంకర దంష్ట్రము లరయఁ బ్రళయ
కాల వహ్నినిభ ముఖముఁ గాన లేను
దిక్కులను గరుణింపుమ దేవ దేవ
నన్ను బొంద సుఖమును జగన్నివాస 25.

దేవదేవా నీ భయంకర మైన దంష్ట్రములను, బ్రళయకాలంపు టగ్ని వంటి ముఖములను జూచిన దిక్కులను జూడ లేకున్నాను. సుఖముగా నుండ లేకున్నాను. జగన్నివాసా కరుణించుము.

అమీ చ త్వాం ధృతరాష్ట్రస్య పుత్రాః
సర్వే సహైవావనిపాలసఙ్ఘైః ।
భీష్మో ద్రోణః సూతపుత్రస్తథాసౌ
సహాస్మదీయైరపి యోధముఖ్యైః ॥

తే.గీ. రాజ సంఘము నీ ధృతరాష్ట్ర తనయు 26.

లు నిఁకఁ గర్ణ భీష్మ ద్రోణులు మఱి స్వీయ
యోధ ముఖ్యులు నుద్దండ యుద్ధ నిపుణ
వీరు లందఱు నిచ్చట వెరఁగు మీఱ

రాజుల గుంపు, ధార్తరాష్ట్రులు, భీష్మ ద్రోణ కర్ణాది పర పక్ష నేతలు, మన వైపు వీరు లందఱు నాశ్చర్యముగా నిచట

వక్త్రాణి తే త్వరమాణా విశన్తి
దంష్ట్రాకరాలాని భయానకాని ।
కేచి ద్విలగ్నా దశ నాన్తరేషు
సన్దృశ్యన్తే చూర్ణితై రుత్త మాఙ్గైః ॥

తే.గీ. చేరు చున్నారు వేగ నీ నోరులు దృఢ
మైన కోఱలఁ గూడి భయమ్ము గొల్పు
వానిఁ గొందఱేఁ బల్లుల వలనఁ బొడి
యైన తలలతోఁ జూతు నే నబ్బురముగ 27.

దృఢమైన కోఱలతో భీతి గొల్పు నీ నోటి లోనికిఁ జేరు చున్నారు. కొందఱు పల్లుల చాటున బొడి యైన తలలతోఁ బడి యున్నారు.

యథా నదీనాం బహవోఽమ్బువేగాః
సముద్రమేవాభిముఖా ద్రవన్తి ।
తథా తవామీ నరలోకవీరా
విశన్తి వక్త్రాణ్యభివిజ్వలన్తి ॥

తే.గీ. చేరు నెవ్విధి వనధిని శీఘ్రముగ న
దీ ప్రవాహము లన్నియు నా ప్రకార
మ నరలోక వీరులు నీదు ఘనముగ జ్వలి
యించు చున్న నోరులఁ బ్రవేశింపఁ గందు 28.

నదీ ప్రవాహము లెల్ల సముద్రమును జేరు విధముగా వీరు లందఱు మిక్కిలి జ్వలించు చున్న నీ నోరులలో ప్రవేశించు చున్నారు.

యథా ప్రదీప్తం జ్వలనం పతఙ్గా విశన్తి నాశాయ సమృద్ధవేగాః ।
తథైవ నాశాయ విశన్తి లోకాస్తవాపి వక్త్రాణి సమృద్ధవేగాః ॥

తే.గీ. మిడుత లన్ని మండెడు నగ్నిఁ గడు వడిఁ దమ
నాశము కొఱక చేరు చందము స్ఫురింప
నిజ వినాశ మేర్పడుటకు నీదు వక్త్ర
ములను జొచ్చు చున్నారు లోకు లిటఁ గృష్ణ 29.

కృష్ణా మిడుత లగ్నిలోఁ జచ్చుటకు దుముకు రీతిఁ దమ తమ నాశనమునకే లోకులు
నీ వక్త్రము లందుఁ దూఱు చున్నారు.

లేలిహ్యసే గ్రసమానః సమన్తా ల్లోకా న్సమగ్రా న్వదనై ర్జ్వలద్భిః ।
తేజోభిరాపూర్య జగత్సమగ్రం భాసస్తవోగ్రాః ప్రతపన్తి విష్ణో ॥

తే.గీ. లోకము లనన్ని మ్రింగఁగ నాకు చుంటి
వీవు మండు చున్నట్టి నీ భీమ వక్త్ర
ములను విష్ణు నీ యుగ్ర కాంతులఁ దపింపఁ
జేయు చుంటివి జగముల సెగలు నింపి 30.

మండుచున్న నీ నోరులచేత లోకముల నన్నింటిని నాకు చున్నావు. నీ భయంకర
మైన వెల్గుల చే జగములను సెగలతోఁ దపింపఁ జేయు చున్నావు.

ఆఖ్యాహి మే కో భవానుగ్రరూపో
నమోఽస్తుతే దేవవర ప్రసీద ।
విజ్ఞాతుమిచ్ఛామి భవన్తమాద్యం
న హి ప్రజానామి తవ ప్రవృత్తిమ్ ॥

తే.గీ. ఉగ్ర రూపమున వెలసి యున్న నీ వె
వరు చెపుమ దేవ శాంతింపు వందనమ్ము
లాది పురుష నే నిన్నరయంగ నిచ్ఛ
గింతు నెఱుఁగ నీ వర్తన మింత యేని 31.

ఉగ్ర రూపములో నున్న నీ వెవరవు దేవా? శాంతింపుము. ఆదిపురుషా వందనములు. నిన్నెఱుగఁ గోరు చున్నాను. నీ వర్తన మింతయు నెఱుగను.

శ్రీభగవానువాచ ।
కాలోఽస్మి లోకక్షయకృత్ప్రవృద్ధో
లోకాన్సమాహర్తుమిహ ప్రవృత్తః ।
ఋతేఽపి త్వాం న భవిష్యన్తి సర్వే
యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః ॥

శ్రీభగవానుని పలుకులు:

తే.గీ. లోక సంహారకుండను వీఁక వృద్ధి
చెంది నట్టి కాలుండను జేయ లోక
లయము వర్తింతు శత్రునిచయపు యోధు
లెల్ల నుండరు లేకున్న నీవు పార్థ 32.

పార్థా నేను లోక సంహారకుఁడను వృద్ధి చెందు చున్నట్టి యముఁడను. లోకములను లయ మొనరించుటకునై వర్తింతును. ఈ శత్రు వీరు లెవ్వరు నీవు లేకపోయినను (యుద్ధము చేయక పోయినను) బ్రతుకరు.

తస్మాత్త్వముత్తిష్ఠ యశో లభస్వ
జిత్వా శత్రూన్ భుఙ్క్ష్వ రాజ్యం సమృద్ధమ్ ।
మయైవైతే నిహతాః పూర్వమేవ
నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్ ॥

తే.గీ. అందు వలన లెమ్మిఁక నీవు పొందు యశము
గెల్చి పరులను రాజ్య భోగి వయి చెలఁగు
మిచ్చ టెల్లరు నాచేతఁ జచ్చిరి మును
పు గనుక నిమిత్త మాత్రుఁడ వగుమ ధన్వి 33.

అర్జునా కావున లెమ్ము జయమును బొంది కీర్తిని గడించి రాజ్య సుఖము లనుభవింపుము. వీరు నా చే మున్ను చచ్చిన వారే. నీవు నిమిత్త మాత్రుఁడవు.

ద్రోణం చ భీష్మం చ జయద్రథం చ
కర్ణం తథాన్యానపి యోధవీరాన్ ।
మయా హతాంస్త్వం జహి మా వ్యథిష్ఠా
యుధ్యస్వ జేతాసి రణే సపత్నాన్ ॥

తే.గీ. ద్రోణ భీష్ములును జయద్రథుండు కర్ణుఁ
డింక నన్య యోధులు వీరులెల్ల మన్ని
హతుల హతమార్చు వలదు నీ కటమటమ్ము
సమర మొనరింపు గెల్తువు శత్రువులను 34.

భీష్మ ద్రోణ కర్ణ జయద్రథాది వీరు లెల్లరను నా చే జంపఁ బడిన వారిని నీవు చంపుము. చింత వలదు. యుద్ధము చేయుము. శత్రువులను గెల్తువు.

సఞ్జయ ఉవాచ ।
ఏతచ్ఛ్రుత్వా వచనం కేశవస్య
కృతాఞ్జలిర్వేపమానః కిరీటీ ।
నమస్కృత్వా భూయ ఏవాహ కృష్ణం
సగద్గదం భీతభీతః ప్రణమ్య ॥

సంజయుని పలుకులు:

తే.గీ. విని కిరీటి యీ కేశవు మినుకు లెల్ల
నంజలు లిడుచు వణఁకుచు నంత దా న
మస్కరించి గద్గదముగ మఱలఁ బల్కె
నమ్రుఁడై కృష్ణు వీక్షించి నరుఁడు భీతి 35.

కేశవుని యీ పల్కులు విని యర్జునుఁడు చేతులు మొగిడ్చి వణఁకుచు నమస్కరించి గద్గద స్వరముతోఁ గృష్ణునిఁ జూచుచు వినమ్రుఁడై భయముతో నిట్లు పలికెను.

అర్జున ఉవాచ ।
స్థానే హృషీకేశ తవ ప్రకీర్త్యా
జగ త్ప్రహృ ష్యత్యను రజ్యతే చ ।

రక్షాంసి భీతాని దిశో ద్రవన్తి
సర్వే నమస్యన్తి చ సిద్ధ సఙ్ఘాః ॥

అర్జునుని పలుకులు:

తే.గీ. నీ మహాత్మ్యమున జగతి నెమ్మి నున్న
ది యనురక్తి హృషీకేశ దిశల నెల్లఁ
బాఱుచున్నారు దైత్యులు భయము చేతఁ
జేయుచున్నారు ప్రణతులు సిద్ధులు దగ 36.

హృషీకేశా నీ మహత్తుచే జగత్తు సంతోషమునఁ బ్రేమతో నున్నది. దైత్యులు భయముతో దిక్కులకుఁ బాఱుచున్నారు. సిద్ధులు ప్రణతుల నొసంగు చున్నారు.

కస్మాచ్చ తే న నమేరన్మహాత్మన్
గరీయసే బ్రహ్మణోఽప్యాదికర్త్రే ।
అనన్త దేవేశ జగన్నివాస
త్వమక్షరం సదసత్తత్పరం యత్ ॥

తే.గీ. ఏల నీకు నమస్కృతు లీయ రట మ
హాత్మ ఘనుఁడ వనంత బ్రహ్మకును మూల
మీవు స త్తసత్తుల కిల నెక్కు వయిన
యక్షర జగన్నివాస దేవాధిదేవ 37.

దేవా మహాత్మా నీ కేల నమస్కరింపరు? ఘనుఁడవు, బ్రహ్మకు మూల మీవు, సత్తు నసత్తులకు మిన్న వనంతా యక్షరా జగన్నివాసా.

త్వమాదిదేవః పురుషః పురాణస్త్వమస్య విశ్వస్య పరం నిధానమ్ ।
వేత్తాసి వేద్యం చ పరం చ ధామ త్వయా తతం విశ్వ మనన్త రూప ॥

తే.గీ. ఆది దేవుఁడ వీవు మహా పురాణ
పురుషుఁడవు నిధానము విశ్వమునకు విజ్ఞుఁ
డవు పరంధాముఁడవు వేద్యుఁడవు ననంత 38.

రూప వ్యాపించె విశ్వము ప్రోవ నీవు

అనంతరూపా నీ వాది దేవుఁడవు, పురాణ పురుషుఁడవు, విశ్వమునకు నిధాన మైన వాఁడవు, విజ్ఞుఁడవు, వేదము లెఱిఁగిన వాఁడవు. నీవు కాచు చుండ విశ్వము వ్యాప్త మయ్యెను.

వాయుర్యమోఽగ్నిర్వరుణః శశాఙ్కః
ప్రజాపతిస్త్వం ప్రపితామహశ్చ ।
నమో నమస్తేఽస్తు సహస్రకృత్వః
పునశ్చ భూయోఽపి నమో నమస్తే ॥

తే.గీ. నీవ వాయువు యముఁడవు నిప్పు వరుణుఁ
డవును జంద్రుఁడవు ప్రజాపతివియు మఱియు
నెంచ ముత్తాతవును వేయి మించి వంద
నమ్ములు మఱల మఱల ప్రణతులు నీకు 39.

నీవ వాయుఁడవు, యముఁడవు, నగ్నివి, వరుణుఁడవు, చంద్రుఁడవు ప్రజాపతి యగు బ్రహ్మవు, బ్రహ్మకుఁ దండ్రివి. నీకు వేలకు మించి వందనములు. మఱల మఱల నమస్కరించు చున్నాను.

నమః పురస్తాదథ పృష్ఠతస్తే
నమోఽస్తుతే సర్వత ఏవ సర్వ ।
అనన్త వీర్యామిత విక్రమ స్త్వం
సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః ॥

తే.గీ. ముందు వెనుకయు దండము లందు కొనుమ
యన్ని వైపుల నుండియు నంజ లింతు
నపరిమిత విక్రముండ వనంత వీర్యుఁ
డ వడరుదు వంతటను సర్వుఁడ వనఁగఁ జను 40.

అనంత వీర్యా యపరిమిత విక్రమా నీకు ముందు నుండి వెనుక నుండియు నన్ని వైపుల నుండియు నమస్కరింతును. నీ వంతటను వ్యాపించి యుండుటచే సర్వుఁడ వైతివి.

సఖేతి మత్వా ప్రసభం యదుక్తం
హే కృష్ణ హే యాదవ హే సఖేతి ।
అజానతా మహిమానం తవేదం
మయా ప్రమాదాత్ప్రణయేన వాపి ॥

తే.గీ. సఖుఁడ వని యెంచి నే నలక్ష్యముగ నేది
పల్కితినొ నీదు మహిమను జుల్కనగ న
రసి ప్రమాదమునను మఱి ప్రణయమునను
హా సఖా యాదవా కృష్ణ యంచు వాని 41.

చెలికాఁడ వని తలఁచి నేఁ బలికిన పలుకులను, నీ మహిమను జుల్కన సేసి పలికినవి, పొరపాటున స్నేహమున హా సఖా , యాదవా, కృష్ణా యంచు ననిన పల్కులను

యచ్చావహాసార్థమసత్కృతోఽసి
విహారశయ్యాసనభోజనేషు ।
ఏకోఽథవాప్యచ్యుత తత్సమక్షం
తత్క్షమయే త్వామహమప్రమేయమ్ ॥

తే.గీ. అచ్యుత విహారముల శయ నాసనముల
భోజనము లందుఁ బరిహాసముగను నీ స
మక్షమునఁ జాటునఁ బరులం బల్కి నట్టి
వెల్ల నప్రమేయ క్షమింపు మెల్లిదముల 42.

అచ్యుతా విహారములలోన, శయ్యలందు, నాసనముల, భోజన సమయములఁ, బరిహాసముగ నీ యెదుట గాని జాటున గాని బరుల యెదుట నైనఁ బల్కిన చులకన పలుకులను క్షమించు మప్రమేయా.

పితాసి లోకస్య చరాచరస్య
త్వమస్య పూజ్యశ్చ గురుర్గరీయాన్ ।
న త్వత్సమోఽస్త్యభ్యధికః కుతోఽన్యో
లోకత్రయేఽప్యప్రతిమప్రభావ ॥

తే.గీ. ఈ చరాచర జగమున కీవ తండ్రి
పరమ పూజ్యుడఁవును గొప్ప వాడఁవు గురు
వును సముఁడు నధికుఁడు లేఁడు గనఁగ ముజ్జ
గముల నప్రతిమప్రభావ మఱి నీకు 43.

చరాచరపు జగత్తునకు నీవ తండ్రివి. పరమ పూజ్యుఁడవు. గొప్ప వాఁడవు. గురుఁడవు ముజ్జగము లందు నీ కధికుఁడు సముఁడును లేఁడు. అసమాన మైన ప్రభావము కలవాఁడవు.

తస్మాత్ప్రణమ్య ప్రణిధాయ కాయం
ప్రసాదయే త్వామహమీశమీడ్యమ్ ।
పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః
ప్రియః ప్రియాయార్హసి దేవ సోఢుమ్ ॥

తే.గీ. కావున నమస్కరింతును గాయ మెల్ల
వంచి యీశ వంద్య యనుగ్రహించి నన్ను
గొడుకుఁ దండ్రి వలె సఖు సఖు వలె బ్రియను
బ్రియుని వలె సహింపఁ దగుదు పేర్మి దేవ 44.

కావున శరీరము వంచి నమస్కరింతును. పూజనీయా యనుగ్రహింపుము. కొడుకును దండ్రి వలె, మిత్రుని సఖుని వలె, సఖిని ప్రియుని వలెఁ బేర్మితో నన్ను సహింపుము.

అదృష్టపూర్వం హృషితోఽస్మి దృష్ట్వా
భయేన చ ప్రవ్యథితం మనో మే ।
తదేవ మే దర్శయ దేవ రూపం
ప్రసీద దేవేశ జగన్నివాస ॥

తే.గీ. మున్ను జూడని యాకృతి నిన్ను జూడ
సంతసం బయ్యె భయ మంది యంతరంగ
మందు నుంటిఁ జూపుమ నీదు ముందు రూప 45.

మిఁక నిట జగన్నివాస దేవేశ దయను

మునుపు జూడని రూపమున నిన్ను జూచిన సంతసము కల్గెను. భయము నా యంతరంగమున నిండినది. దేవదేవా జగ దావాస నీ ముందటి రూపమునే చూపుము.

కిరీటినం గదినం చక్రహస్తం
ఇచ్ఛామి త్వాం ద్రష్టుమహం తథైవ ।
తేనైవ రూపేణ చతుర్భుజేన
సహస్రబాహో భవ విశ్వమూర్తే ॥

తే.గీ. మకుటము గద లడరఁగ నీదు కర మందుఁ
జక్ర ముండు రూపంబ యిచ్చ గలదు కన
నట్లయ సహస్రబాహు నీ వగు చతుర్భు
జునిగ విశ్వమూర్తి కరుణ సురుచిరముగ 46.

ఓ సహస్ర బాహూ కిరీటము, గద, చక్రము లుండు రూపము చూచుట యందే నాకు నిచ్చ గలదు నాల్గు భుజములతో నున్న యట్టి రూపమునే విశ్వ మూర్తీ దయతోఁ జూపుము.

శ్రీభగవానువాచ ।
మయా ప్రసన్నేన తవార్జునేదం
రూపం పరం దర్శితమాత్మయోగాత్ ।
తేజోమయం విశ్వమనన్తమాద్యం
యన్మే త్వదన్యేన న దృష్టపూర్వమ్ ॥

శ్రీభగవానుని పలుకులు:

తే.గీ. చూపితిఁ బ్రసన్నత నపూర్వ రూపము పర
మ మ్మదృష్ట పూర్వము విశ్వ మయ మనంత
మాద్య మాత్మ యోగమ్మున నర్జున యిట
దీనిఁ దేజో మయమ్మును నేను నీకు 47.

అనంతము నాద్యము విశ్వ మయము మున్ను జూడనిది తేజస్వంత మైన యట్టి
యపూర్వ రూపమును నా యోగమున నర్జున నీకుఁ బ్రీతినిఁ జూపితిని.

న వేదయజ్ఞాధ్యయ నై ర్న దానైర్ న చ క్రియాభి ర్న తపోభి రుగ్రైః ।
ఏవం రూపః శక్య అహం నృలోకే ద్రష్టుం త్వదన్యేన కురుప్రవీర ॥

తే.గీ. చదువ శ్రుతులు సేయంగ యజ్ఞములు దాన
ములు క్రియలు నుగ్రతర తపముల నెవరును
నర జగతి నీవు దక్కఁగ నాదు విశ్వ
రూప మరయంగ లేరు కురుప్రవీర 48.

అర్జునా వేదములు చదివినను, యజ్ఞములు సేసినను, దానములు, తపములు
చేసిన నెవ్వరును నీవు దక్క జగతి లో నా యీ విశ్వ రూపమును జూడ లేరు.

మా తే వ్యథా మా చ విమూఢభావో
దృష్ట్వా రూపం ఘోరమీదృఙ్మమేదమ్ ।
వ్యపేత భీః ప్రీతమనాః పునస్త్వం
తదేవ మే రూప మిదం ప్రపశ్య ॥

తే.గీ. భీతిఁ జెందకు క్షోభము వీడు చూడ
ఘోర మైన నారూప మపార తృప్తి
వీత భీతి నీవు మఱలఁ బాత దైన
నాదు రూపము దర్శింపు నయము గాను 49.

నా యపార మైన ఘోర రూపమును జూచి భీతి చెందకు. దుఃఖము వీడుము. తిరిగి
నా పాత రూపమును భీతి వీడి చూడుము.

సఞ్జయ ఉవాచ ।
ఇత్యర్జునం వాసుదేవ స్తథోక్త్వా
స్వకం రూపం దర్శయామాస భూయః ।
ఆశ్వాసయామాస చ భీత మేనం
భూత్వా పునః సౌమ్యవపు ర్మహాత్మా ॥

సంజయుని పలుకులు:

తే.గీ. పలికి యిట్టు లర్జును తోడ వాసుదేవుఁ
డంతఁ జూపించె నిజ రూప మతని కింకొ
కపరి యాశ్వసించె మఱియు కరము భీతుఁ
జూపి మఱల సౌమ్య తనువు సుందరముగ 50.

కృష్ణుఁ డిట్లు పలికి యర్జుననితోఁ దన సౌమ్యపు రూపమును దిరిగి చూపించెను.
మఱియొక సారి యర్జునుని ననునయించెను.

అర్జున ఉవాచ ।
దృష్ట్వేదం మానుషం రూపం తవ సౌమ్యం జనార్దన ।
ఇదానీమస్మి సంవృత్తః సచేతాః ప్రకృతిం గతః ॥

అర్జునుని పలుకులు:

తే.గీ. మనుజ రూపము గాంచి సౌమ్యతమ మిచటఁ
గుదుట పడె జనార్దన నాదు మది సుఖముగ
నిపుడు నీదైన యాకృతినిఁ బడసితి స
హజపు స్వీయ భావమ్ము నియ్యవసరమున 51.

సౌమ్య తర మైన మానుష రూపమును జూచి నా మనస్సు కుదుట పడెను. జనార్దన
నీ యాకృతి జూచి నా సహజ స్థితినిఁ బడసితిని.

శ్రీభగవానువాచ ।
సుదుర్దర్శమిదం రూపం దృష్టవానసి యన్మమ ।
దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శనకాఙ్క్షిణః ॥

శ్రీభగవానుని పలుకులు:

తే.గీ. చూచి నట్టి వాఁడ వయితి చూడ దుర్ల
భంపు నారూప మర్జున యింపు గొలుప
దేవతలు గూడ నిత్యము దివ్యమైన
యట్టి యీరూపుఁ గోరుదు రరయ నెలమి 52.

అర్జునా దుర్లభ మైన నా రూపమును జూచితివి. దేవత లెల్లప్పుడు దివ్య మైన యీ
రూపమును జూడ గోరుదురు.

నాహం వేదైర్న తపసా న దానేన న చేజ్యయా ।
శక్య ఏవంవిధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా ॥

తే.గీ. నన్ను నెవ్విధిఁ జూచితి చెన్ను మీఱ
నిచట నవ్విధిఁ గాంచ లే రెవరును మఱి
తపములను వేదముల నీఁక దానములను
యజ్ఞముల నాచరించుచు నైన నన్ను 53.

అర్జునా నన్ను నీ వే రీతి జూచితివో యా విధమునఁ దపములు, వేదముల వలనను,
దానములు యజ్ఞముల వలనను గాంచ లేరు.

భక్త్యా త్వనన్యయా శక్య అహమేవంవిధోఽర్జున ।
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరన్తప ॥

తే.గీ. అర్జున యనన్య భక్తియ యవసరమ్ము
నాదు రూపు యథార్థమునఁ గన వలయు
నన్న నెఱుఁగ వలయు నన్న నన్ను నింకఁ
జేరుటకును బరంతప తోరముగను 54.

అర్జున నా రూపమును యథార్థముగఁ జూడ వలె నన్న నెఱుఁగవలె నన్నను,
జేరుకొన వలె నన్న ననన్యమైన భక్తి కావలయును.

మత్కర్మ కృన్మత్పరమో మద్భక్తః సఙ్గ వర్జితః ।
నిర్వైరః సర్వభూతేషు యః స మామేతి పాణ్డవ ॥

తే.గీ. ఎవఁడు పాండవ నాకొఱకే పనులను
జేయు రక్తుఁడు నాయం దమేయ భక్తుఁ
డగును నాకు నిస్సంగుఁడు నగును భూత 55.

ములకు గాఁడు శత్రువు వాఁడ వొందు నన్ను

పాండవా యెవఁడు నాకొఱకే పనులను జేయును, నా యందే రక్తి నుంచును, నాకు భక్తుఁ డగును, వీడు నాశలను, భూతములకు శత్రువు కాఁడో వాఁడు మాత్రమే నన్ను బొందును.

ఇది శ్రీకృష్ణ సూక్తి సుధాకరమను శ్రీమదాంధ్ర భగవద్గీత యందు విశ్వ రూప సందర్శన యోగమను పదునొకండవ యధ్యాయము.

పోచిరాజు కామేశ్వర రావు నామధేయ ప్రణీతము.

శ్రీకృష్ణాయ నమః

# శ్రీకృష్ణ సూక్తి సుధాకరము

మూలము శ్రీమద్భగవద్గీత

## అధ్యాయము పంద్రెండు – భక్తి యోగము

అర్జున ఉవాచ ।
ఏవం సతతయుక్తాయే భక్తాస్త్వాం పర్యుపాసతే ।
యే చాప్యక్షరమవ్యక్తం తేషాం కే యోగవిత్తమాః ॥

అర్జునుని పలుకులు:

తే.గీ. నిన్ను నిత్యము మది నందు నెమ్మి నుంచి
భక్తి సేవించు వారి నవ్యక్తు నక్ష
రు మది సేవించు వారిలోన మఱి యోగ
ము నెఱిఁగిన వా రెవరు తెలుపుమ ముకుంద 1.

కృష్ణా నిత్యము నిన్ను చిత్తమున భక్తితో సేవించువారి లోను, నవ్యక్తుఁడు నవినాశుఁడు
నైన వానినిఁ బూజించు వారిలో నెవరు నిజముగా యోగమును దెలిసిన వారో
చెప్పుము.

శ్రీభగవానువాచ ।
మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తాఉపాసతే ।
శ్రద్ధయా పరయోపేతాః తే మే యుక్తతమా మతాః ॥

శ్రీభగవానుని పలుకులు:

తే.గీ. మనసు నా యంద నిలిపి నన్నవరతము
దగిలి యుత్తమ మైన శ్రద్ధను వహించి
భక్తి సేవించు వారలు పరము లంచు
యుక్తు లందు నని తలంతు యుక్తముగను 2.

మనస్సును నా యందే నిలిపి మంచి శ్రద్ధను దాల్చి భక్తితో నన్ను రక్తితోఁ బూజించు
వారు యోగు లందు నుత్తములని తలఁచెదను.

యే త్వక్షరమనిర్దేశ్యమవ్యక్తం పర్యుపాసతే ।
సర్వత్రగమచిన్త్యఞ్చ కూటస్థమచలన్ధ్రువమ్ ॥

తే.గీ. ఎవరు సేవింత్రు చెప్ప నలవియ కాని
తెలియ రాని దానిని నంత వెలసి దలఁపఁ
దరము గాని కదలకుండు దాని నిచ్చ
లుండి మాఱని బ్రహ్మము నుత్తమముగ 3.

చెప్పఁ దరము కాని దానినిఁ, దెలియ రాని దానిని, నంతట నున్న దానినిఁ, దలఁప
రాని దానినిఁ, గదలని దానిని,  నిత్య మైన దానినిఁ, గూటస్థ మైన మాఱని బ్రహ్మము
నెవరు సేవింతురో

సన్నియమ్యేన్ద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః ।
తే ప్రాప్నువన్తి మామేవ సర్వభూతహితే రతాః ॥

తే.గీ. వా రణఁచి యింద్రియములను బన్నుగ మఱి
కలిగి సమబుద్ధి నన్నిటఁ గరము ప్రీతి
సర్వ భూతముల హితము సలుపు టందు
మనసు నుంచఁ జేరుదురు కొమరున నన్న 4.

వారు తమ యింద్రియమ్ముల నణఁచి యన్నిట సమ బుద్ధి కలిగి, ప్రీతితో
భూతములకు మేలు చేయుటను మనస్సులో చింతింప నన్ను జేరుకొందురు.

క్లేశోఽధికతరస్తేషామవ్యక్తాసక్తచేతసామ్ ।
అవ్యక్తాహి గతిర్దుఃఖం దేహవద్భిరవాప్యతే ॥

తే.గీ. ఎవరి కవ్యక్తమున రక్తి యేర్పడిన మ
నమ్ము కల్గును గష్ట తరమ్ము సుమ్ము
వారి కవ్యక్త గతి దుఃఖ కారకమ్ము 5.

వొందుదురు దాని దేహులు పూని కరము

అవ్యక్త మైన దానిపై రక్తి యున్న వారికి నవ్యక్త గతి పొందుట కష్టము దుఃఖ కారకమును. దేహ మందు నాసక్తి కల వారికి నతి ప్రయత్నమున నది లభించు చున్నది.

యే తు సర్వాణి కర్మాణి మయి సంన్యస్య మత్పరాః ।
అనన్యేనైవ యోగేన మాం ధ్యాయన్త ఉపాసతే ॥

తే.గీ. ఎవరు నాయంద కర్మము లెల్ల నుంచి
నెమ్మి నన్నాశ్రయించి నిత్య మ్మనన్య
యోగమున నన్ను ధ్యానించు చుండి మదిని
నంచితమగు భక్తిని నుపాసించు చుంద్రు 6.

ఎవ్వరు కర్మము లన్నియు నా కర్పించి, నన్నాశ్రయించి, యేకాంత యోగమున నన్ను ధ్యానించి భక్తి తో నుపాసింతురో

తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్ ।
భవామి నచిరాత్పార్థ మయ్యావేశితచేతసామ్ ॥

తే.గీ. వారికి మనసు నాయం దపార ముంచి
నట్టి వారికి నుద్ధర్త నగుదు నచిర
ముగఁ దివిరి మృత్యు సంసార భూరి సాగ
రమ్ము నుండి రక్షింపఁగ నెమ్మి పార్థ 7.

పార్థా వారికి నా యందు నపారముగా మనస్సు నుంచిన వారికి నుద్ధరించు వాని నగుదును. శీఘ్రముగా మృత్యు రూపపు సంసార సాగరము నుండి రక్షింతును.

మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ ।
నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః ॥

తే.గీ. ఉంచుము మనసు నాయంద మించి బుద్ధిఁ 8.

బఱపు నాయందుఁ బిమ్మటఁ బరఁగి నీవు
చక్కఁగ నివసింపఁ గలవు సంశయమ్ము
లేక నాలోన నర్జున ప్రాకటముగ

అర్జునా బుద్ధిని మనస్సును నా యందే యుంచుము. అప్పుడు నీవు
నిస్సంశయముగ నా లోనసే యుండ గలవు.

అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయి స్థిరమ్ ।
అభ్యాసయోగేన తతో మామిచ్ఛాప్తుం ధనఞ్జయ ॥

తే.గీ. స్థిరముగ నిలుప మనమందుఁ గర మశక్య
మైన నన్ను ధనంజయ యంతఁ గోరు
మింక నభ్యాస యోగము నెంచి నన్ను
బొంద నింపుగ దృఢ మతి చంద మొప్ప 9.

నా యందు స్థిరముగా నీ మనస్సును నిలుప నశక్య మైన నభ్యాస యోగమున దృఢ
చిత్తముతో నన్ను బొందుటను గోరుము.

అభ్యాసేఽప్యసమర్థోఽసి మత్కర్మపరమో భవ ।
మదర్థమపి కర్మాణి కుర్వన్సిద్ధిమవాప్స్యసి ॥

తే.గీ. అబ్బెసమునందుఁ గూడను నబ్బురముగ
మఱియు నసమర్థుఁడ వగు సమయము నందు
నా నిమిత్తపుఁ బనులందుఁ బూను మడర
నాదు పనుల ఫలమ్ము దనరును నీకు 10.

అభ్యాసము చేసిన నసమర్థుఁడ వైనచో నా నిమిత్తపుఁ బనుల యందు
నుద్యమింపుము. నా కొఱకుఁ బనులు చేసినను సిద్ధినిఁ బొందఁ గలవు.

అథైతదప్యశక్తోఽసి కర్తుం మద్యోగమాశ్రితః ।
సర్వకర్మఫలత్యాగం తతః కురు యతాత్మవాన్ ॥

తే.గీ. ఇదియుఁ జేయ నశక్తుఁడ వేని నాదు
యోగ మాశ్రయించుచు నిఁక నుచిత రీతి
నింద్రియ నియమ మొనరించి యెలమి కర్మ
చయ ఫలత్యాగ మొనరింపు సవ్యసాచి 11.

ఇది కూడ నశక్య మైన నర్జునా నా యోగము నాశ్రయించి, యింద్రియములను నియంత్రించి, ముదముతోఁ గర్మముల ఫలము లందు నాశను వీడుము.

శ్రేయో హి జ్ఞానమభ్యాసాజ్జ్ఞానాద్ధ్యానం విశిష్యతే ।
ధ్యానాత్కర్మఫలత్యాగస్త్యాగాచ్ఛాన్తిరనన్తరమ్ ॥

తే.గీ. జ్ఞాన మభ్యాసమునకు మిన్న యగుఁ జుమ్మి
మిన్న ధ్యానము జ్ఞానము కన్న ధ్యాన
మునకుఁ గర్మ ఫలత్యాగము కడు గొప్ప
త్యాగ మిచ్చును శాంతిఁ బిదపఁ జెలంగి 12.

జ్ఞాన మభ్యాసమున కెక్కువ, జ్ఞానముకన్న ధ్యానము మిన్న, ధ్యానమునకుఁ గర్మ ఫల త్యాగము గొప్ప. దాని వలన శాంతి లభించును.

అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ ।
నిర్మమో నిరహఙ్కారః సమదుఃఖసుఖః క్షమీ ॥

తే.గీ. సర్వ భూతమ్ము లందు ద్వేషమ్ము లేని
వాఁడు దయగల వాఁడును బరమ సఖుఁడు
రాగ తాపములు దెలియ రాని వాఁడు
సముఁడు సుఖదుఃఖముల యందు సహన శీలి 13.

భూతము లందు ద్వేషము లేని వాఁడు దయ గల వాఁడు స్నేహము చూపు వాఁడు, రాగము లేని వాఁడు, కోపము లేని వాఁడు, సుఖ దుఃఖము లందు సమానుఁడు సహనము గల వాఁడు

సన్తుష్టః సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః ।

మయ్యర్పితమనోబుద్ధిర్యో మద్భక్తః స మే ప్రియః ॥

తే.గీ. నిత్య తృప్తుఁడు యోగియు నిగ్రహంపు
టాత్మ గలవాఁడు దృఢ నిశ్చయమ్ము వాఁడు
నాకు భక్తుఁడు నాయంద నయపు బుద్ధి
యమరి నట్టి వాఁడును బ్రియుఁ డగును నాకు 14.

నిత్యము తృప్తి నొందు వాఁడు, యోగి, నిగ్రహింపఁ బడిన మనస్సు గలవాఁడు, దృఢ నిశ్చయుఁడు, నా యందు భక్తి యున్నవాఁడు, నా యందు బుద్ధి నుంచిన వాఁడు నాకుఁ బ్రియుఁ డగును.

యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతే చ యః ।
హర్షామర్షభయోద్వేగైర్ముక్తో యః స చ మే ప్రియః ॥

తే.గీ. ఎవని వలన భయపడదొ యీ జగమ్ము
లోకము వలన నెవ్వఁ డులుకక యుండు
ముదము కోపము నుద్వేగమును భయమును
వీడు నాతఁడు నాకతి ప్రీతుఁ డగును 15.

ఈ జగ మెవరి వలన భయపడదొ, లోకము వలన నెవఁడు భయపడఁడొ సంతోషము, క్రోధము, భయము నుద్వేగముల నుండి యెవఁడు ముక్తుఁ డగునో వాఁడు నాకుఁ బ్రియుఁడు.

అనపేక్షః శుచిర్దక్ష ఉదాసీనో గతవ్యథః ।
సర్వారమ్భపరిత్యాగీ యో మద్భక్తః స మే ప్రియః ॥

తే.గీ. ఎవ్వఁ డాపేక్ష లేని వాఁ డింక శుచియు
దక్షుఁడు నుదాసియు మఱి వెతలఁ గడచిన
వాఁడు గర్వము లుడిగిన వాఁడు నాదు
భక్తుఁ డైన వాఁడు ప్రియుఁడు వాఁడు నాకు 16.

ఆపేక్ష లేని వాఁడు, శుచియైన వాఁడు, దక్షుఁడు, నుదాసీనుఁడు, దుఃఖ ముడిగిన

వాఁడు, గర్వము లేని వాఁడు, భక్తుఁ డైన వాఁడు నాకు బ్రియుఁడు.

యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాఙ్క్షతి ।
శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్యః స మే ప్రియః ॥

తే.గీ. ఎవఁడు మురియఁడు పగఁ గొనఁడు వగవండు
కోరఁ డెద్దియు శుభములకు నశుభముల
కుండు దూరము నిత్యము నుండు భక్తి
దనరి యాతఁడు ప్రియుఁ డంచితముగ నాకు 17.

మురియని వాఁడు, పగ లేని వాఁడు, శోకింపని వాఁడు, దేనిఁ గోరని వాఁడు,
శుభాశుభములకు దూరుఁడు, నిత్యము భక్తి కలిగిన వాఁడు నాకుఁ బ్రియుఁడు.

సమః శత్రౌ చ మిత్రే చ తథా మానాపమానయోః ।
శీతోష్ణసుఖదుఃఖేషు సమః సఙ్గవివర్జితః ॥

తే.గీ. సముఁడు శత్రు మిత్రుల యందుఁ సముఁడు మాన
ము నవమానము లందు సముండు నుష్ణ
శీతలమ్ములను సముఁడు నాతత సుఖ
దుఃఖముల యందు సంగముఁ దొలఁగు వాఁడు 18.

తన వారి యందుఁ బగ వారి యందు సముఁడు, మానావమానముల, సుఖ
దుఃఖముల, శీతోష్ణముల సముఁడు, సర్వసంగములను వీడిన వాఁడు

తుల్యనిన్దాస్తుతిర్మౌనీ సన్తుష్టో యేన కేనచిత్ ।
అనికేతః స్థిరమతిర్భక్తిమాన్మే ప్రియో నరః ॥

తే.గీ. నిందల స్తుతుల నొక్క రీతిం దలఁచుచు
నుండు వాఁడు మౌనియు నేది యున్న దానిఁ
దనియు వాఁడు గృహ విహీనుఁడు నరుఁ డింక
స్తిరమతియు భక్తుఁడు ప్రియుఁడు కరము నాకు 19.

నిందలందుఁ బొగడ్త లందు నొక్క రీతి నుండు వాఁడు, మౌనవ్రతుఁడు, నున్న దానితోఁ దృప్తిఁ జెందు వాఁడు,  గృహము లేని వాఁడు, స్థిర మైన బుద్ధి గలవాఁడు నయిన భక్తుఁడు నాకు మిక్కిలి ప్రియుఁడు.

యే తు ధర్మ్యామృతమిదం యథోక్తం పర్యుపాసతే ।
శ్రద్దధానా మత్పరమా భక్తాస్తేఽతీవ మే ప్రియాః ॥

తే.గీ. శ్రద్ధను వహించి యుంచి యాసక్తి నా ప
యిన యథోక్తముగను ధర్మ్య మనెడు నమృత
మెవరు సేవించు చుందురొ యింపుగఁ గడుఁ
బ్రీతి వారు భక్తులు నతి ప్రియులు నాకు 20.

ఎవరు శ్రద్ధతో నాసక్తిని నా పై నుంచి, యథోక్తమైన ధర్మమును బాటించు చుందురో యట్టి నా భక్తు లనిన  నాకు మిక్కిలి యిష్టము.

ఇది శ్రీకృష్ణ సూక్తి సుధాకరమను శ్రీమదాంధ్ర భగవద్గీత యందు భక్తి యోగమను పంద్రెండవ యధ్యాయము.
పోచిరాజు కామేశ్వర రావు నామధేయ  ప్రణీతము.

శ్రీకృష్ణాయ నమః

# శ్రీకృష్ణ సూక్తి సుధాకరము

మూలము శ్రీమద్భగవద్గీత

## అధ్యాయము పదుమూఁడు – క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగము

అర్జున ఉవాచ ।
ప్రకృతిం పురుషం చైవ క్షేత్రం క్షేత్రజ్ఞమేవ చ ।
ఏతద్వేదితుమిచ్ఛామి జ్ఞానం జ్ఞేయం చ కేశవ ॥

అర్జునుని పలుకులు

తే.గీ. ఏది క్షేత్రము క్షేత్రజ్ఞుఁ డెవరు ప్రకృతి
పురుషు లెవ్వరు కేశవ పూర్ణ మెఱుఁగ
నిచ్ఛగింతుఁ బరంధామ యెలమి చెపుమ
జ్ఞానము మఱియు జ్ఞేయ మనంగఁ గూడ 1.

కృష్ణా ప్రకృతి పురుషు లెవరు? క్షేత్రము క్షేత్రజ్ఞుఁడు నెవరు? జ్ఞానము మఱియు జ్ఞేయము లేవి? యివి యన్నియు నే నెఱుఁగఁ గోరెదను.

శ్రీభగవానువాచ ।
ఇదం శరీరం కౌన్తేయ క్షేత్రమిత్యభిధీయతే ।
ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః ॥

శ్రీభగవానుని పలుకులు:

తే.గీ. ఈ శరీరము మఱి వచియింపఁ బడును
క్షేత్ర మంచుఁ గౌంతేయ యీ క్షేత్ర మెవఁడు
నేరు నాతని నందురు నేరి నట్టి
బుధులు క్షేత్రజ్ఞుఁ డితఁ డని ముదము మీఱ 2.

అర్జునా యీ శరీరమే క్షేత్ర మని పిలువఁ బడును. ఈ క్షేత్రమును దెలిసిన వానినే

క్షేత్రజ్ఞు డందురు విబుధులు.

క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత ।
క్షేత్రక్షేత్రజ్ఞయోర్జ్ఞానం యత్తజ్జ్ఞానం మతం మమ ॥

తే.గీ. నన్నె ఱుఁగుమ క్షేత్రజ్ఞుఁ డనంగ నన్ని
క్షేత్రముల లోన భారత పాత్రముగను
దఱచు క్షేత్రము క్షేత్రజ్ఞు నెఱుకయ నిజ
మైన జ్ఞాన మనఁబడు నా యభిమతమున 3.

నన్ను క్షేత్రముల నన్నింట నుండు క్షేత్రజ్ఞునిగ నెఱుఁగుము. క్షేత్రము క్షేత్రజ్ఞుల నెఱుఁగుట యే నిజమైన జ్ఞాన మని నా మతము.

తత్క్షేత్రం యచ్చ యాదృక్చ యద్వికారి యతశ్చ యత్ ।
స చ యో యత్ప్రభావశ్చ తత్సమాసేన మే శృణు ॥

తే.గీ. ఏది యా క్షేత్ర మెట్టిది యే వికార
ములఁ బరఁగు నేది యెచ్చట నలవడె నతఁ
డు నెవఁడు ప్రభావ మెయ్యది వినుము నా వ
లన వివరములు క్లుప్తముగ నిటఁ బార్థ 4.

ఆ క్షేత్ర మెయ్యది, యెట్లుండు, నే వికారముల నుండు, నేది యెట్లు కలిగెను, క్షేత్రజ్ఞుఁ డెవ రాతని ప్రభావ మెట్టిది, యీ వివరములు క్లుప్తముగఁ జెప్పెద వినుము.

ఋషిభిర్బహుధా గీతం ఛన్దోభిర్వివిధైః పృథక్ ।
బ్రహ్మసూత్రపదైశ్చైవ హేతుమద్భిర్వినిశ్చితైః ॥

తే.గీ. ఋషుల వలన వేఱుగను ననేక విధము
ల నుడువంబడె ఛందముల వివిధముల
బ్రహ్మ సూత్ర పదముల నిర్ణయము గాను
మఱి సహేతుకముగను విమల తరమ్ము 5.

ఋషుల వలన వేదముల వలన వేఱు వేఱుగా బహు విధముల చెప్పబడినవి. బ్రహ్మ సూత్ర పదములు గూడ సహేతుకముగ నిశ్చయముగను జెప్పినవి.

మహాభూతాన్యహఙ్కారో బుద్ధిరవ్యక్తమేవ చ ।
ఇన్ద్రియాణి దశైకం చ పఞ్చ చేన్ద్రియగోచరాః ॥

తే.గీ. గొప్ప భూతము లవ్యక్త మొప్పు చుండ
మఱి యహంకారమును బుద్ధి మఱియు నింద్రి
యమ్ములు పదియు నొక్కటి యమరు చుండ
నింద్రియంపు గోచరము లై దెలమి విరియ 6.

పంచ మహాభూతములు, నవ్యక్తము (మూల ప్రకృతి), నహంకారము, బుద్ధి, జ్ఞాన కర్మేంద్రియములు పది, మనస్సు, నింద్రియ విషయము లైదును (శబ్దాదులు)

ఇచ్ఛా ద్వేషః సుఖం దుఃఖం సఙ్ఘాతశ్చేతనా ధృతిః ।
ఏతత్క్షేత్రం సమాసేన సవికారముదాహృతమ్ ॥

తే.గీ. కోరికయు ద్వేషము సుఖము ఘోర దుఃఖ
మును శరీరము చైతన్యము ధృతి యనఁగ
బహు వికారములఁ గలసి పలుకఁ బడెను
సూక్ష్మముగ క్షేత్ర మని యిది చోద్యముగను 7.

కోరిక, ద్వేషము, సుఖము, దుఃఖము, శరీరము, చేతనము, ధైర్యము మొదలగు వికారములఁ గూడి సూక్ష్మముగ క్షేత్రమని పలుకఁ బడును.

అమానిత్వమదమ్భిత్వమహింసా క్షాన్తిరార్జవమ్ ।
ఆచార్యోపాసనం శౌచం స్థైర్యమాత్మవినిగ్రహః ॥

తే.గీ. నిష్కపటము నిగర్వము నిత్య సహన
మును ఋజుత్వ మహింసయుఁ దనర గురువు
లఁ గొలుచుటయును శుభ్రత ప్రకటముగ స్థి 8.

రత్వ మాత్మ నిగ్రహము పరఁగుచు నుండ

మోసము లేమి, గర్వము లేకుండుట, సహనము, ఋజుభావము, నహింస,
గురువుల సేవించుటయు, శుచిత్వము, స్థిరత్వము, నాత్మ నిగ్రహము

ఇన్ద్రియార్థేషు వైరాగ్యమనహఙ్కార ఏవ చ ।
జన్మమృత్యుజరావ్యాధిదుఃఖదోషానుదర్శనమ్ ॥

తే.గీ. ఇంద్రి యార్థముల విరక్తి యేన యనెడి
బుద్ధి లేమియుఁ బుట్టుక ముదిమి మృత్యు
వు మఱి రోగ భయాది దుఃఖములు కలుగు
దోషముల నెఱుంగుటయును దోరముగను 9.

ఇంద్రియ విషయము లందు విరక్తి భావము, నే నను భావము లేకుండుటయుఁ,
బుట్టుక, చావు, రోగ భయాది దుఃఖముల వలనఁ గలిగెడు దోషముల యెఱుక

అసక్తిరనభిష్వఙ్గః పుత్రదారగృహాదిషు ।
నిత్యం చ సమచిత్తత్వమిష్టానిష్టోపపత్తిషు ॥

తే.గీ. గృహము భార్యా తనయు లందు బహుళ మైన
యట్టి యాసక్తి లేమియు నత్యధికము
దగులమును వీడుటయు నిరతము సమముగ
నిష్టము లనిష్టములఁ జరియించుటయును 10.

భార్య పుత్రులు గృహము లందు నాసక్తి లేకుండుట, యమితమైన ప్రేమను వీడుట,
యిష్టానిష్టము లందు సమముగా వర్తించుట

మయి చానన్యయోగేన భక్తిరవ్యభిచారిణీ ।
వివిక్తదేశసేవిత్వమరతిర్జనసంసది ॥

తే.గీ. అనితర మగు యోగమ్మున నత్యచంచ
లంపు భక్తి నా యందుంట యింపుఁ గొల్పు 11.

చుంట యేకాంతము కరము పెంట జనము
నుంట యిష్ట ముండక యుంట వంటి వెల్ల

సాటి లేని యోగమున నా యందు నచంచల మైన భక్తి నుంచుట, యేకాంత మన్న నిష్ట ముండుట, తన చెంత జను లుండ నిష్ట పడకుంటయు

అధ్యాత్మజ్ఞాననిత్యత్వం తత్త్వజ్ఞానార్థదర్శనమ్ ।
ఏతజ్జ్ఞానమితి ప్రోక్తమజ్ఞానం యదతోఽన్యథా ॥

తే.గీ. నిత్య మధ్యాత్మపు టెఱుక సత్య మంచు
నెఱుఁగుటయుఁ దత్త్వవేదము నెఱుఁగుటయును
జ్ఞాన మంచుఁ జెప్పఁబడె నజ్ఞాన మితర
మైన యట్టి దంతయు నిశ్చయమ్ముగ నిఁక 12.

అధ్యాత్మపు జ్ఞానమే సత్యమైన జ్ఞాన మని యెఱుఁగుట, తత్త్వ జ్ఞానపు విధ మెఱుఁగుటయే జ్ఞాన మని చెప్పఁబడెను. ఇతర మైనది యంతయు నజ్ఞానమే.

జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వామృతమశ్నుతే ।
అనాదిమత్పరం బ్రహ్మ న సత్తన్నాసదుచ్యతే ॥

తే.గీ. తెలియఁ దగిన దేదియొ దానిఁ దెలిపెద నెఱుఁ
గంగ దేని నమృతము నింకఁ బడయ నగు
నాది లేని బ్రహ్మము నది యనఁబడ దిటు
సత్తు వంచును మఱియు నసత్తు వనియు 13.

తెలియఁ దగినది దేనిఁ తెలిసిన మోక్షమును బొంద నగునో దానిని దెలిపెదను. అది బ్రహ్మము దానికి నాదిలేదు. అది సత్తు గాదు నసత్తును గాదు.

సర్వతః పాణిపాదం తత్సర్వతోఽక్షిశిరోముఖమ్ ।
సర్వతః శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి ॥

తే.గీ. కాళ్లు చేతులు నంతటఁ గల్గిన దది 14.

యంతటఁ గనులు శిరములు నాస్యములును
జెవులు నంతటఁ గలదియుఁ జేరి జగము
నందు నెల్లను వ్యాపించి నట్టిదియును

ఆ బ్రహ్మ మంతటఁ గాళ్లు, చేతులు, శిరములు, ముఖములు, చెవులు కలిగి యుండి జగము నెల్ల వ్యాపించి యున్నది.

సర్వేన్ద్రియగుణాభాసం సర్వేన్ద్రియవివర్జితమ్ ।
అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృ చ ॥

తే.గీ. ఇంద్రియ గుణములను వెలయించు నింద్రి
యముల వీడి యుండు మిగుల నరతి నుండు
నన్నిటి వహించు నట్టిద యనుభవించు
గుణము లక్కజముగను నిర్గుణము నగును 15.

ఇంద్రియంపు గుణములను గలిగించును. ఇంద్రియములను విసర్జించి యుండును. అన్నిటి మీద విరక్తిని నుండును. అన్నింటిని బూని యుండును. గుణముల ననుభవించుచుఁ గూడ నిర్గుణ మగును.

బహిరన్తశ్చ భూతానామచరం చరమేవ చ ।
సూక్ష్మత్వాత్తదవిజ్ఞేయం దూరస్థం చాన్తికే చ తత్ ॥

తే.గీ. భూతముల కెల్ల నంతరమునను వెలుప
లయును వెలయుఁ జరము నచర మయినదియు
సూక్ష్మ రూప మగుట నది చూడ రాని
దియును దగ్గరదియు దూర మయినదియును 16.

భూతముల లోపల వెలుపల నుండు నదియు, కదలునదియు గదలనిదియు, సూక్ష్మముగ నుండుట వలనఁ గాన రానిదియు, దగ్గరగను దూరముగను గూడ నుండునది.

అవిభక్తం చ భూతేషు విభక్తమివ చ స్థితమ్ ।

భూతభర్తృ చ తజ్జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణు చ ॥

తే.గీ. విడివడనిది భూతము లందు విడువడు నది
యు నగు నారయ ధరియించుఁ దనరి భూత
రాశి హరియించు దానిగ ప్రభవ కార
కమ్ముగఁ దెలియంగ వలయుఁ జమ్ము దాని 17.

భూతము లందు విడివడు నదియు దిరిగి విడివడ నదియు నగును. భూతములను ధరించును. వాని జన్మకారకముగాను లయకారకముగాను దెలియవలెను.

జ్యోతిషామపి తజ్జ్యోతిస్తమసః పరముచ్యతే ।
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య విష్ఠితమ్ ॥

తే.గీ. వెలుగు లందు వెలుంగును వేరయినది
చీకటికి నది జ్ఞానము జ్ఞేయము మఱి
జ్ఞాన గమ్యము నది యౌను సర్వ భూత
ముల హృదిని నుండు ననఁబడు ముచ్చటగను 18.

వెలుఁగులకు వెలుఁ గది. చీకటికి భిన్న మైనది. జ్ఞానము, తెలియఁ దగినదియు, జ్ఞానముచేఁ బొందఁ దగినదియు నగును. సకల ప్రాణు లందు నుండునది.

ఇతి క్షేత్రం తథా జ్ఞానం జ్ఞేయం చోక్తం సమాసతః ।
మద్భక్త ఏతద్విజ్ఞాయ మద్భావాయోపపద్యతే ॥

తే.గీ. ఇవ్విధి నుడువఁ బడియెను హితమున నిట
సమసనమ్ముగ క్షేత్రము జ్ఞానము మఱి
జ్ఞేయమును నిఁక దేని మదీయ భక్తుఁ
డెఱిఁగి పొంద నా భావము నెలమిఁ దగును 19.

ఈ విధముగా క్షేత్రము, జ్ఞానము మఱియు జ్ఞేయము సంక్షిప్తముగా జెప్పఁ బడెను. దీని నెఱిఁగిన నా భక్తుఁడు నా భావమునే పొందును.

ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి ।
వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతిసమ్భవాన్ ॥

తే.గీ. నయముగఁ బ్రకృతి పురుషు లుభయు లనాదు
లనఁగ నెఱుఁగు వికారములును గుణములు
నరయఁగ మఱి ప్రకృతి నుండియ జనియించి
నట్లుగను దెలియ వలయు నంచితముగ 20.

ప్రకృతి పురుషు లనాదు లని యెఱుఁగ వలెను. గుణములు వికారములు ప్రకృతి నుండియే జనించిన వనియుఁ దెలియ నగును.

కార్య కారణ కర్తృత్వే హేతుః ప్రకృతి రుచ్యతే ।
పురుషః సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతు రుచ్యతే ॥

తే.గీ. పనికి నావశ్యకమునకుఁ బని నొనరుచు
వాఁ డగుటకును గారణ మాడఁ బడును
బ్రకృతి సుఖ దుఃఖముల ననుభవమున కగుఁ
గారణము పురుషుఁడ పలుకఁ బడు నిట్లు 21.

పనికి దాని యావశ్యకమునకుఁ, జేయు వాఁ డగుటకును బ్రకృతియే కారణము. సుఖ దుఃఖము లనుభవించుటకు కారణము పురుషుఁ డగును.

పురుషః ప్రకృతిస్థో హి భుఙ్క్తే ప్రకృతిజాన్గుణాన్ ।
కారణం గుణసఙ్గోఽస్య సదసద్యోనిజన్మసు ॥

తే.గీ. ప్రకృతిచేఁ గలిగెడు గుణ వ్రాత మనుభ
వించు నంద యుండి పురుషుఁ డంచితముగ
గుణముల కలయిక యగు కారణ మతనికి
సుకృత దుష్కృతంపు భవములకుఁ జెలంగి 22.

పురుషుఁడు ప్రకృతి వలనఁ గలిగిన గుణముల ననుభవించును. ఆతని మంచి చెడ్డ పుట్టుకలకు గుణముల కలయికయే కారణ మగును.

ఉపద్రష్టానుమన్తా చ భర్తా భోక్తామహేశ్వరః ।
పరమాత్మేతి చాప్యుక్తోదేహేఽస్మిన్పురుషః పరః ॥

తే.గీ. ఇత్తనువు నందలి పురుషుఁ డితరుఁడు పర
మాత్మ యని పిలువంబడు నతఁడు సాక్షి
యు ననుమతి యొసంగెడి వాఁడును నయి భర్త
గను మహేశ్వరుండును భోక్తగ నగు నింక 23.

ఈ శరీరములో మఱియొక పురుషుఁడు పరమాత్మ యనఁ బడు వాఁడు సాక్షిగా నుండును. అతఁడే యనుమతి నిచ్చు వాఁడు, ప్రభవును, మహేశ్వరుఁడును, భోక్తయు నై యుండును.

య ఏవం వేత్తి పురుషం ప్రకృతిం చ గుణైః సహ ।
సర్వథా వర్తమానోఽపి న స భూయోఽభిజాయతే ॥

తే.గీ. తెలియు నిట్లు పురుషుఁ బ్రకృతిని స గుణము
ల నెవఁ డతఁడు చరించు చున్న ను నిపుడు స
కల విధమ్ములఁ దనరి జగమ్ము నందుఁ
దిరిగి జన్మంబు నొందఁడు ధరణి యందు 24.

ఇట్లు ప్రకృతిని గుణములు గూడిన పురుషుని నెవఁ డెఱుఁగునో యతఁడు జగమ్మున వివిధ విధముల సంచరించినను దిరిగి జన్మను బొందఁడు.

ధ్యానేనాత్మని పశ్యన్తి కేచిదాత్మానమాత్మనా ।
అన్యే సాఙ్ఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే ॥

తే.గీ. ధ్యానమునఁ గొంద ఱాత్మ నాత్మ వలనఁ గను
దురు విశదముగ నాత్మ యందుననె పరులు
సాంఖ్య యోగమున నితర జనులు నింకఁ
గర్మ యోగమ్మునఁ దనరి మర్మ మెఱిఁగి 25.

కొందఱు ధ్యానముచే నాత్మ నాత్మ చేతనే యాత్మ యందు నెఱుఁగుదురు. మఱి
కొందఱు సాంఖ్య యోగమున నెఱుఁగ నితరులు కర్మయోగమున నెఱుఁగుదురు.

అన్యే త్వేవమజానన్తః శ్రుత్వాన్యేభ్య ఉపాసతే ।
తేఽపి చాతితరన్త్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః ॥

తే.గీ. ఇతరు లిట్లు నేరక విని యితరులు నుడు
వంగ సేవించు చుందురు భక్తి మెఱయ
వినుట యందాస కలిగి వారును మరణము
నుత్తరించు వార యగుదు రుత్తమముగ 26.

ఇతరులు కొంద ఱిది తెలియక పరులు చెప్పఁగా విని భక్తితో సేవించు చుందురు.
వినుట యందాసక్తి కల వారును మృత్యువును దాఁటుదురు.

యావత్సఞ్జాయతే కిఞ్చిత్సత్త్వం స్థావరజఙ్గమమ్ ।
క్షేత్రక్షేత్రజ్ఞసంయోగాత్తద్విద్ధి భరతర్షభ ॥

తే.గీ. ఎఱుఁగుమ కదలు కదలని యెట్టి కొంచి
యంపు సత్త్వమయిన నింక నడరి సంభ
వించునో భరతర్షభ యది పేర్మి పుట్టు
క్షేత్రము కలియ క్షేత్రజ్ఞుఁ జేరి యనఁగ 27.

అర్జునా చరాచరము లైన యే చిన్న సత్త్వము లైనను క్షేత్రము క్షేత్రజ్ఞుని కలియ
సంభవించును.

సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరమ్ ।
వినశ్యత్స్వవినశ్యన్తం యః పశ్యతి స పశ్యతి ॥

తే.గీ. భూతముల యందు సమముగఁ బ్రీతి నుండు
నట్టి పరమేశ్వరుని లయమైన నలయు
డంచు సతతమ్ము నెమ్మది నంచితముగఁ 28.

జూచు వాఁడ సత్యమ్ముగఁ జూచు వాఁడు

ఎల్ల భూతము లందు సమ భావముతో నున్న పరమేశ్వరుఁడు లయ మైనను లయము కా నట్లు మదినిఁ జూచువాఁడు నిజమును జూచు వాఁ డగును.

సమం పశ్యన్హి సర్వత్ర సమవస్థితమీశ్వరమ్ ।
న హినస్త్యాత్మనాత్మానం తతో యాతి పరాం గతిమ్ ॥

తే.గీ. అంతట నొక రీతిని నున్న యట్టి యీశ్వ
రుని నరయుచుఁ దనను దాను రోష మూని
యెవఁడు హింసింపకుండునో యెపుడు నతఁడు
పొందు పరమంపు గతి నంతఁ బూజ్యముగను 29.

అంతట నొక్క రీతి నున్న యీశ్వరునిఁ జూచుచుఁ దనను దాను గోపమున నెన్నఁడు హింసించుకొనఁడొ యతఁడు పరమంపు గతినిఁ బొందును.

ప్రకృత్యైవ చ కర్మాణి క్రియమాణాని సర్వశః ।
యః పశ్యతి తథాత్మానమకర్తారం స పశ్యతి ॥

తే.గీ. జగతి నందెల్లెడలఁ గాంచ సంతతమ్ముఁ
బ్రకృతియ పనుల కెల్లను బన్నుగ నికఁ
గారణ మనియుఁ దన్ను నకర్త యనఁగఁ
జూచు వాఁడ సత్యమ్ముగఁ జూచు వాఁడు 30.

జగత్తులో నెల్లెడలఁ బనుల కన్నింటికిఁ బ్రకృతియే కారణ మని తాను కర్త కానని యెవఁడు చూచునో నతఁడు నిజముగాఁ జూచు వాఁ డగును.

యదా భూతపృథగ్భావమేకస్థమనుపశ్యతి ।
తత ఏవ చ విస్తారం బ్రహ్మ సమ్పద్యతే తదా ॥

తే.గీ. ఎపుడు జగతి భూతము లవి యెల్ల వేఱు
వే అనెడి భావము నెఱిఁగి పేర్మి నుండి 31.

యొకని యంద విస్తరము లని కర మెఱుఁగు
నపుడు వొందు నతండు బ్రహ్మమును దనరి

ఎవఁడు భూతము లన్నియు వేఱు వేఱని యెఱిఁగి, యవి యెల్ల నొకని యందే విస్తారము లని యెఱుఁగునో యతఁడు బ్రహ్మమును జేరును.

అనాదిత్వాన్నిర్గుణత్వాత్పరమాత్మాయమవ్యయః ।
శరీరస్థోఽపి కౌన్తేయ న కరోతి న లిప్యతే ॥

తే.గీ. ఆది లేని వాఁడును మఱి యవ్యయుండు
నిర్గుణుఁడు పరమాత్ముఁడు నెగడినను శ
రీర మందును గౌంతేయ లీల నెద్ది
యు నొనరింపఁ డంటఁడు నెవ్విధినిఁ దలంప 32.

అర్జునా యాది లేని వాఁడు నవ్యయుఁడు నిర్గుణుఁడు, పరమాత్ముఁడు శరీరములో నుండి లీల నేది చేసినను దానికి నంటఁడు.

యథా సర్వగతం సౌక్ష్మ్యాదాకాశం నోపలిప్యతే ।
సర్వత్రావస్థితో దేహే తథాత్మా నోపలిప్యతే ॥

తే.గీ. అంతటఁ బరఁగిన నభము సుంత యయిన
కతన నెట్లంటఁ బడదొ యట్టి తెఱఁగుననె
దేహ మందు నంతటను వర్తిల్లు చున్న
యాత్మ దేని చేత నయిన నంటఁ బడదు 33.

ఆకాశ మంతట వ్యాపించిన నెట్టు లంటఁ బడదో యట్లే దేహ మందు నంతట నున్న యాత్మ దేని చే నంటఁ బడదు.

యథా ప్రకాశయత్యేకః కృత్స్నం లోకమిమం రవిః ।
క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత ॥

తే.గీ. లోక మంత యొక్క రవి యెట్లు వెలిఁగించుఁ 34.

బ్రభల నవ్విధి భారత భవ్యముగను
క్షేత్ర మఖిలమ్ము వ్యాపించి చిత్రముగను
వెలుఁగఁ జేయు క్షేత్రజ్ఞుఁడు విరివి గాను

లోకము నెల్ల నొక్క సూర్యుఁ డెట్లు వెలిగించునో యట్లే క్షేత్రము నంతటిని క్షేత్రజ్ఞుఁడు వెలిగించును.

క్షేత్రక్షేత్రజ్ఞయోరేవమన్తరం జ్ఞానచక్షుషా ।
భూతప్రకృతిమోక్షం చ యే విదుర్యాన్తి తే పరమ్ ॥

తే.గీ. జ్ఞాన నేత్రముల నెవరు కాన నేర్తు
రడరి క్షేత్రము క్షేత్రజ్ఞు లందు నెరవు
భూత భావములను మఱి మోక్ష గతిని
వారు పొందఁ గలరు ముక్తి భద్రముగను 35.

క్షేత్రము క్షేత్రజ్ఞుల నడుమ భేదమును, భూత భావములను మఱియు వాని మోక్ష గతిని నెవ్వరు జ్ఞాన నేత్రమునఁ గాంతురో వారు ముక్తినిఁ బొందఁ గలరు.

ఇది శ్రీకృష్ణ సూక్తి సుధాకరమను శ్రీమదాంధ్ర భగవద్గీత యందు క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగమను పదుమూఁడవ యధ్యాయము.

పోచిరాజు కామేశ్వర రావు నామధేయ ప్రణీతము.

శ్రీకృష్ణాయ నమః

# శ్రీకృష్ణ సూక్తి సుధాకరము

మూలము శ్రీమద్భగవద్గీత

## అధ్యాయము పదునాలుగు – గుణత్రయ విభాగ యోగము

శ్రీభగవానువాచ ।
పరం భూయః ప్రవక్ష్యామి జ్ఞానానాం జ్ఞానముత్తమమ్ ।
యజ్జ్ఞాత్వా మునయః సర్వే పరాం సిద్ధిమితో గతాః ॥

శ్రీభగవానుని పలుకులు:

తే.గీ. మంచి జ్ఞానము లందున మించి నట్టి
జ్ఞానము నెఱిఁగి దేనిని సన్మునీంద్రు
లెల్లఁ బరమంపు సిద్ధిని నెలమిఁ బడసి
రట్టి దాని నే నుడివెద నడరి మఱల 1.

ఉత్తమము లైన జ్ఞానములకు నెల్ల మిన్న యైన జ్ఞానమును మఱల నీకుఁ జెప్పు
చున్నాను. దీనిని విని మునీంద్రులు పరమ సిద్ధినిఁ బొందిరి.

ఇదం జ్ఞానముపాశ్రిత్య మమ సాధర్మ్యమాగతాః ।
సర్గేఽపి నోపజాయన్తే ప్రలయే న వ్యథన్తి చ ॥

తే.గీ. ఆశ్రయించి యీ జ్ఞానము నంత నాదు
సామ్యముఁ బడసి యిఁక వారు జన్మములను
బొంద కుండుదురు మఱియు నొంద రెట్టి
దుఃఖములు ప్రళయమ్ము లందును వెఱవక 2.

ఈ జ్ఞానము నాశ్రయించి నాకు సమానులై మఱుజన్మములను బొందరు. ప్రళయకాల
దుఃఖములను గూడ బొందరు.

మమ యోనిర్మహద్ బ్రహ్మ తస్మిన్గర్భం దధామ్యహమ్ ।

సమ్భవః సర్వభూతానాం తతో భవతి భారత ॥

తే.గీ. అతిశయ బ్రహ్మ మగు నాకు నంచిత జన
న స్థలమ్మ యుంచెదు నందు సుస్థిర గతి
గర్భ మీ జీవ కోటి కక్కారణమున
జరుగు చున్నది పుట్టుక సముచితముగ 3.

మహద్బ్రహ్మము నాకు గర్భస్థానము. అందు నేను గర్భము నుంచుట వలన జీవ కోటి సంభవించుచున్నది.

సర్వయోనిషు కౌన్తేయ మూర్తయః సమ్భవన్తి యాః ।
తాసాం బ్రహ్మ మహద్యోనిరహం బీజప్రదః పితా ॥

తే.గీ. ఎట్టి మూర్తు లుద్భవ మొందు నెల్ల గర్భ
ములను గౌంతేయ కారణము సుమి వాని
కీ ఘనబ్రహ్మమే బీజ మే నొసంగ
నగుదుఁ దండ్రిని నన్నిటి కంచితముగ 4.

అర్జునా యే మూర్తు లే గర్భమున నుద్భవించినను గారణ మీ బ్రహ్మమే. నేను బీజము నొసఁగు వాఁడను. కావున తండ్రి నగుదును.

సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతిసమ్భవాః ।
నిబధ్నన్తి మహాబాహో దేహే దేహినమవ్యయమ్ ॥

తే.గీ. ప్రకృతి నుండి పుట్టినవి యరయఁగ మూడు
గుణము లవి సత్త్వము రజస్సుఁ గూడి తమము
దేహమున మహాభుజ యవి దేహి నవ్య
యుని నిరతము కట్టుచు నుండు నుత్కటముగ 5.

ప్రకృతి నుండి మూడు గుణములు పుట్టినవి. అవి సత్త్వము, రజస్సు, తమములు. దేహమున నవ్యయుఁ డైన దేహిని నవి కట్టి యుంచును.

తత్ర సత్త్వం నిర్మలత్వాత్ప్రకాశకమనామయమ్ ।
సుఖసఙ్గేన బధ్నాతి జ్ఞానసఙ్గేన చానఘ ॥

తే.గీ. అందు ననఘ సత్త్వం బది యమల మగుట
ద్యోతమానము నవికార ముండునదియు
జ్ఞాన సుఖముల కోర్కులతో నది మఱి
చెలఁగి బంధించు దేహునిఁ జిత్రముగను 6.

అందు సత్త్వ గుణము నిర్మలము నవికరముగాఁ గనఁ బడును. దేహులను జ్ఞానము
సుఖముల యందలి యాసచేఁ గట్టును.

రజో రాగాత్మకం విద్ధి తృష్ణాసఙ్గసముద్భవమ్ ।
తన్నిబధ్నాతి కౌన్తేయ కర్మసఙ్గేన దేహినమ్ ॥

తే.గీ. రంజిలు రజోగుణమ్ము నిరతము రాగ
మయ మయి విషయ వాంఛలం బడయఁ బుట్టు
నంచు నెఱుఁగు కౌంతేయ బంధించు నయ్యు
దింక దేహిఁ గర్మాసక్తి శంక లేక 7.

రజోగుణము రాగముతో గూడిన దై కోరికలతోఁ గూడి పుట్టినది. కర్మములపై నాశతో
దేహిని బంధించును.

తమస్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినామ్ ।
ప్రమాదాలస్యనిద్రాభిస్తన్నిబధ్నాతి భారత ॥

తే.గీ. తెలివి లేమి తమోగుణ మలవడు నని
భారత తెలియ వలయు సర్వ జనుల కది
కలుగఁ జేయు మోహము నిద్ర యలసత మఱ
పుల వలన దేహులను గట్టు ముమ్మరముగ 8.

అజ్ఞానము వలనఁ దమోగుణము పుట్టును. జనులకు నది మోహమును గలుగఁ
జేయును. నిద్ర, యలసత్వము, మఱపులతో నది దేహులను బంధించును.

సత్త్వం సుఖే సఞ్జయతి రజః కర్మణి భారత ।
జ్ఞానమావృత్య తు తమః ప్రమాదే సఞ్జయత్యుత ॥

తే.గీ. జయము వొందును సుఖముల సత్త్వ గుణము
కర్మతతుల రజస్సు సుకరము గాను
జ్ఞానమును గప్పి తమ మింక జయము వడయు
నేమఱిక లందు దేహుల నెల్లఁ దగిలి 9.

దేహులను దగిలి సత్త్వ గుణము సుఖములను బడయుటలోను, రజోగుణము కర్మములను సుకరముగాఁ జేయించుటలోను, దమోగుణము జ్ఞానమును మూసి యేమఱికల నుంచుట యందు జయమును బడయఁ గలవు.

రజస్తమశ్చాభిభూయ సత్త్వం భవతి భారత ।
రజః సత్త్వం తమశ్చైవ తమః సత్త్వం రజస్తథా ॥

తే.గీ. పురుషుల రజో తమో గుణములను మీఱి
సత్త్వ గుణము భారత పెర్గు సత్త్వమును ద
మో గుణమ్మును దాఁటి రజో గుణమ్ము
సత్త్వ గుణ రజో గుణములఁ జంపి తమము 10.

పురుషు లందు రజో తమో గుణములను మీఱి సత్త్వ గుణము వృద్ధిఁ జెందును. సత్త్వ తమోగుణములను దాఁటి రజోగుణము పెరుగును. సత్త్వరజోగుణములను దాఁటి తమోగుణము పెరుగును.

సర్వద్వారేషు దేహేఽస్మిన్ప్రకాశ ఉపజాయతే ।
జ్ఞానం యదా తదా విద్యాద్వివృద్ధం సత్త్వమిత్యుత ॥

తే.గీ. ఈ తనువునం దెపుడు సక లేంద్రియంపు
గడపల వెలిఁగి జ్ఞానము గల్గు నప్పు
డ యెఱుఁగ వలయు సత్త్వము నయముగ జని
యించి వృద్ధి వడసి నట్లు యంచితముగ 11.

ఈ తనువున నింద్రియము లన్నింట జ్ఞాన మెప్పుడు ప్రకాశమాన మగునో
యప్పుడు సత్త్వగుణము పుట్టి వృద్ధిఁ జెందినట్లు తెలియ వలెను.

లోభః ప్రవృత్తిరారమ్భః కర్మణామశమః స్పృహా ।
రజస్యేతాని జాయన్తే వివృద్ధే భరతర్షభ ॥

తే.గీ. వృద్ధియైన రజస్సున విరివిగ జని
యించును భరతర్షభ పను లెలమిని మొద
లిడుటయు నశాంతి యాశలు నింక లోభ
మాదిగ ప్రవృత్తియుఁ జెలఁగ నధికముగను 12.

అర్జునా రజస్సు వృద్ధి యైనఁ బనుల నారంభించుటయు నశాంతి, యాసలు, లోభము
మొదలగు వికారములు ప్రవృత్తియు నధికము లగుట జరుగును.

అప్రకాశోఽప్రవృత్తిశ్చ ప్రమాదో మోహ ఏవ చ ।
తమస్యేతాని జాయన్తే వివృద్ధే కురునన్దన ॥

తే.గీ. వృద్ధియౌ తమో గుణమున వేగఁ బుట్టు
నడరి కురునందన ప్రమాద మప్రవృత్తి
యప్రకాశము మోహము ననఁగ గుణము
లన్నియును దేహులం దెల్ల నరయ నింక 13.

అర్జునా తమోగుణము వృద్ధిఁ జెందినప్పు డజాగ్రత్త, నిర్వ్యాపారము, నజ్ఞానము,
మోహ మిత్యాదులు దేహు లందుఁ బొడఁ జూపును.

యదా సత్త్వే ప్రవృద్ధే తు ప్రలయం యాతి దేహభృత్ ।
తదోత్తమవిదాం లోకానమలాన్ప్రతిపద్యతే ॥

తే.గీ. ప్రబలు చుండ సత్త్వగుణము ప్రళయ మొంద
దేహ ధారి పొందును వీడి దేహ మమల
లోకముల నుత్తమ విదులు వీఁక నేఁగు 14.

లోకములు శంక లన్నవి లేక యిందు

సత్త్వగుణము నిండినపుడు దేహ ధారి మరణించిన శరీరమును వీడి యుత్తమ
జ్ఞానమున్న వా రేఁగు గతికి బోవును.

రజసి ప్రలయం గత్వా కర్మసఙ్గిషు జాయతే ।
తథా ప్రలీనస్తమసి మూఢయోనిషు జాయతే ॥

తే.గీ. మరణమును బొంది నంతట మానవుఁడు ర
జో గుణమునఁ గర్మ పరుల చూలి యగును
దమము నందున మరణింప ధరణి యందుఁ
బుట్టు మూఢ కులము లందుఁ బట్టి యగుచు 15.

రజోగుణముతోఁ గూడి మరణించినఁ గర్మములను జేయు వారింట జనించును. తమో
గుణ ముండ మరణించిన మూఢ ( పశుపక్ష్యాది) కులమునఁ బుట్టును.

కర్మణః సుకృతస్యాహుః సాత్త్వికం నిర్మలం ఫలమ్ ।
రజసస్తుఫలం దుఃఖమజ్ఞానం తమసః ఫలమ్ ॥

తే.గీ. సాత్త్వికపు మంచి పనులకు స్వచ్ఛమ ఫల
మగును దుఃఖమ ఫలమగు నరయ రాజ
సములకుఁ దెలివి లేమియ తమపుఁ బనుల
కెల్ల ఫలమని యందురు తెల్లముగను 16.

మంచి పనులకు సాత్త్వికమైన నిర్మలత్వము ఫల మగును. రాజసపుఁ బనులకు
దుఃఖము ఫలమగును. తామసపుఁ బనులకు నజ్ఞానము ఫలము.

సత్త్వాత్సఞ్జాయతే జ్ఞానం రజసో లోభ ఏవ చ ।
ప్రమాదమోహౌ తమసో భవతోఽజ్ఞానమేవ చ ॥

తే.గీ. సత్త్వము వలనఁ బుట్టును జ్ఞాన మది వె
లుంగు నీ రజో గుణమున లోభ మింక 17.

మోహ మజ్ఞానము మఱపు మూరి యుద్భ
వించును దమో గుణమ్మున సంచరింప

జ్ఞానము సత్త్వము వలనఁ గల్గును. రజోగుణమున లోభము కల్గును. తమో గుణము వలన మోహము, నజ్ఞానము, మఱపులు కల్గును.

ఊర్ధ్వం గచ్ఛన్తి సత్త్వస్థా మధ్యే తిష్ఠన్తి రాజసాః ।
జఘన్యగుణవృత్తిస్థా అధో గచ్ఛన్తి తామసాః ॥

తే.గీ. సత్త్వ గుణ మందుఁ గల వారు చనుదు రూర్ధ్వ
ములకు మధ్య నుందురు రాజసులు చెలంగి
నీచ గుణవృత్తులు సతత మాచరింపఁ
దామసు లధోగతిని నుండ్రు తథ్యముగను 18.

సత్త్వగుణము గలవారు పై లోకములకు, రజోగుణముల వారు మధ్య లోకమునకుఁ, జెడ్డ గుణములతోఁ దమోగుణ మున్న వారు క్రింది లోకములకుఁ బోవుదురు.

నాన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టానుపశ్యతి ।
గుణేభ్యశ్చ పరం వేత్తి మద్భావం సోఽధిగచ్ఛతి ॥

తే.గీ. కర్తగఁ దలంప గుణములఁ గాక యితరు
నిఁ గనఁ డెప్పుడు ద్రష్ట యనిశము గుణము
లకుఁ బరుని నెఱుఁగునొ యప్పు డిఁక నతండు
పొందు నా భావ మంచితముగను బార్థ 19.

ఈ మూడు గుణములే యన్ని పనులకుఁ గర్త లని యెంచి తాను కర్త కాదని జూచి గుణముల కతీతుని నెవఁ డెఱుఁగునో వాఁడు నా భావమును బొందును.

గుణా నేతా నతీత్య త్రీన్దేహీ దేహ సముద్భవాన్ ।
జన్మమృత్యు జరాదుఃఖై ర్విముక్తోఽమృత మశ్నుతే ॥

తే.గీ. దేహ మందుఁ బుట్టిన యట్టి త్రిగుణముల న 20.

తిక్రమింప దేహుఁడు వొందు సక్రమముగ
జన్మ మృత్యు జరా దుఃఖ శమము మోక్ష
లబ్ధియు ధనంజయ సదమల గతి నపుడు

ధనంజయ దేహి యీ త్రిగుణముల నతిక్రమించిన జన్మ మృత్యు జరా దుఃఖముల నుండి విముక్తి వడసి మోక్షమును బొందును.

అర్జున ఉవాచ ।
కైర్లిఙ్గై స్త్రీ న్గుణా నేతా నతీతో భవతి ప్రభో ।
కిమాచారః కథం చైతాం స్త్రీ న్గుణా నతివర్తతే ॥

అర్జునుని పలుకులు:

తే.గీ. ఈ త్రిగుణము లింపుగఁ బ్రభు ధాత్రి దాఁటి
నట్టి వాఁ డెట్టి గుణముల నలరు వాఁడు
వృత్తి యెయ్యది యే రీతి వీని నతఁ డ
తిక్రమింప నోపఁ గలుగుఁ దెలుపు మయ్య 21.

కృష్ణా యీ మూడు గుణములను దాఁటఁ గల్గు వాఁ డెట్టి గుణములు కలిగి యుండును? ఆతని వృత్తి యేది వీని నెట్లు దాఁటఁ గలఁడు?

శ్రీభగవానువాచ ।
ప్రకాశం చ ప్రవృత్తిం చ మోహమేవ చ పాణ్డవ ।
న ద్వేష్టి సమ్ప్రవృత్తాని న నివృత్తాని కాఙ్క్షతి ॥

శ్రీభగవానుని పలుకులు:

తే.గీ. ద్వేషమును బూనఁ డెన్నఁడు వెలుఁగుల నడ
తలను మోహమునఁ దమంతఁ గలుగు చున్న
యట్టి వానినిఁ బాండవ యతఁడు కోరఁ
డెపుడు వోయినట్టివి వేని నేని మదిని 22.

అర్జునా యతఁడు తమంతటఁ గలుగు చున్న సత్త్వ గుణపు వెలుగులను, రజోగుణపు నడతలను, తమోగుణపు మోహమును ద్వేషింపఁడు. వోయిన వానిని తిరిగి కోరఁడు.

ఉదాసీనవదాసీనో గుణైర్యో న విచాల్యతే ।
గుణా వర్తన్త ఇత్యేవం యోఽవతిష్ఠతి నేఙ్గతే ॥

తే.గీ. గుణములఁ జలియింపక యుండి గుణము లవి స
తమ్ము వర్తిల్లు నని తటస్థముగఁ దలఁచి
కంప మొంద కుండక యుండు నింపుగ నిర
తమ్ము నెవ్వఁడు పాండు నందన తనరుచు 23.

అర్జునా గుణములకుఁ జలింపక, యవి నిత్యము వర్తించు నని తలఁచి తటస్థముగ
నుండి కంపము నొంద నట్టి వాఁడు

సమదుఃఖసుఖః స్వస్థః సమలోష్టాశ్మకాఞ్చనః ।
తుల్యప్రియాప్రియో ధీరస్తుల్యనిన్దాత్మసంస్తుతిః ॥

తే.గీ. స్థితుడు సుఖదుఃఖముల నొక్క తీరు వాఁడు
బంగరు శిల మన్నుల నొక్క పాటి వాఁడు
సమత ప్రియము నప్రియములఁ జలుపు వాఁడు
నిందల స్తుతుల సమముగ నెగడు దిట్ట 24.

సుఖ దుఃఖములందు నొక్క రీతి నుండు వాఁడు, బంగారము, ఱాయి, మన్నులను
సమానముగాఁ జూచు వాఁడు, ప్రియము లప్రియముల నిందల స్తుతుల సమముగ
నుండు వాఁడు, ధీరుఁడు

మానాపమానయో స్తుల్య స్తుల్యో మిత్రారిపక్షయోః ।
సర్వారమ్భ పరిత్యాగీ గుణాతీతః స ఉచ్యతే ॥

తే.గీ. గౌర వాగౌరవమ్ములఁ దీ రొకటిగ
నుండి మిత్రుల శత్రుల నొక్క పగిది
నరయు వాని నారంభము లందు నిష్ట
మందని నరు గుణాతీతుఁ డందు రెలమి 25.

గౌర వాగౌరవములను, మిత్రులను శత్రువుల నొక్క రీతి జూచు వాఁడును,కార్యముల
నారంభము (కర్తృత్వము) నిష్ట పడని వాఁడును గుణాతీతుఁడు గాఁ జెప్పఁ బడును.

మాం చ యోఽవ్యభిచారేణ భక్తి యోగేన సేవతే ।
స గుణాన్సమతీ త్యై తాన్బ్రహ్మ భూయాయ కల్పతే ॥

తే.గీ. నన్ను భక్తి యోగమ్మున మిన్నగ నచ
లిత మనమ్మున సేవించు సతము నెవఁడు
గుణముల నతిక్రమించి తగు విధి నతఁడు
పొందు నింపుగ బ్రహ్మత్వము నిఁకఁ బార్థ 26.

పార్థా నన్ను భక్తి యోగమున నిశ్చల మతితో నిత్య మెవఁడు గుణాతీతుఁడై తగిన
విధిని సేవించునో యతఁడు బ్రహ్మత్వమును బొందును.

బ్రహ్మణో హి ప్రతిష్ఠాహ మమృత స్యావ్యయస్య చ ।
శాశ్వతస్య చ ధర్మస్య సుఖ స్యైకాన్తి కస్య చ ॥

తే.గీ. ఆశ్రయుఁడ నేను బ్రహ్మకు నమృతునకును
నవ్యయునకు శాశ్వత మయి నట్టి ధర్మ
మునకు నేకాంతికపు సుఖమ్మునకుఁ బార్థ
యెఱుఁగు మివ్విధి మన మందు నెలమి నన్ను 27.

పార్థా నన్ను నమృతుఁడు, నవ్యయుఁడు నైన బ్రహ్మకు, శాశ్వత మైన ధర్మమునకు,
నేకాంత సుఖమునకు, నాశ్రయునిగా నెఱుఁగుము.

ఇది శ్రీకృష్ణ సూక్తి సుధాకరమను శ్రీమదాంధ్ర భగవద్గీత యందు గుణత్రయ విభాగ యోగమను పదునాలుగవ
యధ్యాయము.
పోచిరాజు కామేశ్వర రావు నామధేయ ప్రణీతము.

శ్రీకృష్ణాయ నమః

# శ్రీకృష్ణ సూక్తి సుధాకరము

మూలము శ్రీమద్భగవద్గీత

## అధ్యాయము పదునైదు – పురుషోత్తమ విభాగ యోగము

శ్రీభగవానువాచ ।
ఊర్ధ్వమూలమధఃశాఖమశ్వత్థం ప్రాహురవ్యయమ్ ।
ఛన్దాంసి యస్య పర్ణాని యస్తం వేద స వేదవిత్ ॥

శ్రీభగవానుని పలుకులు:

తే.గీ. వేర్లు పైనను గాండము విరిసి క్రింద
వెలయు నా రావి మ్రానును విబుధు లందు
రవ్యయ మని యాకుల నెవఁ డరయ గలఁడు
వేదములని వాఁ డగు వేద విదుఁడు సుమ్మి 1.

వేర్లు పైనను బోదె క్రింద నున్న రావి చెట్టును విబుధు లవ్యయమని యందురు.
ఆకులను వేదములుగా నెవఁడు గుర్తించునో నతఁడు వేద విదుఁ డగును.

అధశ్చోర్ధ్వం ప్రసృతాస్తస్య శాఖా
గుణప్రవృద్ధా విషయప్రవాలాః ।
అధశ్చ మూలాన్యనుసన్తతాని
కర్మానుబన్ధీని మనుష్యలోకే ॥

తే.గీ. కొమ్మలు పెరుగ గుణముల గోచరములు
చిగురు లయి వ్యాప్తిఁ జెందు నచిరము దిగువ
మీదులఁ బనుల చెఱలను బాదుకొనుచు
వేళ్లు నరలోకమున క్రింద విస్తరిల్లు 2.

త్రిగుణముల వలనఁ గొమ్మలు పెరుగఁగా నింద్రియ విషయములు చిగురు లయి క్రింద
పైన శీఘ్రమే వ్యాప్తి చెందును. పను లను చెఱలఁ బాదుకొని వేళ్ళు నర లోకము

నందుఁ గ్రింద విస్తరిల్లును.

న రూపమస్యేహ తథోపలభ్యతే
నాన్తోన చాదిర్న చ సమ్ప్రతిష్ఠా ।
అశ్వత్థమేనం సువిరూఢమూలం
అసఙ్గశస్త్రేణ దృఢేన ఛిత్త్వా ॥

తే.గీ. ఇచట దీని రూపమ్మది యెఱుఁగ రాదు
మఱియు మొదలు చివర స్థితి యెఱుఁగ రాదు
పాఁతుకొన్న వేళ్లు గల యశ్వత్థమును వి
రక్తి నాబరగు శిత శస్త్రమున నఱికి 3.

దీని రూపము నిచట నెఱుఁగ రాదు. మఱియు దీని మొదలు చివర స్థితులు తెలియ రావు. బాగుగాఁ బాఁతుకొనిన వేళ్లు గల యీ రావి మ్రానును విరక్తి యనెడు వాఁడి శస్త్రమున నఱికి

తతః పదం తత్పరిమార్గితవ్యం
యస్మిన్గతా న నివర్తన్తి భూయః ।
తమేవ చాద్యం పురుషం ప్రపద్యే ।
యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ ॥

తే.గీ. ఏ గతికి నేఁగినఁ దిరిగి రాఁగఁ దరము
కాదొ యట్టి పదము వెదకంగ వలయు
నెవని వలన సనాతన మీ ప్రవృత్తి
పెరిఁగె నతని నాది పురుషు శర ణన వలె 4.

చేరినఁ దిరిగి రానట్టి పదము నన్వేషింప వలెను. సనాతన మైన యీ ప్రవృత్తి యెవని వలన పెరిఁగినదో యట్టి యాది పురుషుని శరణు గోరవలెను.

నిర్మానమోహా జితసఙ్గదోషా
అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః ।
ద్వన్ద్వైర్విముక్తాః సుఖదుఃఖసంజ్ఞై
ర్గచ్ఛన్త్యమూఢాః పదమవ్యయం తత్ ॥

తే.గీ. మాన మోహము లెల్లను మాను వారు
తగులములు లేని వారు నాత్మ విదు లిచ్ఛ
లు సుఖ దుఃఖాది యుగ్మములు గన నట్టి
వారు జ్ఞానులు కందు రవ్యయపుఁ బదము 5.

మోహాభిమానములు లేని వారు, నిస్సంగులు, నధ్యాత్మ జ్ఞాన మున్నవారు, సుఖదుఃఖముల సమానులు, నిచ్ఛలు లేనివారు జ్ఞానులు, పరమ ధామమును బొందెదరు.

న తద్భాసయతే సూర్యో న శశాఙ్కో న పావకః ।
యద్గత్వా న నివర్తన్తే తద్ధామ పరమం మమ ॥

తే.గీ. దేనిఁ జేరి తిరిగి రారో దాని నాదు
ధామమును వెలిఁగింపరు తపన శశులు
నగ్నియును బరమమ్మయి నట్టి దాని
నెవ్విధమ్మునఁ గాంచిన నెన్నఁ డేని 6.

అట్టి నాదు పదమును సూర్య చంద్రులు నగ్నియు ప్రకాశింపఁ జేయ లేరు. అచ్చటకు నేఁగినఁ దిరిగి జన్మ నొందరు.

మమైవాంశో జీవలోకే జీవభూతః సనాతనః ।
మనఃషష్ఠానీన్ద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి ॥

తే.గీ. జీవ లోకమున నమరి జీవ భూతు
నిగ సనాతన మీ కమనీయ మైన
యట్టి నా యంశమె ప్రకృతి యందలి హృద
యేంద్రియము లారు లాగుచు నెలమి నుండు 7.

జీవు లందు నుండి జీవాత్మగ సనాతనమైన నా యంశమే ప్రకృతి యందలి యింద్రియములను మనస్సుతోఁ గలిపి యాఱింటిని నాకర్షించుచుండును.

శరీరం యదవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః ।
గృహీత్వైతాని సంయాతి వాయుర్గన్ధానివాశయాత్ ॥

తే.గీ. పొందు నప్పుడు విడుచు నపుడు శరీర
మును గ్రహించి యా రింద్రియములను వెడలు
నీశ్వరుండు గంధమును గ్రహించి వాయు
వా స్థలము నుండి చను నట్టి యనువు తోఁప 8.

శరీరమును బొందు నపుడు విడుచు నపుడును దేహమునకు నీశ్వరుఁడైన జీవాత్మ యింద్రియము లాఱింటిని గ్రహించి వాయువు వాసనలను గొని చను నట్లు వెడలును.

శ్రోత్రం చక్షుః స్పర్శనం చ రసనం ఘ్రాణమేవ చ ।
అధిష్ఠాయ మనశ్చాయం విషయానుపసేవతే ॥

తే.గీ. ఈ చెవినిఁ గన్నుఁ జర్మము నింక నాలు
కను మఱియు ముక్కును మదినిఁ గదిసి యింపు
గ నధిరోహించి యనుభవించు నీఁక నింద్రి
యార్థముల నెల్ల సతతమ్ము నక్కజముగ 9.

చెవి, కన్ను, ముక్కు, నాలుక, చర్మములను గూడి జీవాత్మ శబ్దాది విషయములను నిత్య మనుభవించును.

ఉత్క్రామన్తం స్థితం వాపి భుఞ్జానం వా గుణాన్వితమ్ ।
విమూఢా నానుపశ్యన్తి పశ్యన్తి జ్ఞానచక్షుషః ॥

తే.గీ. ఉన్న వానిని వెడలుచు నున్న వాని
ననుభవించు వానిని గాని యరయ లేరు
మూఢులు గుణాన్వితు నెపుడు ముదము మీఱ
జ్ఞాన నేత్రులు గాంతురు వాని సతము 10.

దేహ మందున్న వానినిఁ గాని యనుభవించు వానినిఁ గాని పోవు వానినిఁ గాని

మూఢులు  జూడలేరు. జ్ఞాననేత్రులు జూడగలరు.

యతన్తోయోగినశ్చైనం పశ్యన్త్యాత్మన్యవస్థితమ్ ।
యతన్తోఽప్యకృతాత్మానో నైనం పశ్యన్త్యచేతసః ॥

తే.గీ. ఆత్మ యందున్న వానిని నరయఁ గలరు
యోగు లభ్యాస పరులయి యోడుదు రవి
వేకు లారయ నాతని విరివిగ నొన
రించినను శ్రమ నకృతాత్ము లించు కయిన 11.

యోగు లభ్యాసమున నాత్మ యందున్న వాని నరయఁ గలరు. అవివేకు లితరులు
పరిశ్రమించినను మనశ్శుద్ధి లేని వారు చూడలేరు.

యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలమ్ ।
యచ్చన్ద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్ ॥

తే.గీ. ఎట్టి తేజము రవి యందు నిమిడి జగతి
నెల్ల వెలిఁగించు నే ప్రభ యిందు వందు
వహ్ని యందుఁ బరఁగు నట్టి ప్రభ నెఱుఁగుమ
తెల్లముగ నది యెల్ల నాది యనఁగ మది 12.

విశ్వమును వెలిఁగించు సూర్యునిలో నున్నట్టి వెలుఁగు, చంద్రుఁడు నగ్ని లో నున్న
ప్రభలు కూడా నావి యే యై యున్నవని యెఱుఁగుము.

గా మావిశ్య చ భూతాని ధారయా మ్యహ మోజసా ।
పుష్ణామి చౌషధీః సర్వాః సోమో భూత్వా రసాత్మకః ॥

తే.గీ. భూమి యందుఁ బ్రవేశించి భూతముల ధ
రించు చుంటి నేను బలిమి నంచితముగ
నమృత మయుఁడు చంద్రుఁడ నయి యౌషధముల
నెల్లఁ బోషించు చుంటి నేఁ జల్లగాను 13.

భూమిలో నుండి సకల భూత రాశిని బలముతో భరించుచున్నాను. అమృత మయ చంద్రుఁడనై యౌషధముల నెల్లఁ బోషించు చుంటిని.

అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః ।
ప్రాణాపానసమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్ ॥

తే.గీ. అగ్ని నై నేను బ్రాణి కాయమ్ము లందుఁ
జేరి యొప్పిదముగ నటఁ జిత్రముగను
బ్రాణము నపానములఁ గూడి రమ్యముగఁ జ
తుర్విధపు టన్నము లఱిగింతును జెలంగి 14.

అగ్ని నై నేను జీవుల కాయ మందుఁ జేరి ప్రాణాపానములతో నాల్గు రకములైన యన్నము నఱిగింతును.

సర్వస్య చాహం హృది సన్నివిష్టో
మత్తః స్మృతిర్జ్ఞానమపోహనఞ్చ ।
వేదైశ్చ సర్వైరహమేవ వేద్యో
వేదాన్తకృద్వేదవిదేవ చాహమ్ ॥

తే.గీ. అందఱి హృదయమ్ముల లోన నుందు నేను
జ్ఞానము మఱపు స్మృతియును నా వలననె
వేద్యుఁడను వేదముల చేత వేద విదుఁడ
నింక వేదాంత కర్తయు నెల్ల నేన 15.

అందఱి హృదయములలో నుందును. జ్ఞానము, మఱపు, జ్ఞాపకము నావలననే కలుగును. వేదముల వలన తెలియ వలసిన వాఁడను, వేదములు తెలిసిన వాఁడను, వేదాంతములకుఁ గర్తను నేను.

ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ ।
క్షరః సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే ॥

తే.గీ. జగము నందు నక్షరుఁడును క్షరుఁ డనంగ 16.

నిద్దఱు పురుషులుండఁగ నెల్ల భూత
ములు క్షరము లని యక్షరముగ నుడువఁ బ
డు మఱి దేహ మందున్న వాఁడు సతతమ్ము

జగములో నక్షరుఁడు క్షరుఁ డని యిద్దఱు పురుషులు కలరు. భూతము లెల్ల (శరీరములు) క్షరములు. దేహ మందు నున్నట్టి వాఁ డక్షరుఁడు.

ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః ।
యో లోకత్రయమావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః ॥

తే.గీ. ఇంక నొకఁ డుత్తముఁడు గలఁ డిచ్చటఁ బురు
షుండు పిలువఁబడుఁ బరమాత్ముండని యెవఁ
డవ్యయుం డవినాశుఁడు నఖిల జగము
ల వెలసి భరించు వాఁడు దలంపఁ బతియె 17.

మఱి యొక్కఁ డుత్తముఁడు పురుషుఁడు కలఁడు. పరమాత్మ యని పిలువఁబడును. అతఁ డవ్యయుఁడు, నవినాశుఁడు, నఖిల లోకములను భరియించు వాఁడు మఱియు నీశ్వరుఁ డెల్లరకు.

యస్మాత్క్షరమతీతోఽహమక్షరాదపి చోత్తమః ।
అతోఽస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః ॥

తే.గీ. ఎందు వలన క్షరము కన్న నింక నక్ష
రమ్ము కన్న మిన్ననొ యక్కతమ్మునఁ బురు
షోత్తముఁడ నని శ్రుతులయం దుచిత రీతి
లోకములను బ్రసిద్ధుఁడనే కరమ్ము 18.

క్షరముల కన్న నక్షరముల కన్న మిన్న నైన కారణమున నేను బురుషోత్తముఁడ నని యుక్తముగ వేదము లందు లోకము లందుఁ బ్రసిద్ధి కెక్కితిని.

యో మామేవమసమ్మూఢో జానాతి పురుషోత్తమమ్ ।
స సర్వవిద్భజతి మాం సర్వభావేన భారత ॥

తే.గీ. ఎవఁడు జ్ఞానియై నన్నిఁక నెఱుఁగును బురు
షోత్తమునిగ వాఁడు భజించు నుత్తమముగ
సర్వము నెఱిఁగి భారత సకల భావ
ముల సతతము నింపుగ నన్ను తలఁచుచు మది 19.

నన్ను బురుషోత్తమునిగ నెఱిఁగిన వాఁడు సకలము నెఱిఁగి నిత్యము తలఁచుచు నుత్తమముగ భజించును.

ఇతి గుహ్యతమం శాస్త్రమిదముక్తం మయానఘ ।
ఏతద్బుద్ధ్వా బుద్ధిమా న్స్యా త్కృత కృత్యశ్చ భారత ॥

తే.గీ. అతి రహస్య మీ శాస్త్రము ననఘ యిచటఁ
జెప్పితి నిది యెఱింగి రుచిరముగ నగు
బుద్ధిమంతుఁడవు మఱియుఁ బూర్ణ కర్మ
ములఁ దనరుమ భారత యింక నలయకుండ 20.

అర్జునా యతి రహస్య మైన యీ శాస్త్రమును నీకుఁ జెప్పితిని. తగిన విధముగా దీని నెఱిఁగి బుద్ధిమంతుఁడవు కమ్ము. నీ పనులను సక్రమముగాఁ జేయుటకు సిద్ధ పడుము.

ఇది శ్రీకృష్ణ సూక్తి సుధాకరమను శ్రీమదాంధ్ర భగవద్గీత యందుఁ బురుషోత్తమ యోగ మను పదునైదవ యధ్యాయము.
పోచిరాజు కామేశ్వర రావు నామధేయ ప్రణీతము.

శీకృష్ణాయ నమః

# శ్రీకృష్ణ సూక్తి సుధాకరము

మూలము శ్రీమద్భగవద్గీత

## అధ్యాయము పదునాఱు – దైవాసుర సంపద్విభాగ యోగము

శ్రీభగవానువాచ ।
అభయం సత్త్వసంశుద్ధిర్జ్ఞానయోగవ్యవస్థితిః ।
దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయస్తప ఆర్జవమ్ ॥

శ్రీభగవానుని పలుకులు:

తే.గీ. భయము లేకుంటయు నిజ స్వభావ శుచియు
జ్ఞాన యోగ మందుంటయు దాన దమము
లార్జవము వేద పఠనమ్ము యజ్ఞములును
దపము లాదిగ సద్గుణ తతులు నింక 1.

భయమును వీడుటయు, నిర్మల స్వభావము కలిగి యుండుటయు, జ్ఞాన యోగమున నుండుట, దానము, నోర్మియు, ఋజు భావము, వేదాధ్యయనము, యజ్ఞము లాచరించుటయు, తపము లొనర్చుటయు మున్నగు సద్గుణముల తో నుండుట

అహింసా సత్యమక్రోధస్త్యాగః శాన్తిరపైశునమ్ ।
దయా భూతేష్వలోలుప్త్వం మార్దవం హ్రీరచాపలమ్ ॥

తే.గీ. సత్య మక్రోధము నహింస శాంతి నిష్క
పటము త్యాగము నమిత కృపా గుణమ్ము
సకల భూతముల యెడ నచాపలము న
సంగమము మృదుత్వమును లజ్జయు ననంగ 2.

సత్యము క్రోధము లేకుండుట, యహింస, కపటము లేకుండుట, త్యాగము, సకల భూతముల యెడల దయా గుణము, చపలత్వము లేమియు, విరక్తియు, మృదు

స్వభావము సిగ్గు (చెడ్డ పనులు చేయుట యందు) కలిగి యుంట ననఁగ

తేజః క్షమా ధృతిః శౌచమద్రోహో నాతిమానితా ।
భవన్తి సమ్పదం దైవీమభిజాతస్య భారత ॥

తే.గీ. తేజము క్షమయు ధైర్య మతి శుచి నుంట
ద్రోహ హీనము గర్వము తొలఁగి యుంట
యనఁగ గుణములు భారత యడరు దైవ
విభవ సంజాతులకు నెల్ల విశదముగను 3.

భారతా తేజస్సు, క్షమా గుణము, ధైర్యము, శుచిత్వము, ద్రోహ చింత లేకుండుట, నిగర్వము మున్నగు గుణములు దైవ వైభవము కల్గిన వారి లక్షణములు.

దమ్భో దర్పోఽభిమానశ్చ క్రోధః పారుష్యమేవ చ ।
అజ్ఞానం చాభిజాతస్య పార్థ సమ్పదమాసురీమ్ ॥

తే.గీ. అసుర విభవమ్మున జనన మంది నట్టి
వాని కింక మోసమ్ము దర్పమ్ము క్రోధ
ము నభిమానము పౌరుషమ్ము నవివేక
మధికముగఁ బార్థ సంతత మడరు చుండు 4.

పార్థా యసుర సంపద నుద్భవించిన వారు మోసము, గర్వము, కోపము, నభిమానము, పౌరుషము, నవివేకములతో నిత్యము నుందురు.

దైవీ సమ్పద్విమోక్షాయ నిబన్ధాయాసురీ మతా ।
మా శుచః సమ్పదం దైవీమభిజాతోఽసి పాణ్డవ ॥

తే.గీ. దైవ సంపద యగు మోక్ష దాయకమ్ము
బంధ హేతువె యసుర సంబంధ భూతి
నీవు పాండవ యైతివి దైవ విభవ
జాతుఁడవు గాన దుఃఖింపఁ జనదు నీకు 5.

దైవ సంపదఁ బుట్టుట మోక్షదాయకము, దైత్య సంపదఁ బుట్టుట బంధ కారక మగును. అర్జునా నీవు దైవ విభవమున నుద్భవించితివి కావున నీకు దుఃఖింపఁ బని లేదు.

ద్వౌ భూతసర్గౌ లోకేఽస్మిన్దైవ ఆసుర ఏవ చ ।
దైవో విస్తరశః ప్రోక్త ఆసురం పార్థ మే శృణు ॥

తే.గీ. రాక్షసమ్ము దైవ మన విరాజిలును ద్వి
విధపు భూత సంఘాతము విశ్వ మందు
మున్న చెప్పఁబడె వివరముగ నమర యు
తమ్ము నా చే విను మసురత్వమ్ము పార్థ 6.

విశ్వములో దైవము రాక్షము లనఁగ రెండు విధముల జీవ రాశి విరాజిల్లును. అమర సంబంధ మైనది మున్ను వివరముగాఁ జెప్పితిని. ఇప్పుడు రాక్షస భావపు వివరములు తెలిపెదను.

ప్రవృత్తిం చ నివృత్తిం చ జనా న విదురాసురాః ।
న శౌచం నాపి చాచారో న సత్యం తేషు విద్యతే ॥

తే.గీ. ఆసుర జను లెఱుంగరు భాసురముగ
జన్మ మోక్షములను సత్య శౌచము లవి
వారి యందున మఱియు నాచారములును
గాన రావు వెదకఁ గొంచ మైనఁ బార్థ 7.

పార్థా రాక్షస భావపు జనులు జన్మమోక్షముల నెఱుఁగరు. వారిలో సత్యము శుచిత్వము మఱియు నాచారము లుండవు.

అసత్యమప్రతిష్ఠం తే జగదాహురనీశ్వరమ్ ।
అపరస్పరసమ్భూతం కిమన్యత్కామహైతుకమ్ ॥

తే.గీ. వారు జగతి ననుదు రనీశ్వరము మఱియు
నప్రతిష్ఠ మసత్యము యనుచు ధృతిని 8.

సంభవించు నన్యోన్యపు స్పర్శ వలన
సంతతమ్ముఁ గామ ఫలమ యింతియ యని

అసుర భావపు వారు జగత్తున నీశ్వరుఁడు లేఁ డందురు. ఇది యసత్యము నప్రసిద్ధమని యందురు. సంగమము వలన పుట్టుకలు కల్గుచున్న వని యందురు. కామమే మూల మందురు.

ఏతాం దృష్టిమవష్టభ్య నష్టాత్మానోఽల్పబుద్ధయః ।
ప్రభవన్త్యుగ్రకర్మాణః క్షయాయ జగతోఽహితాః ॥

తే.గీ. ఇట్టి దృష్టి నుంచి మదిని నెల్ల నష్ట
చిత్తు లల్ప బుద్ధులు చెడ్డ చేత లందు
నిష్ట మున్న వా రహితులు నీ జగతి వి
నాశమున కందుదురు జననమ్ము భువిని 9.

ఇట్టి బుద్ధి కలిగిన వా రల్పబుద్ధులు వివేక హీనులు. చెడ్డ పనుల యందు నిష్టముతో నుందురు. వీరు శత్రువులు. విశ్వనాశనమునకు వీరు జన్మింతురు.

కామమాశ్రిత్య దుష్పూరం దమ్భమానమదాన్వితాః ।
మోహాద్గృహీత్వాసద్గ్రాహాన్ప్రవర్తన్తేఽశుచివ్రతాః ॥

తే.గీ. కపట మతిశయము మదముల పరమౌచు
నాశ్రయించి కామమ్ము నత్యధికముగను
మోహమునను దురాచారములు గ్రహించి
దుష్ట చరితులు నడచు కొందురు సతతము 10.

కపట మభిమానము, గర్వములను గూడి, కామము నాశ్రయించి, యజ్ఞానముతో దురాచారములతో దుష్ట చరితులు నడచుకొందురు.

చిన్తామపరిమేయాం చ ప్రలయాన్తాముపాశ్రితాః ।
కామోపభోగపరమా ఏతావదితి నిశ్చితాః ॥

తే.గీ. అపరిమిత మయిన తలంపు నాశ్రయించు
వా రగుచు మరణాంతము వఱకు కామ
భోగ పరులెల్ల జీవితంపు పరమార్థ
మిదియ యని నిశ్చయమ్ముగ మదిఁ దలఁచుచు 11.

అపరిమితములైన యాలోచనలతోఁ గామ లాలసులై జీవితపుఁ బరమార్థము
భోగములే యని యెంచుచు మరణాంతము వఱకు

ఆశాపాశశతైర్బద్ధాః కామక్రోధపరాయణాః ।
ఈహన్తే కామభోగార్థమన్యాయేనార్థసఞ్చయాన్ ॥

తే.గీ. ఆశలను వందల కొలఁది పాశములను
గట్టువడి కామ కోపము లట్టుడుకుచు
నుండఁ గామభోగమ్ముల నురువుగఁ బడ
య ధనరాశి వాంఛింతు రన్యాయముగను 12.

వందల కొలది యాస లను త్రాడులఁ గట్టు వడి, కామభోగముల ననుభవించుచు,
నన్యాయంపు విత్త రాసులను వాంచింతురు.

ఇదమద్య మయా లబ్ధమిమం ప్రాప్స్యే మనోరథమ్ ।
ఇదమస్తీదమపి మే భవిష్యతి పునర్ధనమ్ ॥

తే.గీ. దీని నిప్పుడు పొందితి నే నభీష్ట
మియ్యది నిఁకఁ బొందెదు వాఁడ నియ్యె దున్న
దిపుడు తిరిగి ధనమ్ము సందియము లేదు
ముందు నేఁ బొందఁగల వాఁడ ముమ్మరముగ 13.

ఈ కోరికను నే నిప్పుడు పొందితిని. ఇక ముందు నిది బొందఁ గలవాఁడ, యీ విత్త
ముంది యిపుడు ముందును నింక బొందఁ గలను మిక్కుటము నిస్సందియముగ

అసౌ మయా హతః శత్రుర్హనిష్యే చాపరానపి ।
ఈశ్వరోఽహమహం భోగీ సిద్ధోఽహం బలవాన్సుఖీ ॥

తే.గీ. ఈ విరోధి యిప్పుడు వధియింపఁ బడెను
నా వలననె చంపుదు నన్యుఁ జేవ మీఱ
మహిని భోగియు సిద్ధుఁడ మఱియు నీశ్వ
రుండ బలవంతుఁడ నతి సుఖుండ నేను 14.

ఈ శత్రువు నిప్పుడు చంపితిని. ఇంక నన్యుని బలిమిఁ జంపుదును. నేను సిద్ధుఁడను, భోగిని, విభుండను, బలవంతుఁడను మఱియు సుఖిని

ఆఢ్యోఽభిజనవానస్మి కోఽన్యోఽస్తి సదృశో మయా ।
యక్ష్యే దాస్యామి మోదిష్య ఇత్యజ్ఞానవిమోహితాః ॥

తే.గీ. ధనము గలవాఁడ సత్కులోద్భవుఁడ యజ్ఞ
ము లొనరించు వాఁడను దాత ముదము గొనుదు
నన్యుఁ డెవఁడు సాటి యనుచు నజ్ఞత మఱి
మోహమున నను నిత్యము మూరు వారు 15.

ధనవంతుఁడను, సత్కులమునఁ బుట్టిన వాఁడను, యజ్ఞకర్తను, దాతను, హర్ష మొందు వాఁడను, సాటి లేని వాఁడ నని యజ్ఞానముతో మోహమున నిత్యము చెలఁగు వారు

అనేకచిత్తవిభ్రాన్తా మోహజాలసమావృతాః ।
ప్రసక్తాః కామభోగేషు పతన్తి నరకేఽశుచౌ ॥

తే.గీ. మిక్కుటంపుఁ జిత్తభ్రమ లుక్కు మీఱ
మోహ జాలములను గూడి మురియుచుఁ దమిఁ
గామ భోగ లాలసులయి కలుషిత మగు
ఘోర నరక మందు మిగులఁ గుములు చుంద్రు 16.

మతిభ్రమకు లోనై యజ్ఞానమునఁ గోరిక లందు మునిఁగి మురియుచు ఘోర నరకమున కేఁగి బాధలు పడుచుందురు.

ఆత్మసమ్భావితాః స్తబ్ధా ధనమానమదాన్వితాః ।
యజన్తే నామయజ్ఞైస్తే దమ్భేనావిధిపూర్వకమ్ ॥

తే.గీ. తమ్ముఁ బొగడు కొనుచు జడు లెమ్మెయి ధన
మాన మద సహితము నామ మాత్ర యజ్ఞ
ముల నవిధి పూర్వకము గర్వము మితి మీఱఁ
జలుపు చుందురు కపటంపుఁ దలఁపు లడర 17.

జడులు తమను దాము పొగుడు కొనుచు ధనము, గౌరవము,గర్వములతోఁ గూడి విధానములకు భిన్నముగాఁ బేరు కొఱకు యాగములను జేయుదురు. కపటపు టాలోచనలతో నిత్యము నుందురు.

అహఙ్కారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః ।
మామాత్మపరదేహేషు ప్రద్విషన్తోఽభ్యసూయకాః ॥

తే.గీ. నేన యనెడు భావ మ్మభిమానము బల
ము కినుకయుఁ గామము నధికముగను సంశ్ర
యించి నిజ పర తనువుల నెల్ల నున్న
నన్ను ద్వేషించు చుందు రనవరతమ్ము 18.

నే ననెడు భావముతో బలము మానము కోపము కామము నధికము కాఁగాఁ దమ మఱియు నితరుల హృదయము లందు నున్న నన్ను ద్వేషించు చుందురు.

తానహం ద్విషతః క్రూరాన్సంసారేషు నరాధమాన్ ।
క్షిపామ్యజస్రమశుభానాసురీష్వేవ యోనిషు ॥

తే.గీ. పగ నడరు నరాధములను బదరి గ్రూర
మతుల సంసారముల యందు మసల తిరిగి
నేను వారి నుంచెదు నింక నిత్య మసుర
గర్భముల లోపల నశుభ కరుల నెల్ల 19.

పగతో రగులు నరాధములను గోపించి క్రూర మతుల సంసారములలో మసలిన పిదప

తిర్గి వారిని నసురుల గర్భము లందు నుంచుదు నెల్లప్పుడు.

ఆసురీం యోనిమాపన్నా మూఢా జన్మని జన్మని ।
మామప్రాప్యైవ కౌన్తేయ తతో యాన్త్యధమాం గతిమ్ ॥

తే.గీ. దైత్య గర్భము లందునె తగిలి మూఢు
లంత జన్మజన్మల నన్ను సుంత సేర
కుండఁ బోదురు కౌంతేయ యున్న దాని
కన్న నెక్కు డధమ మైన గతికిఁ దిరిగి 20.

దైత్య గర్భము లందుఁ దగులుకొని మూఢులు జన్మ జన్మ లందును నన్ను జేర కుండుదురు. ఉన్న దాని కంటె నధమంపు గతికి బోవుదురు.

త్రివిధం నరకస్యేదం ద్వారం నాశనమాత్మనః ।
కామః క్రోధస్తథా లోభస్తస్మాదేతత్త్రయం త్యజేత్ ॥

తే.గీ. నరకమునకు ద్వారమ్ములు నరుల కెల్లఁ
గాంచఁ గ్రోధము లోభము కామము లన
మూఁడు గుణము లాత్మవినాశము లవి కాన
విడువ వలయు మూడింటినిఁ గడు రయమున 21.

నరుల కెల్లరకుఁ గ్రోధము, లోభము, కామములు మూడును నరకమునకు ద్వారములు. వారి నాశనమునకుఁ గారణములు. కావున నీ మూడింటిని వేగముగ విడువ వలెను.

ఏతైర్విముక్తః కౌన్తేయ తమోద్వారైస్త్రిభిర్నరః ।
ఆచరత్యాత్మనః శ్రేయస్తతో యాతి పరాం గతిమ్ ॥

తే.గీ. చీఁకటికిఁ దలుపులు వీని వీఁక విడువ
నరుఁడు కౌంతేయ మూటిఁ దనకు శుభమ్ముఁ
జేసి కొనును నిశ్చయముగ భాసురముగ
నంతఁ జేరు నిఁకఁ బరమ మైన గతిని 22.

ఈ మూడు చీఁకటి నరక ద్వారములను వీడిన వాఁడు  తనకు శుభము లైనవి
చేసికొనును. అంతఁ బరమంపు గతిని బొందును.

యః శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః ।
న స సిద్ధిమవాప్నోతి న సుఖం న పరాం గతిమ్ ॥

తే.గీ. వీడి శాస్త్రముఁ గోర్కులఁ గూడి యెవఁడు
నడచు నట్టి వాఁ డరయ నేరఁ డీఁక సిద్ధి
నెన్నఁడు సుఖముఁ బొంద లేఁ డింత యేని
యుత్తమంపు గతినిఁ బొంద నోడు నతఁడు 23.

ఎవఁడు శాస్త్రమును వీడి కోరికలతో నుండునో వాఁడు సిద్ధినిఁ బొందఁడు. సుఖమును
బొందఁడు. ఉత్తమ గతికి జేరఁడు.

తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ ।
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తుమిహార్హసి ॥

తే.గీ. అందు వలన శాస్త్రమ్ము నీ కది ప్రమాణ
మగును నిర్ణయింపఁగఁ జేయఁ దగిన తగని
పనులు శాస్త్రమ్ము దెల్పిన పనుల నెఱిఁగి
చేయఁ దగుదు విచ్చట నీవు చింత వీడి 24.

కావున శాస్త్రమే చేయఁ దగిన చేయఁ గూడని పనులకుఁ బ్రమాణ మగును  నీకు
నర్జున.  శాస్త్ర సమ్మతపు బనులను దెలిసికొని వానిని నిచట దుఃఖమును వీడి నీవు
చేయఁ దగుదువు.

ఇది శ్రీకృష్ణ సూక్తి సుధాకరమను శ్రీమదాంధ్ర భగవద్గీత యందు దైవాసుర సంపద్విభాగ యోగమను పదునాఱవ
యధ్యాయము.
పోచిరాజు కామేశ్వర రావు నామధేయ  ప్రణీతము.

శ్రీకృష్ణాయ నమః

# శ్రీకృష్ణ సూక్తి సుధాకరము

మూలము శ్రీమద్భగవద్గీత

## అధ్యాయము పదునేడు – శ్రద్ధాత్రయ విభాగ యోగము

అర్జున ఉవాచ ।
యే శాస్త్రవిధిముత్సృజ్య యజన్తే శ్రద్ధయాన్వితాః ।
తేషాం నిష్ఠా తు కా కృష్ణ సత్త్వమాహో రజస్తమః ॥

అర్జునుని పలుకులు:

తే.గీ. యెవరు శాస్త్ర పద్ధతి వీడి యింపొసఁగెడు
శ్రద్ధ తోడ సేవింతురో యిద్ధర మఱి
వారి స్థితి యది యెయ్యది పన్నుగఁ దెలు
పుము రజస్సత్త్వ తమముల మూటిఁ గృష్ణ 1.

శ్రద్ధను గలిగి యుండియు శాస్త్ర పద్ధతులను వీడి సేవించు వారి స్థితి యెట్లుండునో
త్రిగుణము లందు నెద్ది యగునో తెలుపుము కృష్ణా.

శ్రీభగవానువాచ ।
త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా ।
సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి తాం శృణు ॥

శ్రీభగవానుని పలుకులు:

తే.గీ. సాత్త్వికము రాజసము తామసమ్ము ననఁగ
దేహు లందున శ్రద్ధలు త్రివిధములుగ
నుండు నైజ మనుసరించి మెండుగ వివ
రించెద వినుమ వానిని నంచితముగ 2.

దేహు లందు సాత్త్వికము, రాజసము మఱియుఁ దామస మని స్వభావము
ననుసరించి మూడు విధముల శ్రద్ధ లుండును. వానిని వివరించెదను విను మర్జున.

సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత ।
శ్రద్ధామయోఽయం పురుషో యో యచ్ఛ్రద్ధః స ఏవ సః ॥

తే.గీ. ఎల్లరకు వారి నైజము వల్లఁ గలుగు
శ్రద్ధ భారత పురుషుఁడు సంతతమ్ము
నెంచ శ్రద్ధా మయుఁడ యతఁ డెట్టి శ్రద్ధఁ
గలిగి యుండు నట్టి నరునిగనె యెఱుఁగుమ 3.

అర్జునా యెల్లరకు వారి వారి నైజము వలన శ్రద్ధ కలుగును. ఎవరి కెట్టి శ్రద్ధ కలుగునో
యతఁ డట్టి నరుఁ డని యెఱుఁగుము.

యజన్తే సాత్త్వికా దేవాన్యక్షరక్షాంసి రాజసాః ।
ప్రేతాన్భూతగణాంశ్చాన్యే యజన్తే తామసా జనాః ॥

తే.గీ. సాత్త్వికులు యజింతురు దేవ సంచయమును
రాజసులు యక్ష రాక్షస వ్రాతము నిఁక
నన్యు లా తామస పురుషు లర్చన లొన
రింతు రీ ప్రేత గణ భూత సంతతి నెద 4.

సాత్త్వికులు దేవతలను, రాజసులు యక్ష రాక్షసులను, దామసులు భూత ప్రేత
గణములను బూజింతురు.

అశాస్త్రవిహితం ఘోరం తప్యన్తే యే తపో జనాః ।
దమ్భాహఙ్కారసంయుక్తాః కామ రాగ బలాన్వితాః ॥

తే.గీ. కపటమును గర్వమును గూడి కామ రాగ
బలయుతులు శాస్త్రముల లేని పద్ధతులు ద
లంచి ఘోరమైన తపము నెంచి యెవరు
సంయతిని చేయుదురొ యట్టి జనుల నరయ 5.

కపటము, గర్వము లుండఁ గామము తగులము బలము కలవారు శాస్త్రములలో లేని

విధముగ ఘోర మైన తపస్సు చేయు చుందురో వారు

కర్షయన్తః శరీరస్థం భూతగ్రామమచేతసః ।
మాం చైవాన్తఃశరీరస్థం తాన్విద్ధ్యాసురనిశ్చయాన్ ॥

తే.గీ. ఇంద్రియములను దేహమం దెలమి నున్న
నన్ను గృశియింపఁ జేయుచు నున్న వారు
నిర్వివేకులు వారిని నేర వలయు
నసుర భావము గల వార యంచు నింక 6.

వారి యింద్రియములను, వారి దేహము లో నున్న నన్ను గృశింపఁ జేయు చున్నట్టి యవివేకులు. వారిని రాక్షస భావము కల వారిగా నెఱుఁగ వలయును.

ఆహారస్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః ।
యజ్ఞస్తపస్తథా దానం తేషాం భేదమిమం శృణు ॥

తే.గీ. తలఁప నందఱి తిండియు వెలుఁగు మూడు
విధములఁ దనరి మిక్కిలి ప్రియము నొసఁగ
యజ్ఞము తపము దానము నవియు నట్ల
వాని భేద మెఱుంగుమ పార్థ యిపుడు 7.

పార్థా యాహారము, యజ్ఞము, తపము, దానములు గూడ మూడు విధములు. వాని భేదమును తెలిసికొనుము.

ఆయుఃసత్త్వబలారోగ్యసుఖప్రీతివివర్ధనాః ।
రస్యాః స్నిగ్ధాః స్థిరా హృద్యా ఆహారాః సాత్త్వికప్రియాః ॥

తే.గీ. ఆయు రారోగ్యములు బల మమిత సుఖము
సత్త్వ గుణము ముదమ్ముల సాఁకు నవియు
స్థిరము లతి హృద్యములు మఱి స్నిగ్ధములును
రసములును సాత్త్వికులకు కరము ప్రియములు 8.

ఆయువు, నారోగ్యము, బలము, సుఖము, సంతోషములను సత్త్వ గుణమును వృద్ధి పఱచునవి, స్థిరముగా నుండునవి, మనస్సునకుఁ బ్రీతి యయినవి, చమురు గలవి, రస వంతములును సాత్త్వికులకుఁ బ్రియములు.

కట్వామ్ల లవ ణాత్యుష్ణ తీక్ష్ణ రూక్ష విదాహినః ।
ఆహారా రాజస స్యేష్టా దుఃఖశోకామయప్రదాః ॥

తే.గీ. చేదు పులు పుప్పు కారము చెలఁగు నవియు
వేడి యైనవి మఱి గట్టివియును దాహ
మిచ్చు నాహారములఁ బ్రీతి మెండు రాజ
సులకు బహు దుఃఖ శోకదములు ప్రియములు 9.

చేదు, పులుపు, నుప్పు, కారముగా నున్నవి, వేడివి, గట్టివి, దాహమును బెంచు నట్టి యాహారములు రాజసులకుఁ బ్రీతి. అవి దుఃఖము, శోకములను గలిగించును.

యాతయామం గతరసం పూతి పర్యుషితం చ యత్ ।
ఉచ్ఛిష్టమపి చామేధ్యం భోజనం తామసప్రియమ్ ॥

తే.గీ. జాము గడచిన యన్నము చల్లనిదియు
నరసము చెడినదియుఁ గర మశుచి యైన
దియును దినఁగ మిగిలి నట్టిది యగుఁ దిండి
తామసులకు నగును బ్రియ తమము సతము 10.

జాము మించిన, చల్లని యన్నము, వొడిగ నున్నవి, చెడినవి, శుభ్రము లేనివి, మిగిలి పోయినవియుఁ దామసులకుఁ బ్రీతి.

అఫలాకాఙ్క్షిభి ర్యజ్ఞో విధిదృష్టో య ఇజ్యతే ।
యష్టవ్య మే వేతి మనః సమాధాయ స సాత్త్వికః ॥

తే.గీ. ఫలము నాశింపకయుఁ జెప్పఁ బడిన రీతి
శాస్త్రముల యందుఁ దప్పక సలుప వలయు
నంచు మన మందు నెంచి యే యజ్ఞ మాచ 11.

రింతు రది సాత్త్విక మ్మగు సంతతమ్ము

శాస్త్రము లందుఁ జెప్పిన రీతి ఫలముల పై నాశ లేక చేసెడు యజ్ఞ కర్మములు సాత్త్వికములు.

అభిసన్ధాయ తు ఫలం దమ్భార్థమపి చైవ యత్ ।
ఇజ్యతే భరతశ్రేష్ఠ తం యజ్ఞం విద్ధి రాజసమ్ ॥

తే.గీ. ఆశ పడి ఫలమందు దంభార్థ మింక
నెట్టి యజ్ఞముఁ జేకొని యెవ్వ రేనిఁ
జేయుదురొ తమిని భరతశ్రేష్ట దాని
నెఱుఁగుమ మది రాజస మని యెలమి నీవు 12.

అర్జునా ఫలముల నాశించి గొప్ప కొఱకుఁ జేయు యజ్ఞము రాజస మగును.

విధిహీనమసృష్టాన్నం మన్త్రహీనమదక్షిణమ్ ।
శ్రద్ధావిరహితం యజ్ఞం తామసం పరిచక్షతే ॥

తే.గీ. శాస్త్ర పద్ధతి వీడి యశన వితరణ
మొల్లకయు మంత్ర హీనమై యుండి యొండు
దక్షిణల నీయకుండ సుంతయు నెఱుఁగక
శ్రద్ధ సేయు యజ్ఞము తామసమ్ము సుమ్ము 13.

శ్రద్ధ లేకుండ, శాస్త్రముల ననుసరింపక, మంత్ర హీనమై, యన్న దానము చేయక దక్షిణల నీయక చేసెడు యజ్ఞము తామసము.

దేవద్విజగురుప్రాజ్ఞ పూజనం శౌచ మార్జవమ్ ।
బ్రహ్మచర్య మహింసా చ శారీరం తప ఉచ్యతే ॥

తే.గీ. దేవతలను బండితులను ద్విజులను మఱి
గురువులను భక్తి మీఱఁగఁ గొలుచుటయును
బ్రహ్మచర్య మహింస శుభ్రతయు నార్జ 14.

వములు శారీరకంపుఁ దపము లనఁబడు

దేవతలను, విద్వాంసులను, బ్రాహ్మణులను, గురువులను, భక్తి సేవించుచు బ్రహ్మ
చర్యము, నహింస, శుభ్రత, ఋజువర్తనముల నుండుట శారీరకపుఁ దపములు.

అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్ ।
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే ॥

తే.గీ. వెఱ వొసఁగనివి నిజములు ప్రియము హితము
నొసఁగు నెట్టి వట్టి పలుకు లొలుకటయును
వేద పఠన మభ్యసనముఁ బాదుకొనఁగ
దాని వాఙ్మయ తపమని తలఁప వలయు 15.

భయము నీయనివి, నిజములు, ప్రియములు, హితకరము లగు పలుకులు
పలుకుట, వేద పఠనము, నభ్యాసములు వాఙ్మయ తప మనఁబడును.

మనః ప్రసాదః సౌమ్యత్వం మౌనమాత్మవినిగ్రహః ।
భావసంశుద్ధిరిత్యేతత్తపో మానసముచ్యతే ॥

తే.గీ. మనము నందు ప్రశాంతియు మౌన మాత్మ
నిగ్రహము మృదుత్వము మదిని శుచియు నవి
యెల్లఁ బరఁగు చుండిన దాని నెఱుఁగ వలయు
మానసంపుఁ దప మనంగ మానితముగ 16.

మనస్సును బ్రశాంతముగా నుంచుట, మౌనము, నాత్మనిగ్రహము,
మృదుత్వము, చిత్త శుద్ధి వహించుట యివి మానసిక తపములు.

శ్రద్ధయా పరయా తప్తం తపస్తత్త్రివిధం నరైః ।
అఫలాకాఙ్క్షిభిర్యుక్తైః సాత్త్వికం పరిచక్షతే ॥

తే.గీ. యోగులైన నరులు శ్రద్ధ నుంచి యుత్త 17.

మముగ నింక నీ మూడు తపముల నాచ
రింప వీడి యాస ఫలమం దింపుగాను
దాని సాత్త్విక మందురు తథ్యముగను

యోగు లైన మానవులు శ్రద్ధతో నీ మూడు తపముల నాచరించి ఫలములపై నాశ వీడి వర్తించుట సాత్త్విక మనఁ బడును.

సత్కారమానపూజార్థం తపో దమ్భేన చైవ యత్ ।
క్రియతే తదిహ ప్రోక్తం రాజసం చలమధ్రువమ్ ॥

తే.గీ. గౌరవమ్ము సన్మానమ్ము గోరి పూజ
కొఱకును గపటంపుఁ దలఁపు మెఱయు చుండ
నే తప మొనరింతురొ యది యెన్నఁ జలము
నధ్రువ తపము రాజస మనఁగఁ జెల్లు 18.

గౌరవము సత్కారము పూజ లందు కొనుటకుఁ గపటపు బుద్ధితో బట్టుదలతో, క్షణికము ననిశ్చిత ఫలము నిచ్చునదియు నైన తపము రాజస తపము.

మూఢగ్రాహేణాత్మనో యత్పీడయా క్రియతే తపః ।
పరస్యోత్సాదనార్థం వా తత్తామసముదాహృతమ్ ॥

తే.గీ. మూర్ఖత నలముకొని తన్ను ముమ్మరముగ
నొవ్వఁ జేసికొని పరులను సమయింప
నెంచి యైనఁ జేయుచు నుందు రెట్టి తపము
దాని నంద్రు తామస మనుమాన మేల 19.

మూర్ఖత్వముతోఁ దన్ను మిక్కిలి కష్ట పెట్టు కొనుచు నితరులకు హాని చేయఁ గోరి చేసెడు తపము తామస తపము.

దాతవ్యమితి యద్దానం దీయతేఽనుపకారిణే ।
దేశే కాలే చ పాత్రే చ తద్దానం సాత్త్వికం స్మృతమ్ ॥

తే.గీ. దేశ కాలము లందెయ్యది యగు నీయఁ
దగినది తగఁ బాత్రునకుఁ దిరిగి యుపకృతిఁ
జేయ లేని వానికి నేది చేయ నేర్తు
రట్టి దానము సాత్త్విక మనఁగ నొప్పు 20.

దేశాకాలముల ననుసరించి యీఁ దగిన యట్టి దానినిఁ బాత్రునకుఁ దిరిగి
యుపకారము చేయ లేని వానికిఁ జేసెడు దానము సాత్త్విక దానము.

యత్తు ప్రత్యుపకారార్థం ఫల ముద్దిశ్య వా పునః ।
దీయతే చ పరిక్లిష్టం తద్దానం రాజసం స్మృతమ్ ॥

తే.గీ. తిరిగి మేలు గోరి ఫలిత మరసి కాని
కష్టమై చెలంగెడు నట్టి దృష్టి తోఁప
నెట్టి దైనట్టి దానము నిత్తు రట్టి
దాన మంతయు రాజస మౌను జుమ్ము 21.

తిరిగి మేలును గోరుకొని కాని ఫలితము నాశించి కాని, కష్టమని మది నెంచుచుఁ
జేసెడు దానము రాజస దానము.

అదేశకాలే యద్దానమపాత్రేభ్యశ్చ దీయతే ।
అసత్కృతమవజ్ఞాతం తత్తామసముదాహృతమ్ ॥

తే.గీ. తగని దేశ కాలముల నాదరము లేక
చిన్న చూపుఁ జూచుచు ననుచితుల కిత్తు
రెట్టి దానము దానిని నెల్ల రింకఁ
దామసమ్మని యందురు తథ్యముగను 22.

దేశకాల విరుద్ధముగఁ జిన్న చూపుతో నాదరము లేక, యనర్హులకు నిచ్చు దానము
తామస దానము.

ఓంతత్సదితి నిర్దేశో బ్రహ్మణస్త్రివిధః స్మృతః ।
బ్రాహ్మణాస్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా ॥

తే.గీ. ఓమ్మనియు తత్తనియు మఱియుఁ గన సత్త
నియును మూడు పేళ్లున్నవి నెగడి బ్రహ్మ
మునకు నాదిఁ బుట్టెను వేదములు క్రతువులు
బ్రాహ్మణు లతని చే నని పలుకఁ బడెను 23.

ఓమ్మని, తత్తని, సత్తనియు మూడు విధము లగు పేళ్లు బ్రహ్మమునకు గలవు.
ముందుగా వేదములు, యజ్ఞములు, బ్రాహ్మణు లతని నుండియే పుట్టిరి.

తస్మాదోమిత్యుదాహృత్య యజ్ఞదానతపఃక్రియాః ।
ప్రవర్తన్తే విధానోక్తాః సతతం బ్రహ్మవాదినామ్ ॥

తే.గీ. అందు వలన నోమ్మనియ బ్రాహ్మణులు మొద లి
డుదురు శాస్త్రము లందు నుడువఁ బడిన త
పముల యజ్ఞ దానమ్ముల పనుల నెల్ల
సంతసమ్మునఁ దనరుచు సంతతమ్ము 24.

అందు చేతనే బ్రాహ్మణులు శాస్త్ర విదితములైన తపము లందు, యజ్ఞ దానముల
పనుల యందు నెల్ల నోమ్మని మొదలిడుదురు.

తదిత్యనభిసన్ధాయ ఫలం యజ్ఞతపఃక్రియాః ।
దానక్రియాశ్చ వివిధాః క్రియన్తే మోక్షకాఙ్క్షిభిః ॥

తే.గీ. తత్తనుచుఁ జేయుదురు యజ్ఞ తపములు మఱి
రుచిర దాన క్రియలను బలు విధములను
మోక్ష మరయు వా రే ఫలముల నొకింత
యేని యాశింప కుండక నెలమి నెపుడు 25.

యజ్ఞములు తపములు దానములు మున్నగునవి మోక్షమును గోరు వా రితర
ఫలముల నాశింపకయే తత్తని యాచరింతురు.

సద్భావే సాధుభావే చ సదిత్యేతత్ప్రయుజ్యతే ।

ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ యుజ్యతే ॥

తే.గీ. సత్తనెడు భావ మందున సాధు భావ
మందునను సత్తనెడి పద మంచితముగ
వాడఁబడు చున్న దిది మంచి పనుల యందుఁ
గూడ మఱి పార్థ ముందుగ వాడఁ బడును 26.

స త్తను (శ్రేష్ఠుఁ డను) భావము నందును, మంచి యను భావమందు, సత్తు పదము వాడఁబడును. మంచి పనులు చేయు నప్పుడును సత్తు శబ్దము వాడఁ బడును.

యజ్ఞే తపసి దానే చ స్థితిః సదితి చోచ్యతే ।
కర్మ చైవ తదర్థీయం సదిత్యేవాభిధీయతే ॥

తే.గీ. యజ్ఞముల తపముల యీవు లందలి స్థితి
సత్తని నుడువఁ బడును నిశ్చయముగ నిట
బ్రహ్మను గుఱించి చేసెడి పనులు గూడ
సత్తనియె చెప్పఁ బడు నింక సత్యముగను 27.

యజ్ఞములు, తపములు, దానముల యందలి స్థితిని సత్తని యందురు. బ్రహ్మము కొఱకుఁ జేయు పనిని కూడ సత్తని యే చెప్పుదురు.

అశ్రద్ధయా హుతం దత్తం తపస్తప్తం కృతం చ యత్ ।
అసదిత్యుచ్యతే పార్థ న చ తత్ప్రేత్య నో ఇహ ॥

తే.గీ. శ్రద్ధ లేక హోమ మొనర్పఁ జలుప తపము
దాన మీయఁ బనినిఁ జేయ వీని నెల్ల
నందు రింక నసత్తులె యని ఫలమ్ము
నీయ విహ పరమ్ములఁ బార్థ యెన్నఁ డైన 28.

అర్జునా శ్రద్ధ లేక హోమములు చేసినను, దపములు చేసినను, బను లొనరించిన నివి యెల్లయు నసత్తు లనియే చెప్పఁబడును. ఇవి ఫలముల నిహ పరము లం దెన్నఁడు నీయవు.

ఇది శ్రీకృష్ణ సూక్తి సుధాకరమను శ్రీమదాంధ్ర భగవద్గీత యందు శ్రద్ధాత్రయ విభాగ యోగమను పదునేడవ యధ్యాయము.

పోచిరాజు కామేశ్వర రావు నామధేయ ప్రణీతము.

శ్రీకృష్ణాయ నమః

# శ్రీకృష్ణ సూక్తి సుధాకరము

మూలము శ్రీమద్భగవద్గీత

## అధ్యాయము పదునెనిమిది – మోక్ష సన్న్యాస యోగము

అర్జున ఉవాచ
సంన్యాసస్య మహాబాహో తత్త్వమిచ్ఛామి వేదితుమ్ ।
త్యాగస్య చ హృషీకేశ పృథక్కేశినిషూదన ॥

అర్జునుని పలుకులు:

తే.గీ. ఎఱుఁగఁ గోరుదు సన్న్యాస మెట్టి రూప
మలరి యుండు మహాబాహు వటులె త్యాగ
మెవ్విధ మగు హృషీకేశ యెలమిఁ జెపుమ
నాకు కేశినిషూదన నైజ మెల్ల 1.

మహాబాహూ కేశివినాశకా కృష్ణా సన్న్యాసము త్యాగము లివి వేఱు వేఱుగ నెవ్విధి నుండునో వివరముగాఁ దెలియఁ గోరెదను.

శ్రీభగవానువాచ ।
కామ్యానాం కర్మణాం న్యాసం సంన్యాసం కవయో విదుః ।
సర్వకర్మఫలత్యాగం ప్రాహుస్త్యాగం విచక్షణాః ॥

శ్రీభగవానుని పలుకులు:

తే.గీ. కోరికల తోటి పనులను మూరి వీడు
ట యది సన్న్యాస మంచు నరయుదు రింకఁ
గవులు పనుల ఫలము లన్ని కలఁత పడక
వీడుటయ త్యాగ మందురు విబుధ వరులు 2.

కోరిక లున్నట్టి పనులను వీడుట సన్న్యాసమని కవులు చెప్పెదరు. అన్ని పనుల

ఫలములను ద్యజించుట త్యాగ మని విబుధు లందురు.

త్యాజ్యం దోషవదిత్యేకే కర్మ ప్రాహుర్మనీషిణః ।
యజ్ఞదానతపఃకర్మ న త్యాజ్యమితి చాపరే ॥

తే.గీ. దోషము వలెఁ గర్మము విబుధులు త్యజింప
వలయు నందురు కొందఱు పరులు యజ్ఞ
దాన తపముల పను లవి తథ్యముగను
విడువఁ దగ వందు రెందు వివేక మతులు 3.

కర్మమును దోషమును వీడు నట్లు విడువ వలె నని కొందఱు పండితులు
చెప్పుదురు. యజ్ఞములకు, దానములకుఁ దపములకు సంబంధించిన పనులను
వీడ రాదని వివేకవంతు లైన మఱి కొందఱు వచింతురు.

నిశ్చయం శృణు మే తత్ర త్యాగే భరతసత్తమ ।
త్యాగో హి పురుషవ్యాఘ్ర త్రివిధః సమ్ప్రకీర్తితః ॥

తే.గీ. అట్టి త్యాగ విషయమున నర్జున మఱి
నాదు నిశ్చయమ్మును విను నరవరేణ్య
త్యాగ మయ్యది మూడు చందమ్ము లనుచు
భరత సత్తమ కీర్తింపఁ బడుచు నుండు 4.

అర్జున త్యాగ విషయమున నా నిశ్చయ మైన యభిప్రాయమును వినుము. ఈ
త్యాగము మూడు విధముల నుండును.

యజ్ఞదానతపఃకర్మ న త్యాజ్యం కార్యమేవ తత్ ।
యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్ ॥

తే.గీ. విడువ రాదు కర్మముల నెన్నఁ డవి యజ్ఞ
దాన తపముల కొఱకైనఁ దప్పక యొన
రింప నొప్పుఁ బావన మొనరించు నవి వి
వేకవంతుల నెల్లర విస్మయముగ 5.

అర్జునా యజ్ఞ దాన తపముల కొఱకుఁ జేయు పనుల నెల్లప్పుడు చేయ వలెను. అవి వివేకవంతులను బుణ్యవంతులను జేయును.

ఏతాన్యపి తు కర్మాణి సఙ్గం త్యక్త్వా ఫలాని చ ।
కర్తవ్యానీతి మే పార్థ నిశ్చితం మతముత్తమమ్ ॥

తే.గీ. ఈ పనులను గూడి మఱియు నెట్టి యాశ
నుంచక ఫలములం జేయు చుండ వలెను
జేయఁ దగిన పను లని సుస్థిరపు టుత్త
మంపు మత మంచితమ్ముగం బార్థ నాది 6.

ఎట్టి ఫలము నాశింపక యీ పనులతోఁ గలిపి చేయఁ దగిన పనుల నన్నింటినిఁ జేయ వలె నని యుత్తమ మైన నా నిశ్చ యాభిప్రాయము.

నియతస్య తు సంన్యాసః కర్మణో నోపపద్యతే ।
మోహాత్తస్య పరిత్యాగస్తామసః పరికీర్తితః ॥

తే.గీ. కర్మములు సేయఁ దగినవి కావు విడువ
వలసినవి యెన్నఁ డేనని తెలియ వలయు
మోహమున వీడ వానినిఁ బూర్ణముగను
దామసమ్మని దానినిఁ దలఁపఁ దగును 7.

చేయఁ దగిన పను లెన్నఁడును విడువ వలసినవి కావని తెలిసికొన వలెను.
మోహము చేత వానిని విడిచిన నది తామస మని యెఱుఁగ వలెను.

దుఃఖమిత్యేవ యత్కర్మ కాయక్లేశభయాత్త్యజేత్ ।
స కృత్వా రాజసం త్యాగం నైవ త్యాగఫలం లభేత్ ॥

తే.గీ. తను వలయు నని భయ మంది తాప దాయ
కమ్మనుచు నే పని విడుచుఁ గలవరపడి
యట్టి త్యాగము రాజస మగును జుమ్ము 8.

త్యాగ ఫలమును బొందఁడు తథ్యముగను

శరీర మలసిపోవునని సంతాపము లొసఁగు నని భయపడి కార్యములను విడిచిన నట్టి త్యాగము రాజసము. దాని వలన త్యాగ ఫలమును కూడా పొందఁడు.

కార్యమిత్యేవ యత్కర్మ నియతం క్రియతేఽర్జున ।
సఙ్గం త్యక్త్వా ఫలం చైవ స త్యాగః సాత్త్వికో మతః ॥

తే.గీ. ఆశను ఫలితమును గూడ నంచితముగ
వీడి యర్జున కర్మము విహిత మంచు
నెంచి యెట్టి పనినిఁ జేయు నెలమి యట్టి
త్యాగ మగు సాత్త్వికము నా మతమ్ము నందు 9.

తప్పక చేయ వలసినవి యని తలంచి పనులు చేయుచు వానిపై నాసక్తిని ఫలితములను వీడిన నది సాత్త్విక త్యాగ మగును.

న ద్వేష్ట్యకుశలం కర్మ కుశలే నానుషజ్జతే ।
త్యాగీ సత్త్వసమావిష్టో మేధావీ ఛిన్నసంశయః ॥

తే.గీ. ఇంపుఁ గూర్పని పనిని ద్వేషింపఁ డెపుడు
నింపయిన పనికిని సంతసింపఁ డతఁడు
సత్త్వ గుణ మున్న వాఁడు సంశయము లేని
వాఁడు విబుధుండు త్యాగియై పరఁగు వాఁడు 10.

అనిష్టము లైన పనులను ద్వేషింపక, యిష్టమైన వానిపై రక్తి నుంచక సందేహములు లేక చరించు వాఁడు సత్త్వ గుణమున్న వాఁడు, విబుధుఁ డయిన వాఁడు త్యాగి.

న హి దేహభృతా శక్యం త్యక్తుం కర్మాణ్యశేషతః ।
యస్తుకర్మఫలత్యాగీ స త్యాగీత్యభిధీయతే ॥

తే.గీ. నరులకుఁ బను లశేషము తరము గాదు
వీడ వాని ఫలమ్మును వీడు నెవఁడు 11.

రక్తి నుంచక యుంచుక యుక్తుఁ డతఁడు
త్యాగి యని పిలువంబడఁ దథ్యముగను

పనులను బూర్తిగా విడుచుట నరులకు సాధ్యము కాదు. వాని ఫలమును మఱియుఁ దగులమును వీడిన వాఁడు కర్మ యుక్తుఁడు త్యాగి యనబడును.

అనిష్టమిష్టం మిశ్రం చ త్రివిధం కర్మణః ఫలమ్ ।
భవత్యత్యాగినాం ప్రేత్య న తు సంన్యాసినాం క్వచిత్ ॥

తే.గీ. ముివ్విధములు కర్మపు ఫలములు కలుగు న
త్యాగు లైన వారికి నెల్లఁ దలఁప నిష్ట
ములు ననిష్టములును మిశ్రములు పరమునఁ
ద్యాగులకు నుండ వించుక యైన నెపుడు 12.

త్యాగులు కాని వారికి పర మందు మూడు ఫలములు కలుగును. అవి యిష్ట మైనవి యిష్టము కానివి మిశ్రము లైనవి. త్యాగులకుఁ గర్మముల వలన నెట్టి ఫలము లెన్నఁడు నుండవు.

పఞ్చైతాని మహాబాహో కారణాని నిబోధ మే ।
సాఙ్ఖ్యే కృతాన్తే ప్రోక్తాని సిద్ధయే సర్వకర్మణామ్ ॥

తే.గీ. కారణము లైదు సుమి పొందఁగఁ బను లన్ని
టి పరిపూర్తిని విను మన్నిటి నిట నుడువ
నేను మున్న చెప్పఁ బడియె నిశ్చయముగ
సాంఖ్య సిద్ధాంత మందును జక్కఁగ నవి 13.

పను లన్నిటి పరి పూర్తికి నైదు కారణములు మున్ను సాంఖ్య సిద్ధాంతము నందు నాచేఁ జెప్పఁ బడినవి. వానిని జెప్పెద వినుము.

అధిష్ఠానం తథా కర్తా కరణం చ పృథగ్విధమ్ ।
వివిధాశ్చ పృథక్చేష్టా దైవం చైవాత్ర పఞ్చమమ్ ॥

తే.గీ. ఆశ్రయంబైన దేహము నంచితంపుఁ
గర్తయును వివిధము లగు కరణములును
బలురకంపు వేర్వే రైన పనులు దైవ
మైదు గాంచఁ గారణములై యలరు చుండు 14.

దేహము, కర్తయు, నింద్రియములు, వివిధము లైన పనులు, దైవము లీ యైదును కారణములు.

శరీరవాఙ్మనోభిర్యత్కర్మ ప్రారభతే నరః ।
న్యాయ్యం వా విపరీతం వా పఞ్చైతే తస్య హేతవః ॥

తే.గీ. కాయము మనస్సు వాక్కులఁ జేయు పను లె
వి మొదలిడును బురుషుఁ డట్టివి నయము లయి
న ననయము లైన నైదు నగును సురుచిర
మైన యట్టి కారణములు వాని కెల్ల 15.

మనోవాక్కాయములచే నరుఁ డే పనిని మొద లిడునో యది న్యామైన నన్యాయ మైనను దానికి నీ యైదు కారణములు.

తత్రైవం సతి కర్తారమాత్మానం కేవలం తు యః ।
పశ్యత్యకృతబుద్ధిత్వాన్న స పశ్యతి దుర్మతిః ॥

తే.గీ. ఇవ్విధిని నుండఁ గేవల మెంచుఁ దన్ను
గర్త యంచు దుర్బుద్ధినిఁ గర్మములకుఁ
దగ నెవండు వివేక ముడిగిన వాఁడు
గాంచ వాఁడు నిక్కమ్మును గాంచ లేఁడు 16.

ఈ విధముగా నుండఁగాఁ నా పనులకుఁ దనను గర్తగా నెంచు దుర్బుద్ధి యవివేకుఁడు నిక్కమును జూచిన వాఁడు కాదు.

యస్య నాహఙ్కృతో భావో బుద్ధిర్యస్య న లిప్యతే ।
హత్వాఽపి స ఇమాఁల్లోకాన్న హన్తి న నిబధ్యతే ॥

తే.గీ. తాన కర్త యని యెవఁడు తలఁప కుండు
దేని యందును దగులమ్ముఁ బూన కుండు
వాఁడు లోకము లెల్లఁ జెండాడఁ గాఁడు
హంత బంధింపఁ బడఁడు దా నింత యేని 17.

తన్ను గర్తగా దలఁపని వాఁడు, దేని యందు నాస నుంచని వాఁడు లోకములను జెండాడినను హంతగా నెంచఁ బడఁడు. ఆ కర్మములచేఁ గొంచె మైనను బంధింపఁ బడఁడు.

జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మచోదనా ।
కరణం కర్మ కర్తేతి త్రివిధః కర్మసఙ్గ్రహః ॥

తే.గీ. తెలివి తెలియఁ దగినదియుఁ దెలియు వాఁడ
నంగ మూడు విధమ్ముల నడరుఁ గర్మ
చోదకములు పని యుచిత సాధనమ్ము
కర్త మూడును గర్మ సంగ్రహము లెంచ 18.

జ్ఞానము, తెలియఁ దగినది, తెలియు వాఁడు నని మూడు విధములు కర్మమును బ్రేరేపించునవి. పనియు, సాధనము, కర్త యని యీ మూడు కర్మ సంగ్రహములు.

జ్ఞానం కర్మ చ కర్తా చ త్రిధైవ గుణభేదతః ।
ప్రోచ్యతే గుణసఙ్ఖ్యానే యథావచ్ఛృణు తాన్యపి ॥

తే.గీ. కర్మ కర్తలు జ్ఞానము గాంచ మూడు
రకములు గుణ బేధములఁ బరఁగుచు నుండు
నంచు గుణ శాస్త్రమున వివరించి రెలమి
వాని విను యథాతథము నా వలన నిపుడు 19.

కర్త కర్మ జ్ఞానము గుణ భేదములచే మూడు విధము లని గుణ శాస్త్రమునఁ దెలుపఁ బడెను. వానిని వివరించెద వినుము.

సర్వభూతేషు యేనైకం భావమవ్యయమీక్షతే ।
అవిభక్తం విభక్తేషు తజ్జ్ఞానం విద్ధి సాత్త్వికమ్ ॥

తే.గీ. వేరుగఁ గనిపించుచు నుండు వివిధ భూత
రాశిఁ గల నవ్యయంబగు రమ్యపు టవి
భక్త భావ మే జ్ఞానమ్ము వలనఁ గాంచు
నా తెలివి సాత్త్వికం బగు నని యెఱుఁగుమ 20.

సకల భూత రాశి లోన వేఱు వేఱుగాఁ గకనిపించు నవ్యయ మైన సుందరపు టవిభక్త భావము నే జ్ఞానము వలన జూతుమో దానిని సాత్త్వికముగ నెఱుంగుము.

పృథక్త్వేన తు యజ్జ్ఞానం నానాభావాన్పృథగ్విధాన్ ।
వేత్తి సర్వేషు భూతేషు తజ్జ్ఞానం విద్ధి రాజసమ్ ॥

తే.గీ. జీవు లందు వేర్వేరుగఁ జెలఁగు భావ
ములను వీక్షించి యభ్భావములను వేరు
వేరుగనె కాంచు నే తెలివిని వహించి
యట్టి జ్ఞానము రాజసం బని యెఱుఁగుమ 21.

జీవు లందు వివిధము లైన భావములను జూచి వానిని వేఱు వేఱుగా నే జ్ఞానమునఁ జూచునో యట్టి జ్ఞానము రాజసము.

యత్తుకృత్స్న వదేకస్మిన్కార్యే సక్తమహైతుకమ్ ।
అతత్త్వార్థవదల్పం చ తత్తామసముదాహృతమ్ ॥

తే.గీ. ఏది యొక్క కార్యమ్మున నిచ్చ నుంచుఁ
బూర్ణముగ లేక కారణము నెఱుఁగకయు
దత్త్వము నొకింతయును నల్ప తరపు టట్టి
జ్ఞానము వచింపఁ బడుఁ దామసం బనంగ 22.

ఏది యొక్క పని పై నిండుగ నిష్టము నుంచునో యకారణముగ దత్త్వము కొంచెమైన నేరకయే యట్టి యల్పమైన జ్ఞానము తామస జ్ఞానము.

నియతం సఙ్గరహితమరాగద్వేషతః కృతమ్ ।
అఫలప్రేప్సునా కర్మ యత్తత్సాత్త్వికముచ్యతే ॥

తే.గీ. ఫలము నందాశ లేక తగులము వీడి
ద్వేషము మఱి రాగమ్మును విడిచి నియమి
తంబయిన యెట్టి కర్మముఁ దలఁచి చేయ
నెంతు రప్పని సాత్త్వికమే యనఁబడు 23.

ఫలముపైఁ గోరిక, యాసక్తి, ద్వేషము రాగములను వీడి నియమింపఁ బడిన యే
కర్మమును జేయ నెంచుదురో యట్టి పని సాత్త్వికము.

యత్తుకామేప్సునా కర్మ సాహఙ్కారేణ వా పునః ।
క్రియతే బహులాయాసం తద్రాజసముదాహృతమ్ ॥

తే.గీ. కోరికలు గల వానిచే మూర దర్ప
మంత యాతనలకు నోర్చి సంతతమ్ము
చేయఁబడు నెట్టి కర్మము చింత సేయ
నట్టి కర్మము రాజస మన వినఁ బడు 24.

కోరికలతో, గర్వముతో యాతనలకు నోర్చి యే పనినిఁ జేయ నెంచుదురో యా పని
రాజసము.

అనుబన్ధం క్షయం హింసామనపేక్ష్య చ పౌరుషమ్ ।
మోహాదారభ్యతే కర్మ యత్తత్తామసముచ్యతే ॥

తే.గీ. హాని హింస పర్యవశేష మగుచుఁ బౌరు
షమ్మొకింతయు లేక యజ్ఞానమున మొ
దలిడు నెట్టి కర్మమ్మును దగిలి యట్టి
కర్మ మనఁబడుఁ దామస కర్మ మంచు 25.

హాని హింసలు పర్యవసానముగా నుండ సామర్ధ్యము లేక తెలివి లేక మొదలు పెట్టు

పని తామసము.

ముక్తసఙ్గోఽనహంవాదీ ధృత్యుత్సాహసమన్వితః ।
సిద్ధ్యసిద్ధ్యోర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే ॥

తే.గీ. వాంఛ లేని వాఁ డే నని వాదన నొన
రింప నట్టి వాఁ డుత్సాహ మింకను ధృతి
నొప్పి ఫలితముల వికార ముండ నట్టి
వాఁడు సాత్త్విక కర్త నాఁ బలుకఁ బడును 26.

అహంభావము లేక వాంఛయు లేక యుత్సాహము, పట్టుదలతో నుండి ఫలితముపై
మనస్సు నుంచక పనులు చేయువాఁడు సాత్త్విక కర్త యనఁ బడును.

రాగీ కర్మఫలప్రేప్సుర్లుబ్ధో హింసాత్మకోఽశుచిః ।
హర్షశోకాన్వితః కర్తా రాజసః పరికీర్తితః ॥

తే.గీ. రాగ మున్నవాఁడు పనుల లాభ మాశ
పడెడు వాఁడును బిసినారి బాధకుండు
నశుచి హర్ష శోకమ్ముల నలయు వాని
నందు రెఱిఁగి రాజస కర్త యనఁగఁ బార్థ 27.

రాగము కలవాఁడు, లాభాసక్తుఁడు, పిసినారి, బాధలు పెట్టు వాఁడు, శుభ్రత లేనివాఁడు
సుఖ దుఃఖముల మునుఁగు వాఁడు రాజసంపుఁ గర్త యనఁ బడును.

అయుక్తః ప్రాకృతః స్తబ్ధః శఠో నైష్కృతికోఽలసః ।
విషాదీ దీర్ఘసూత్రీ చ కర్తా తామస ఉచ్యతే ॥

తే.గీ. పామరుఁ డయుక్తుఁడు జడుఁడు వంచకుండు
సోమరియుఁ బాపకర్ముఁడు శోక మతియుఁ
గాల యాపన చేయుట మూల మంత్ర
మైన వాఁడు తామస కర్త యనఁగఁ జెల్లు 28.

మూఢుఁడు, నయుక్తుఁడు, జడుఁడు, మోసకారి, సోమరి, పాప కర్ముఁడు,  శోకముల మునుఁగు వాఁడు, కాల యాపన చేయు వాఁడు తామస కర్తగాఁ బిలువఁ బడును.

బుద్ధేర్భేదం ధృతేశ్చైవ గుణతస్త్రివిధం శృణు ।
ప్రోచ్యమానమశేషేణ పృథక్త్వేన ధనఞ్జయ ॥

తే.గీ. గుణములను బట్టి వీక్షించు కొనిన మూడు
విధము లుండును భేదము వేఱు వేఱు
గను నశేషముగను బుద్ధికిని ధృతికిని
నని నుడువఁ బడును ధనంజయ విను దాని 29.

బుద్ధికి ధైర్యమునకు గుణముల బట్టి మూడు విధముల భేద ముండును. వేఱు వేఱుగా నశేషముగా ధనంజయా వానిని వినుము.

ప్రవృత్తిం చ నివృత్తిం చ కార్యాకార్యే భయాభయే ।
బన్ధం మోక్షం చ యా వేత్తి బుద్ధిః సా పార్థ సాత్త్వికీ ॥

తే.గీ. ఎట్టి బుద్ధి ధనంజయ యెఱుఁగు నడవ
డియు నుడుగుటయును భయ మభయము మఱియుఁ
గార్యము నకార్యము విడుపుఁ గట్టుపడుట
యట్టి బుద్ధి సాత్త్విక మగు నంచితముగ 30.

అర్జున యే బుద్ధి పట్టు విడుపుల నెఱుఁగునో, భయాభయములను, కార్యా కార్యములను బంధ మోచనముల నెఱుంగునో యట్టి బుద్ధి సాత్త్విక బుద్ధి.

యయా ధర్మమధర్మం చ కార్యం చాకార్యమేవ చ ।
అయథావత్ప్రజానాతి బుద్ధిః సా పార్థ రాజసీ ॥

తే.గీ. ధర్మము నధర్మమును జేయఁ దగిన తగని
పనుల నున్న రీతినిఁ గాక పరముగఁ దెలి
యఁ గల దట్టి బుద్ధినిఁ బార్థ యరయ వలయు
రాజసమ్మని భారత రమ్యముగను 31.

ధర్మము నధర్మము, యుక్తము లయుక్తము లైన పనుల నున్న రీతిఁ గాక
వ్యతిరేకముగా నెఱిఁగిన బుద్ధి రాజస బుద్ధి యగును.

అధర్మం ధర్మమితి యా మన్యతే తమసావృతా ।
సర్వార్థాన్విపరీతాంశ్చ బుద్ధిః సా పార్థ తామసీ ॥

తే.గీ. ధర్మ మని యధర్మము నెంచి తమము గూడి
సర్వ విషయమ్ముల నెద నఖర్వపు విప
రీత బుద్ధినిఁ దలఁచు నా రీతి బుద్ధి
తామస మని యెఱుంగు పార్థ మది నీవు 32.

అధర్మమును ధర్మముగా నెంచి యజ్ఞానముతో నన్ని విషయములను
విపరీతములుగాఁ దలఁచు బుద్ధి తామస బుద్ధి.

ధృత్యా యయా ధారయతే మనఃప్రాణేన్ద్రియక్రియాః ।
యోగేనావ్యభిచారిణ్యా ధృతిః సా పార్థ సాత్త్వికీ ॥

తే.గీ. ఎట్టి దైన ధృతిని ధరియించు మనము
ప్రాణము మఱి యింద్రియముల పనుల నెల్లఁ
జెదర నట్టి యోగము నూని చెలఁగు నట్టి
ధృతిని సాత్త్విక మని పార్థ తెలియు మింక 33.

ఏ ధైర్యము వహించి మనస్సు, ప్రాణము మఱియు నింద్రియముల పనులను జెదరని
యోగమునఁ జేయునో యట్టి ధృతి సాత్త్విక ధృతి.

యయా తు ధర్మకామార్థాన్ధృత్యా ధారయతేఽర్జున ।
ప్రసఙ్గేన ఫలాకాఙ్క్షీ ధృతిః సా పార్థ రాజసీ ॥

తే.గీ. ఏ ధృతి వహించి ఫలముల నెల్లఁ గోరి
మమత తోడ ధర్మార్థ కామముల నూను
నట్టి ధృతినిఁ బార్థ యెఱుఁగు మర్జున యది 34.

రాజస మని యనబడును రమ్యముగను

ఫలములను గోరుచు ధర్మార్థ కామముల కొఱకు వహించు ధృతి రాజస ధృతి.

యయా స్వప్నం భయం శోకం విషాదం మదమేవ చ ।
న విముఞ్చతి దుర్మేధా ధృతిః సా పార్థ తామసీ ॥

తే.గీ. దేని చేత నిద్ర భయము తీవ్ర శోక
మింక గర్వము దుర్బుద్ధి యెప్పుడు విడు
వంగ నేరఁ డా ధృతి యనఁబడును బార్థ
తామసంపు ధైర్యం బని తథ్యముగను 35.

ఏ ధృతి చేత నిద్ర, భయము, శోకము, గర్వము, దుర్బుద్ధి వీడ జాలఁడో యా ధృతి తామస ధృతి.

సుఖం త్విదానీం త్రివిధం శృణు మే భరతర్షభ ।
అభ్యాసాద్రమతే యత్ర దుఃఖాన్తం చ నిగచ్ఛతి ॥

తే.గీ. అబ్బెసమ్మున నెచ్చట నుబ్బు చుండు
దుఃఖమున కంతమును బొందుఁ దూర్ణముగను
ముప్విధము లైన యా సుఖమ్మును విను భర
తర్షభ నిట నా చేతను హర్ష మొదవ 36.

అభ్యాసమున వృద్ధి చెందు దుఃఖ మునకు నంతము నరయు సుఖము కూడా మూడు విధముల నుండును. వానిని తెలిపెద విను మర్జున.

యత్తదగ్రే విషమివ పరిణామేఽమృతోపమమ్ ।
తత్సుఖం సాత్త్వికం ప్రోక్తమాత్మబుద్ధిప్రసాదజమ్ ॥

తే.గీ. ఏది మొదట విషము భంగి నింక నంత
మందు నమృతమ్ము పగిదిని నలరు చుండి
నాత్మ బుద్ధి ప్రసన్నత నడరి యిచ్చు 37.

నట్టి సుఖమును సాత్త్విక మంచు నంద్రు

ఏది మొదట విషము వలెఁ గనిపించి చివర నమృతము వలె నయి ప్రసన్న బుద్ధి నొసఁగునో యది సాత్త్విక సుఖము.

విషయేన్ద్రియ సంయోగా ద్యత్త దగ్రేఽమృతోపమమ్ ।
పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతమ్ ॥

తే.గీ. ఇంద్రియ విషయములఁ గూడి యెయ్య దుండు
మొదట నమృత తుల్యమ్మునై పిదప విష స
మమ్మునై పరఁగెడు నా సుఖమ్ము నుడువఁ
బడును రాజస మంచును బార్థ వినుమ 38.

ఇంద్రియ విషయములను గూడి మొదట నమృత సమముగాను దుదిని విష తుల్యముగాఁ గనిపించు సుఖములు రాజస సుఖము లనబడును.

యదగ్రే చానుబన్ధే చ సుఖం మోహనమాత్మనః ।
నిద్రాలస్యప్రమాదోత్థం తత్తామసముదాహృతమ్ ॥

తే.గీ. సోమరి తనము నిద్రయు నేమఱికను
బుట్టి నట్టి తనకు మోహము నుదయింపఁ
జేయు నట్టిది ముందును జివర నందు
నట్టి సుఖము తామస మని యనఁబడు నిఁక 39.

మోహమును ముందును జివరను గలిగించునదియు, సోమరి తనము, నిద్ర, యేమఱికల వలనఁ బుట్టి నట్టి సుఖము తామస సుఖ మగును.

న తదస్తి పృథివ్యాం వా దివి దేవేషు వా పునః ।
సత్త్వం ప్రకృతిజై ర్ముక్తం యదేభిః స్యాత్త్రిభి ర్గుణైః ॥

తే.గీ. ప్రకృతిఁ బుట్టిన యీ గుణత్రయ విముక్త
మైన యట్టి యే సత్త్వమ్ము నేనిఁ గాంచ 40.

లేము భువినందు దివినందు లేక దేవ
వరుల లో నైన నెన్నండు పార్థ వినుమ

ప్రకృతితోఁ బుట్టిన యీ మూడు గుణములను విడిచిన యే జీవిని భూమిపైఁ గాని
స్వర్గమునఁ గాని దేవత లందుఁ గాని  కాంచ లేము.

బ్రాహ్మణ క్షత్రియ విశాం శూద్రాణాం చ పరన్తప ।
కర్మాణి ప్రవిభక్తాని స్వభావప్రభ వైర్గుణైః ॥

తే.గీ.   వారి వారివి యౌ స్వభావములఁ బుట్టి
నట్టి గుణముల చేత నయమ్ముగ విభ
జింపఁ బడియెఁ బరంతప చేయు పనులు
బ్రాహ్మణ క్షత్రి యార్య శూద్ర జనులకును   41.

వారి వారి స్వభావముల వలన బుట్టిన గుణముల చేత బ్రాహ్మణులకు, క్షత్రియులకు,
వైశ్యులకు శూద్రు లకుఁ జేయఁ దగు పనులు విభజింపఁ బడినవి.

శమో దమస్తపః శౌచం క్షాన్తిరార్జవమేవ చ ।
జ్ఞానం విజ్ఞానమాస్తిక్యం బ్రహ్మకర్మ స్వభావజమ్ ॥

తే.గీ.   శాంతి నిగ్రహము శుచియు సహనము సర
ళతయుఁ దపము మోక్షంపు శాస్త్రంపు టెఱుక
నమ్మక మ్మీశ్వరుని యందుఁ బమ్మి యుంట
బ్రాహ్మణుని పని ప్రకృతి నుద్భవ మయినది   42.

బ్రాహ్మణుల పనులు స్వభావము వలన బుట్టినవి శాంతి, నిగ్రహము, శుచిత్వము,
సహనము, సరళత, దపము, మోక్ష జ్ఞానము, నీశ్వరుని పై నమ్మకము నుంచుట
మున్నగునవి.

శౌర్యం తేజో ధృతిర్దాక్ష్యం యుద్ధే చాప్యపలాయనమ్ ।
దానమీశ్వరభావశ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్ ॥

తే.గీ. శౌర్యము ధృతి తేజమ్ము దక్షతయు సమర
మందు వెనుదీయ కుండుట నెందు దాన
గుణము నీశ్వర భావము గూడి యుంట
క్షాత్ర మగు పని నిజ భావ జనితమునను 43.

శౌర్యము, ధైర్యము, తేజము, దక్షత, యుద్ధమునఁ బాఱకుండుట, దాన గుణము, ప్రభు భావము కలిగి యుండుట మున్నగునవి క్షత్రియుల పని. వారి స్వభావ జనితములు.

కృషి గౌరక్ష్య వాణిజ్యం వైశ్యకర్మ స్వభావజమ్ ।
పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్ ॥

తే.గీ. సేద్యము పశు పాలనము నంచితము నైన
వర్తకము స్వభావపుఁ బని వైశ్యులకును
సేవనము చేయు బుద్ధియ స్వీయ భావ
జ మయిన పని యగును శూద్ర జనుల కెలమి 44.

సేద్యము, పశువుల పాలనము, వర్తకము, వైశ్యులకు స్వభావ జనితము లైన పనులు. సేవలు సేయుట శూద్రులకు సహజమైన పని యగును.

స్వే స్వే కర్మణ్యభిరతః సంసిద్ధిం లభతే నరః ।
స్వకర్మనిరతః సిద్ధిం యథా విన్దతి తచ్ఛృణు ॥

తే.గీ. తనది యైన యట్టి పనిలోఁ దద్ద రతి వ
హించి సిద్ధిఁ బడయు నరుఁ డంచితముగ
నెట్లు పొందును సిద్ధిని నీ నరుండు
దన పనిని నుంచి శ్రద్ధను దాని వినుమ 45.

నరుఁడు తన పని యందు నిష్టము నుంచి సిద్ధినిఁ బొందును. శ్రద్ధ నుంచి నరుఁ డే విధముగా సిద్ధి పొందునో తెలిపెద విను మర్జున.

యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతమ్ ।

స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః ॥

తే.గీ. ప్రాణుల ప్రవృత్తి యెవ్వని వలన నౌను
సకలము పెరిగె నెవ్వని సత్త్వముననుసకలము పెరిగె నెవ్వని సత్త్వముననుసకలము పెరిగె నెవ్వని సత్త్వమునను
వాని స్వీయ కర్మము లనవరత మర్చ
న నొనరింపఁ బొందును సిద్ధిని నతఁ డింక 46.

ప్రాణు లెవ్వని వలన కలిగి నడుచు చున్నవో, యెవ్వని బలమునఁ బెరుగు చున్నవో వానిని నరుఁడు తనకు విద్యుక్త మైన పనులను జేయుచు నర్చించిన సిద్ధినిఁ బడయును.

శ్రేయాన్స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్ ।
స్వభావనియతం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్ ॥

తే.గీ. చెడు దయినఁ దన ధర్మము చెలువ మడర
నాచరించిన శ్రేయమ యగు నితరుల
ధర్మమున కన్న తన దైన ధర్మము నొన
రించు వాఁడు వొందఁడు పాప మించుకయును 47.

బాగుగ నాచరించిన పర ధర్మము కన్న చెడ్డ దైనను తన పనులను జేసిన మేలు కలుగును. దన పనులు చేయు వాఁడు పాపములను బొందఁడు.

సహజం కర్మ కౌన్తేయ సదోషమపి న త్యజేత్ ।
సర్వారమ్భా హి దోషేణ ధూమేనాగ్నిరివావృతాః ॥

తే.గీ. సహజ మైన కర్మ మది దోషయుత మైన
విడువఁ గూడదు కౌంతేయ పెల్మిడి నిర
తమ్ము కప్పు నగ్నిని నట్ల తగిలి యుండు
దోషములు పను లన్నిటిఁ దోరముగను 48.

తనకు సహజ మైన పని దోష మైన నెన్నఁడు విడువ రాదు. బూడిద నగ్నినిఁ గప్పి యుండు రీతిఁ బను లన్నియు నేదేని దోషముతోఁ గూడియే యుండును.

అసక్తబుద్ధిః సర్వత్ర జితాత్మా విగతస్పృహః ।
నైష్కర్మ్యసిద్ధిం పరమాం సంన్యాసేనాధిగచ్ఛతి ॥

తే.గీ. అన్ని విషయము లందెట్టి యాశ నుంచ
కుండ మనసు నణఁచి వీడి కోరికలను
బరమ మైన నిష్కామపుఁ బనుల ఫలము
వడయఁ గలరు సన్న్యాసము వలన నెమ్మి 49.

ఏ విషయము లందు నాశ నుంచక మనస్సును నిగ్రహించి కోరికలను వీడి
నిష్కామపుఁ బనుల ఫలమును సన్న్యాసము వలనఁ బొందఁ గలరు.

సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ తథాప్నోతి నిబోధ మే ।
సమాసే నైవ కౌన్తేయ నిష్ఠా జ్ఞానస్య యా పరా ॥

తే.గీ. సిద్ధిఁ బడసిన వాఁ డటఁ జేరు నెట్లు
బ్రహ్మమును జ్ఞానపు టునికి పరఁగు నెట్లు
వానిఁ గౌంతేయ సంక్షిప్త భాతి నుడువ
నేను దెలిసికొనుమ యింక మానితముగ 50.

సిద్ధిఁ బడసిన నరుఁడు బ్రహ్మము నెట్లు జేరునో జ్ఞానపు టుత్తమ మైన నిష్ఠ
యెట్లుండునో సంక్షిప్తముగాఁ జెప్పెదను విను మర్జున.

బుద్ధ్యా విశుద్ధయా యుక్తోధృత్యాత్మానం నియమ్య చ ।
శబ్దాదీన్విషయాంస్త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్య చ ॥

తే.గీ. శుద్ధ మగు బుద్ధి తోడుత సురుచిరమగు
ధైర్యమునఁ దన్ను యంత్రించి తగిన రీతి
విడిచి దుస్తర శబ్దాది విషయములను
వీడి ద్వేష రాగమ్ములు వేగముగను 51.

శుద్ధమైన బుద్ధితో ధైర్యముతోఁ దనను నియంత్రించు కొని శబ్దాది యింద్రియ

విషయములలోఁ దగులు కొనక రాగ ద్వేషములను వీడి

వివిక్త సేవీ లఘ్వాశీ యతవాక్కాయమానసః ।
ధ్యానయోగ పరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః ॥

తే.గీ. ఒంటిగ వసించు వాఁడు మితోచి తాశ
నుండు వాక్కును జిత్తమును నియమించి
నట్టి వాఁడు ధ్యానము యోగ మందు రక్తి
యున్న వాఁడు వైరాగ్య మందున్న వాఁడు 52.

ఒంటరిగా నుండి మితముగ నుచిత మగు భోజనము గొనుచు మనోవాక్కులను
నియమించి ధ్యాన యోగముల రక్తి నుంచి వైరాగ్యమున నున్న వాఁడు

అహఙ్కారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహమ్ ।
విముచ్య నిర్మమః శాన్తోబ్రహ్మభూయాయ కల్పతే ॥

తే.గీ. నేన యనెడు మతియు బల మేని గర్వ
కామ రోష తతులు మమకారములను
వీడి శాంతము నూనిన వాఁడు పొంద
గలఁడు బ్రహ్మత్వ మింపుగ నలరి పార్థ 53.

అహంకారమును, బల దర్ప కామ రోషములను మమకారమును వీడి శాంతముతో
నున్న వాఁడు బ్రహ్మ తత్త్వమును బొందఁ గలడు.

బ్రహ్మభూతః ప్రసన్నాత్మా న శోచతి న కాఙ్క్షతి ।
సమః సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్ ॥

తే.గీ. బ్రహ్మ మైన వాఁడు నతి నిర్మలపు మనము
వాఁడు కోరఁడు శోకించు వాఁడు కాడు
సముఁడు సకల భూతమ్ము లందు మఱియుఁ బడ
యఁ గలఁ డత్యుత్తమంపు నాదైన భక్తి 54.

బ్రహ్మ భావము బొందిన వాఁడు నిర్మల మైన మనస్సు కలవాఁడు దేనిని కోరఁడు, దేనికిని శోకింపఁడు, సకల భూతము లందు సమ భావముతో నుండును. అతఁడు నా యుత్తమ మైన భక్తినిఁ బొందఁ గలఁడు.

భక్త్యా మామభిజానాతి యావాన్యశ్చాస్మి తత్త్వతః ।
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనన్తరమ్ ॥

తే.గీ. భక్తి నెవ్వఁడు నిజమైన భావమునను
దెలియు నెట్టి వాఁ డెవ రని తెల్లముగను
నన్ను వాఁడు తెలిసి నంత నాదు తత్త్వ
మెల్లఁ జేరఁ గలఁడు నన్ను నెలమి మీఱ 55.

భక్తితో నిజమగు భావమున నే నెట్టి వాని నెవరినో తెలిసిన వాఁడు నా తత్త్వము నెఱిఁగి నన్ను జేరఁ గలఁడు.

సర్వకర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః ।
మత్ప్రసాదా దవాప్నోతి శాశ్వతం పద మవ్యయమ్ ॥

తే.గీ. చేయు చెప్పుడు పను లెల్లఁ జేరి యుత్త
మంపు నాదు శరణు నింక నతఁడు బొంది
నా యనుగ్రహ మంత నమేయముగను
బడయు శాశ్వత మవ్యయ పదము పార్థ 56.

అర్జునా పనులను నిత్యము చేయుచు నా శరణమును గోరి నా యమేయ మైన యనుగ్రహమును బొంది యవ్యయము శాశ్వతము నగు పదమును బొందును.

చేతసా సర్వకర్మాణి మయి సంన్యస్య మత్పరః ।
బుద్ధియోగముపాశ్రిత్య మచ్చిత్తః సతతం భవ ॥

తే.గీ. ఉంచి నా యందుఁ బను లెల్ల నంచితముగ
మనసు చేతను నాదు సంశ్రయము నురు త
రమ్ముఁ గోరుచు బుద్ధి యోగమ్ముఁ నాశ్ర 57.

యించి చిత్తము నాయందు నుంచు సతము

మనస్సులోఁ బనుల నెల్ల నా కర్పించి నా యాశ్రయమును గోరి సమ బుద్ధి యోగము
నాశ్రయించి నీ మనస్సును నా యందు నుంచు మర్జున.

మచ్చిత్తః సర్వదుర్గాణి మత్ప్రసాదాత్తరిష్యసి ।
అథ చేత్త్వమహఙ్కారాన్న శ్రోష్యసి వినఙ్క్ష్యసి ॥

తే.గీ. చిత్త మెపుడు నాయందు నుంచిన మఱి తరి
యింతు వెల్ల సంకటముల నెలమి నా య
నుగ్రహమ్మునఁ గాదేని నుగ్ర దర్ప
మూనుచు విన వేని నశింతు వురక నీవు 58.

నాయందు నిత్యము మనస్సు నుంచినఁ గష్టముల నెల్ల నా దయతోఁ దరింతువు.
అట్లు గాక దర్పముతో నా మాటలు విన కున్న నశింతువు.

యదహఙ్కారమాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే ।
మిథ్యైష వ్యవసాయస్తే ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి ॥

తే.గీ. నే ననెడి భావ మెయ్యది యూని మనము
నందుఁ జేయను యుద్ధము ననుచుఁ దలఁచి
తట్టి యత్నము వ్యర్థమ్మ యగును నీదు
ప్రకృతి నిన్ను నియోగించుఁ బనికి నదియ 59.

అహంకారముతో యుద్ధము చేయ నని నీవు తలఁచిన నది వ్యర్థమే యగును. నీ
ప్రకృతియే నిన్నా పనికి నియోగించును.

స్వభావజేన కౌన్తేయ నిబద్ధః స్వేన కర్మణా ।
కర్తుం నేచ్ఛసి యన్మోహాత్కరిష్యస్యవశోఽపి తత్ ॥

తే.గీ. బంధితుఁడ వీవు నీదు స్వభావజంపుఁ
గర్మము వలనఁ గౌంతేయ కా దనినను 60.

మోహ మంది పరాధీనమున నొనర్తు
వీవు కర్మ మనిష్టుఁడ వేనియు నిఁక

నీవు నీ స్వభావముచే బంధితుఁడవు. మోహముతోఁ గాదనినను పరాధీనమున
నిష్టము లేకున్న నీ వీ పనినిఁ జేయుదువు.

ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి ।
భ్రామయన్సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా ॥

తే.గీ. ఎల్ల జీవుల యంత్రము లెక్కి నట్టి
వారి హృదయమ్ము లందున మూరి నిల్చు
నీశ్వరుండు తనదు మాయ నెల్ల నెఱపి
త్రిప్పుచు సతము నర్జున యొప్పిదముగ 61.

యంత్రము లెక్కిన సకల జీవుల హృదయము లందు నీశ్వరుఁడు నిలిచి తన మాయ
చేత వానిని నిత్యము నడిపించు చుండును.

తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత ।
తత్ప్రసాదాత్పరాం శాన్తిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్ ॥

తే.గీ. వేడు మతనినె భారత పాడిగ శర
ణమ్ము నన్ని భావమ్ముల నెమ్మి వాని
దయను బరమంపు శాంతిఁ బొందంగఁ గలవు
శాశ్వతంపు స్థాన మ్మది సమకొను నిఁక 62.

అర్జున యతనిని శరణు వేడు మింపుగ. వాని దయతో శాంతిని శాశ్వత మైన
స్థానమును బొందఁ గలవు.

ఇతి తే జ్ఞానమాఖ్యాతం గుహ్యాద్గుహ్యతరం మయా ।
విమృశ్యైతదశేషేణ యథేచ్ఛసి తథా కురు ॥

తే.గీ. మర్మముల కెల్ల మర్మము మానుగ నుడు 63.

వ఼ బడియెను నీకు నాచేత఼ బన్నుగ నవ
లోకనము సేసి దీనిని నీకు఼ దోఁచి
నట్టి రీతి఼ జరింపుమ యర్జున యిఁక

అతి రహస్యమైన యీ జ్ఞానమును నీకు఼ దెల్పితిని. దీని నవలోకించి నీకు఼ దోఁచిన
రీతి నర్జున నడువుము.

సర్వగుహ్యతమం భూయః శృణు మే పరమం వచః ।
ఇష్టోఽసి మే దృఢమితి తతో వక్ష్యామి తే హితమ్ ॥

తే.గీ. మిక్కిలి రహస్య మైనవి మేటి వచన
ము లివి నావి వీని మఱల లలితముగను
వినుమ యిష్టుఁడ వైతివి విరివి నందు
వలన఼ జెప్పుచుంటి హితము పార్థ నీకు 64.

ఇవి మిక్కిలి రహస్యములు. నా కిష్టుఁడవు కనుక మఱల చెప్పు చుంటిని వినుము.
ఇవి యెల్ల నీకు హితకరములు.

మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు ।
మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే ॥

తే.గీ. నేను గల చిత్తుఁడ వగుము నీ వగు మురు
భక్తుఁడవు నాకు నర్చింపు పార్థ నన్ను
బ్రణతు లిడు నాకు నన్నిఁక఼ బడయ఼ గలవు
ప్రియుఁడ వైతివి పల్కుదు పేసి యొట్టు 65.

నన్ను నీ చిత్తమున నుంచుము. నాకు భక్తుఁడ వగుము. నన్ను నర్చింపుము.
నమస్కరింపుము. నన్ను జేర఼ గలవు. ఒట్టు పేసి చెప్పు చుంటిని నీవు నాకు఼
బ్రియుఁడవు.

సర్వధర్మాన్పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ।
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః ॥

తే.గీ. వీడి సకల ధర్మమ్ముములు వేఁడు శరణు
నన్ను దుఃఖింప వల దింక నెన్నఁ డీవు
పాప సంచయముల నుండి పన్నుగ నిను
నేన చేయుదును విముక్తునిగను నమ్ము 66.

ధర్మముల నన్నిటిని నింక వీడి నన్ను శరణు వేడుము. దుఃఖింప వలదు. పాపముల నుండి నిన్ను నేను విడిపింతును. నన్ను విశ్వసింపుము.

ఇదం తే నాతపస్కాయ నాభక్తాయ కదాచన ।
న చాశుశ్రూషవే వాచ్యం న చ మాం యోఽభ్యసూయతి ॥

తే.గీ. నీ కొఱక యిది యెన్నఁ డేనియును దీని
నుడువ రాదు తాపసి గాక నడచు వాని
కిని నభక్తునకు నసేవకునకు నింక
నన్ను ద్వేషించు వానికి నెన్న కుండ 67.

నీకుఁ జెప్పిన దీనినిఁ దాపసి కాని వానికి భక్తుఁడు కాని వానికి సేవకుఁడు కాని వానికి నన్ను ద్వేషించు వానికి నెన్నఁడు గణియింపక చెప్ప రాదు.

య ఇదం పరమం గుహ్యం మద్భక్తేష్వభిధాస్యతి ।
భక్తిం మయి పరాం కృత్వా మామేవైష్యత్యసంశయః ॥

తే.గీ. నాదు భక్తుల కెవఁడు ఘనముగ గుహ్య
మైన దీని నెల్ల నుడువు నతఁడు పరమ
భక్తి నుంచి నా యందును బడయఁ గలఁడు
సంశయము వీడి నన్నిఁక సౌఖ్యముగను 68.

నా భక్తులకు నెవఁడు రహస్యమగు దీనినిఁ జెప్పునో యతఁడు నా పై భక్తి వలన నన్ను సందేహము లేకుండ సుఖముగాఁ జేరఁ గలఁడు.

న చ తస్మాన్మనుష్యేషు కశ్చిన్మే ప్రియకృత్తమః ।
భవితా న చ మే తస్మాదన్యః ప్రియతరో భువి ॥

తే.గీ. మానవుల యందు నన్యుఁడు వాని కంటె
నధికముగఁ బ్రీతిఁ గూర్చెడు నట్టి వాఁడు
లేఁడు నాకు మఱియు నుండఁ బోఁ డితరుఁడు
మిగుల నిష్టుఁడు నాకు నీ మేదినిఁ గన 69.

వాని కంటె మానవు లందు నితరుఁ డెవ్వఁడు నాకు నధికముగాఁ బ్రీతిఁ గూర్చు వాఁడు లేఁడు. నాకు మిక్కిలి యిష్ట మయిన వాఁడు ముందు నింక నుండఁడు.

అధ్యేష్యతే చ య ఇమం ధర్మ్యం సంవాదమావయోః ।
జ్ఞానయజ్ఞేన తేనాహమిష్టః స్యామితి మే మతిః ॥

తే.గీ. చదువు నెవ్వఁడు సద్ధర్మ సమ్మతంపు
మన సమాలాప మతని వలనను జ్ఞాన
యజ్ఞమునఁ బూజితుఁడను నే నగుదు నంచు
నేను భావించు చుంటిని నిశ్చయముగ 70.

ఈ మన సల్లాపమును జదివిన వాని వలనను, యజ్ఞము వలనను నేను పూజితుఁడనే యని భావించెదను.

శ్రద్ధావా ననసూయశ్చ శృణుయాదపి యో నరః ।
సోఽపి ముక్తః శుభాఁల్లోకాన్ప్రాప్నుయాత్పుణ్యకర్మణామ్ ॥

తే.గీ. శ్రద్ధ యున్నట్టి వాఁడు ద్వేషమ్ము లేని
వాఁడు నాలకించు నెవఁడు వాఁడు గూడ
ముక్తుఁ డౌచుఁ బూర్ణమ్ముగఁ బోవు పుణ్య
కర్ము లరిగెడు పుణ్య లోకముల కెలమి 71.

శ్రద్ధ కల వాఁడు, ద్వేషము లేని వాఁడు దీని నాలకించిన ముక్తుఁడై పుణ్యాత్ము లరిగెడు లోకములకు నేఁగును.

కచ్చి దేత చ్ఛ్రుతం పార్థ త్వయైకాగ్రేణ చేతసా ।
కచ్చిదజ్ఞానసమ్మోహః ప్రనష్టస్తే ధనఞ్జయ ॥

తే.గీ. వింటివి కద స్థిర మతిని వివరముగను
దీని నర్జున నీ విటఁ దీరుగ లయ
మయ్యెను గద ధనంజయ యొయ్యన నిఁక
నీకు నజ్ఞాన మోహమ్ము నిశ్చయముగ 72.

అర్జునా వింటివి కదా దీనిని స్థిర చిత్తమున. నీ యజ్ఞానముతోఁ గూడిన మోహము తీరినది కదా.

అర్జున ఉవాచ ।
నష్టో మోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదాన్మయాచ్యుత ।
స్థితోఽస్మి గతసన్దేహః కరిష్యే వచనం తవ ॥

అర్జునుని పలుకులు:

తే.గీ. అచ్యుత నశించె నాదు మోహమ్ము నీ య
నుగ్రహమునఁ బొందితి బుద్ధి నుగ్గు లయ్యె
నాదు శంక లన్నియు నిట నీదు పల్కు
లెల్ల నాచరించెద నింక నుల్ల మలర 73.

కృష్ణా నీ దయ వలన నా మోహము నశించెను. బుద్ధినిఁ బడసితిని. నాకు కలిగిన యనుమానము లన్నియు తొలఁగినవి. సంతోషముగ నీ పలుకుల నెల్ల నింక నే నాచరింతును.

సఞ్జయ ఉవాచ ।
ఇత్యహం వాసుదేవస్య పార్థస్య చ మహాత్మనః ।
సంవాదమిమమశ్రౌషమద్భుతం రోమహర్షణమ్ ॥

సంజయుని పలుకులు:

తే.గీ. ఇట్లు వాసుదేవ కిరీటు లింపుగ నొన 74.

రించి నట్టి సంవాదము నంచితముగ
వింటి రోమహర్షణమును వింత యైన
దెల్ల నేనట మిక్కిలి తెల్లముగను

ఈ విధముగా నద్భుత మైన కృష్ణార్జునుల సంవాదమును దేట తెల్లముగా నేను వింటిని. శరీరము పులకించెను.

వ్యాస ప్రసాదాచ్ఛ్రుతవా నేత ద్గుహ్యా మహం పరమ్ ।
యోగం యోగేశ్వరాత్కృష్ణా త్సాక్షా త్కథయతః స్వయమ్ ॥

తే.గీ. వ్యాస భగవానుని యనుగ్రహమ్ము మీఱ
నీ యతి రహస్య యోగము నిట నెలకొని
యుండి కృష్ణుఁడు యోగేశ్వరుండు నుడువ
స్వయముగను నేను వింటి నాశ్చర్యముగను 75.

వ్యాస మహర్షి యనుగ్రహమున నీ మిక్కిలి రహస్య మైన యోగము నిక్కడ నిలిచి సాక్షాత్తు కృష్ణ పరమాత్ముఁడు యోగీశ్వరుఁడు స్వయముగ చెప్పినది యాశ్చర్యముగా వింటిని.

రాజన్సంస్మృత్య సంస్మృత్య సంవాదమిమమద్భుతమ్ ।
కేశవార్జునయోః పుణ్యం హృష్యామి చ ముహుర్ముహుః ॥

తే.గీ. పుణ్య తమము కరంబు నద్భుతము నయిన
కేశ వార్జున సంవాద మీ శుభప్ర
దమ్ము రాజేంద్ర నే మదిఁ దలఁచి తలఁచి
మాటి మాటికి ముదమునుం బడయు చుంటి 76.

ధృతరాష్ట్ర మహా రాజా! పుణ్యతమ మైన యీ హృషీకేశ గుడాకేశుల సంభాషణము శుభప్రదమైన దానినిఁ దలఁచి తలఁచి మాటి మాటికి సంతోషమును బొందు చుంటిని.

తచ్చ సంస్మృత్య సంస్మృత్య రూపమత్యద్భుతం హరేః ।
విస్మయో మే మహాన్ రాజన్హృష్యామి చ పునః పునః ॥

తే.గీ. హరి మహా రూప మద్భుత మ్మది తలఁచి త
లంచి విస్మయ మందుచు నంచితముగ
సంతసించుచు నుండుదు సంభ్రమమున
మఱల మఱల రాజ వరేణ్య మనము నందు 77.

రాజ శ్రేష్ఠా విష్ణువు యొక్క మహాద్భుత రూపమును మనస్సులోఁ దలఁచి తలఁచి
యాశ్చర్యము నానందము మఱల మఱల కలుగఁగ సంభ్రమముతో నున్నాను.

యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః ।
తత్ర శ్రీర్విజయో భూతిర్ధ్రువా నీతిర్మతిర్మమ ॥

తే.గీ. ఉండు యోగేశ్వరుఁడు కృష్ణుఁ డుండగ నెట
నుత్తమ ధనుర్ధరుఁడు పార్థుఁ డుండు నెచట
శ్రీయు నీతి జయము భూతి సేరి యుండు
నంచు నచట ధ్రువముగ నే నెంచు వాఁడ 78.

యోగీశ్వరుఁడు కృష్ణుఁడు ధనుర్ధరుఁ డర్జునుఁడు నెక్కడ నుందురో యక్కడ సంపద,
నీతి, జయము, లైశ్వర్యములు సేరి యుండునని నేను ధ్రువముగా నెంచు చున్నాను.

ఇది శ్రీకృష్ణ సూక్తి సుధాకరమను శ్రీమదాంధ్ర భగవద్గీత యందు మోక్ష సన్న్యాస యోగమను పదునెనిమిదవ యధ్యాయము.

పోచిరాజు కామేశ్వర రావు నామధేయ ప్రణీత శ్రీకృష్ణ సూక్తి సుధాకరము సర్వము సంపూర్ణము.

